# పీఠిక

శ్రీ రమేశ చంద్రదత్తు వంగభాషలో 'వంగవిజేత' 'మాధవీకంకణము' 'రాజపుత్ర జీవనసంధ్య' 'మహారాష్ట్ర జీవన ప్రభాతము' 'సంసారకథ' 'సమాజము' అను నవలలు రచించినాఁడు. కొంతకాలమునకు మాధవీకంకణమును పెంచి మార్పులుచేసి ఆంగ్లభాషలో *The slave girl of Agra* అను పేర ప్రకటించినాఁడు.

ఆంగ్లగ్రంథమును ౧౯౧౧ సంవత్సరమున తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు ఆంధ్రీకరించినారు. తరువాత కొన్ని సంవత్సరములకు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 'దాసీకన్య' అను పేర ఇంగ్లీషు నవలను తెలిఁగించినారు.

శ్రీ శివశంకర శాస్త్రిగారు ౧౯౧౭ సంవత్సరమున వంగమాతృకనుండి 'మాధవీ కంకణము' ను తెలిఁగించి ౧౯౨౦ సంవత్సరమున వారు సంపాదకులుగా నున్న 'సాహితీ' పత్రికలో ప్రకటించిరి. ఆనాఁటి కింకను వ్యావహారికభాష వ్యాపింపలేదు. కావుననే శాస్త్రిగారి గ్రాంథికాంధ్రరచన చవిచూచుభాగ్యము పాఠకలోకమున కబ్బినది.

మాధవీకంకణధారణసౌభాగ్యము సహృదయులకు నేఁటికి మరల సమకూరినది.

రాజమహేంద్రవరము
మే ౧౯౪౧

పి. గణపతి శాస్త్రి.

౧

భాగీరథికిఁ బశ్చిమతీరమునం దున్న వీరనగరగ్రామమున గ్రీష్మర్తువునం దొకనాఁటి సంజవేళ గంగాసైకతమునం దిరువురు బాలకులు, నొక బాలికయు నాడుచుండిరి. సంజమసక క్రమక్రమముగా దట్టమై గ్రామమును, మైదానమును, ప్రశస్త గంగాకూలంకషమును నావరించుచుండెను. నీటిపైఁ గొన్ని పడవలు తేలియాడుచుండెను. దైనికపరిశ్రమాంతమునఁ బడవవాండ్రు వంటలు చేసికొనుచుండిరి. పడవలనుండి వెలువడు దీపకాంతి నదీచంచలగర్భముపై మనోహరముగ నాట్యమాడుచుండెను. నదీతీరమున నున్న వీరనగరపు మామిడితోఁపు తిమిరావృత మగుచుండెను. వృక్షములమధ్యనుండి యక్కడక్కడ నొక్కొక దీపశిఖ దృగ్గోచరమగుచుండెను. పాకక్రియాదిగృహకృత్యములం దున్న కాఁపుభార్యల కంఠధ్వని కుటీరములనుండి నడుమనడుమ వినవచ్చుచుండెను. కృషీవలులు నాగళ్ళుపట్టుకొని పశువు లంబారవములు సేయుచుండఁ దమతమ నివాసములకు మరలుచుండిరి. ఘట్టమునుండి కలశములం దీసికొని యొక్కరొక్కరుగా స్త్రీ లెల్లరు వెడలిపోయిరి. శాంత తిమిరమున విశాల శాంత ప్రవాహిని యగు భాగీరథి సముద్రునిదెసఁ బ్రవహించుచుండెను. రెండవవైపున నున్న స్వచ్ఛవాలుకాతటమును, విస్తారకాంతారమును జీకటి

లో నించుక కానఁబడుచుండెను. గ్రీష్మపీడితమై, క్లాంతమయినలోకము మనోహర సంధ్యాసమయమునఁ బ్రశాంతముగా నుండెను.

బాలికా బాలకులు ముగ్వురు నాటలాడుచుండిరి. బాలికకుఁ దొమ్మిది సంవత్సరము లుండును. ఆమెముఖమును, జెక్కిళ్ళును నుజ్జ్వలములు. దట్టముగా నున్న నల్లని కేశగుచ్ఛములు వానిపై వ్రాలి, చాల నందముగాఁ గానఁబడుచుండెను. హేమలత కనుగ్రుడ్లు మిక్కిలి నల్లగను, భాసమానముగను నుండెను. రూపవతి యైన యాచంచల బాలిక యచ్చరవలె రాతిరివేళ నాగంగాతీరమున నాడుచుండెను.

చిన్నబాలునకు బదునొకండు వత్సరము లుండును. చూడఁగనే యతఁడు హేమలత సహోదరుఁ డని తోఁచును. ముఖమండల మవ్విధముననే కాంతిమంతము, స్వభావము నారీతినే చంచలము. ఆతని యుజ్జ్వల నయనద్వయమునందు మాత్రము పురుషోచిత తేజఃపుంజము కన్పట్టుచుండెను. ఈ వయస్సునకే యున్నత ముఖమండలమందలి నాడు లప్పుడప్పుడు క్రోధోల్బణము లగుచుండెను. నరేంద్రుని జూచుచో నతఁడు తేజస్వియుఁ, గ్రోధపరవశుఁడు నగుబాలుఁ డని తోఁచును.

శ్రీశచంద్రునకుఁ బదుమూఁడు వర్షములు; అయినను పురుషోచిత గాంభీర్యము నవిచలిత స్థైర్యమును బాలునిముఖ

మునఁ బ్రకాశించుచుండెను. శ్రీశుఁడు బుద్ధిమంతుఁడు, శాంతుఁడు, గంభీరస్వభావుఁడు.

బాలురిరువురు నిసుకయిండ్లను గట్టుచుండిరి. ఎవనిది బాగుగ నుండునో హేమలత చూచు నని వారియూహ. గృహనిర్మాణమున నరేంద్రుఁడు మిక్కిలి నేర్పరి. కాని చంచలుఁడు. హేమలత తనసమీపమున నున్నపుడు నరేంద్రునియిల్లు బాగుగ నుండును; శ్రీశుని యిల్లు చూడఁబోయి నపుడు నరేంద్రునకుఁ గోపము వచ్చి, యిల్లు పడిపోవును. పాపము! సుందరమైన మందిరము రెండుమూఁడు సారులు పడిపోయెను.

హేమ యీపర్యాయము నిజముగా శ్రీశుని దగ్గఱకుఁ జనదు. నరేంద్రుఁడు కన్నీరు దుడుచుకొని, మహోల్లాసముతో నిల్లు కట్ట నారంభించెను.

ఇల్లు రమారమిగా సంపూర్ణమాయెను. నరేంద్రునకు విజయము కలుగు ననియుఁ, గాని యొంటరిగా నున్న శ్రీశచంద్రునికడకుఁ బోవకున్న నతఁడే మనుకొనునో యనియు భావించి కేశగుచ్ఛములు గంతులువేయుచుండ నుజ్జ్వల తరంగమాలికవలె హేమలత యొకసారి శ్రీశచంద్రుని నికటమున కేగెను. శ్రీశుఁడు వాలుకాగృహనిర్మాణమున నేర్పరి కాఁడు; కాని ధైర్యముతోను బుద్ధిబలముతోను బాగుగ నుండకపోయినను, ఏదో విధముగా నిల్లు కట్టెను.

నరేంద్రుఁడిల్లు కట్టుచు, హేమవంక నప్పుడప్పుడు చూచుచుండెను. ఇప్పు డతనికిఁ గోపము వచ్చినది. హస్తము కంపమునొందుచున్నది. మంచియిల్లు పడిపోయినది. కుపితుఁడై నరేంద్రుఁ డిసుకఁ దీసికొని హేమలతా శ్రీశచంద్రుల శరీరములపైఁ గొట్టెను. శ్రీశుఁడు విజయి; ఆతని మందిరము సమాప్తమయినది. నరేంద్రునిది కాలేదు.

నరేంద్రుని కోపపుసందడి నాకర్ణించి, పదునేడేండ్ల వితంతు వొకతె ఘట్టమునుండి లేచి వచ్చెను. ఆమె శ్రీశచంద్రుని జ్యేష్ఠసహోదరి, శైవలిని.

శైవలిని వచ్చి, తనతమ్ముని నిందించెను. శ్రీశుఁడు మెల్లమెల్లన 'అక్కయ్యా! నే నేమి చేయలేదు. ఇల్లు కట్టలేక నరేంద్రుఁ డేడ్చినాఁడు. హేమ నడుగు' అని పలికెను.

'కట్టలేక పోనీ–నేను నరేంద్రున కిల్లు కట్టి యిచ్చెదను' అని నరేంద్రు నూరార్చి, శైవలిని కదలిచనెను. శ్రీశుఁడు సోదరివెంట నరిగెను.

హేమలతా నరేంద్రుల కలహము శీఘ్రముగా ముగిసెను. నరేంద్రుఁ డేడ్చుటఁ గాంచి, హేమలత సజలనయనయై 'భాయీ! నీ వెందు కేడ్చెదవు? నే నొకసారి శ్రీశునియిల్లు చూడఁబోతిని. నీయిల్లే చక్కఁగా నుండెను. నీవు దాని నెందుకు పడగొట్టినావు? నీదగ్గఱఁ జాలసేపున్నాను. శ్రీశుని దగ్గఱ కొకసారి వెళ్ళినానో, లేదో! కోపము వద్దు. నీ వెందుల

కేడ్చెదవు, భాయీ !' అని పలికెను. నరేంద్రున కింక నాగ్రహముండఁ గలదా !

అటుపిమ్మట బాలికాబాలకుల కేమి సంభాషణ ముండును? ఆకసమునం దెట్లు నక్షత్రములు ప్రకాశించుచున్నవో! అవి నూవులా ? వజ్రములా ? నరేంద్రుఁ డొకదానిని లాగి కొన్నయెడల నేమి చేయును ? గుచ్చి హేమకంఠమున వేయును ! ఇదిగో, చూడు! చంద్రుఁ డుదయించుటకు ముం దెట్టి కాంతి గలదో? ఆకాంతి యెక్కడనుండి వచ్చుచున్నదో? నదిని దాఁటి, కొంతదూరము పోయినయెడల నా వెలుతురు పట్టుబడును. కాదు, ఆలా గయినచో నాతీరమందలి జనులకుఁ గాంతి దొరకును. పడవలోఁ జాలదూరము పోవఁగాఁబోవఁగాఁ జంద్రు డుదయించు దేశము చేరవచ్చును. ఆ దేశమున నెట్టి జను లుందురో చూడఁ గోరిక గలదు.

౨

నరేంద్రనాథునితండ్రి వీరేంద్రనాథదత్తు ధనాఢ్యుఁడు, ప్రతాపశాలియు నగు జమీందారు. పెద్ద హర్మ్యమును నిర్మించి తనపేరిట నతఁడు గ్రామమునకు 'వీరనగరము' అని పేరు పెట్టెను. నిజమైన సౌజన్యమున కంద ఱాయనను గౌరవించుచుఁ, బ్రబలప్రతాపమునకు వెఱచుచుండిరి. పఠాన్లు, జాగీర్దార్లు, సుబాదారు సయిత మాయనను సన్మానింతురు.

చిన్నతనమున వీరేంద్రుఁడు నవకుమారమిత్రుఁ డను దరిద్రబాలుఁడు సహపాఠిగా పాఠశాలయందు విద్యాభ్యాసము

సేయుచుండెను. నవకుమారుఁడు మిగుల సుశీలుఁడు, నమ్రుఁడు; తేజస్వి యగు వీరేంద్రున కెప్పుడు లొంగి యుండెడి వాఁడు. కావున వానియెడ వీరేంద్రునకు స్నేహ ముదయించెను. యౌవనకాలమున వీరేంద్రుఁడు జమీా సంస్థాపించినపుడు నవకుమారుని బిలిపించి, మంత్రిపదమునందు నియోగించెను. చాలబుద్ధిమంతుఁడు, నేర్పరియు నగు నవకుమారుఁడు సక్రమముగాఁ గార్యములు నిర్వహింప నారంభించెను. స్వార్థపరుఁడయినను నవకుమారుఁడు నీచుఁడు కాఁడు. నాలుగైదు గ్రామములు వీరేంద్రుని యాచించి, తనపేర వ్రాయించుకొనెను. భయముచేఁ గాని, కృతజ్ఞతచేఁ గాని యతఁడు వీరేంద్రుని జమీాందారీ కెట్టి నష్టము చేయలేదు. వీరేంద్రుని మరణకాలమునాఁటికి నరేంద్రుఁడు పసివాఁడు. జమీాందారీభారము, కుమారునిభారమును బ్రియమిత్రునిహస్తములందుంచి, వీరేంద్రుఁడు మానవలీలనుండి విరతిఁ జెందెను.

అనురాగము తగ్గునంతగా హెచ్చదు. తలిదండ్రుల యెడ ననురాగము, సంతానమునెడఁ బ్రేమవలె బలీయము గాదు. దయకంటెఁ గృతజ్ఞత దుర్బలము, క్షణభంగురము. నవకుమారుని కృతజ్ఞత త్వరలో విచ్చిపోయెను.

నవకుమారుఁడు కేవలము నీచుఁడు కాఁడు. కాని దరిద్రుఁడు. కార్యక్రమమున జమీా యంతయు హరింపవలె నను కోరిక యాతని హృదయమునఁ బొడమెను. అట్టిలోభము దరిద్రునకు దుర్దమనీయము. వీరేంద్రుని కుమారుఁడు శిశువు.

ఆయనభార్య ముందే మృతి నొందెను. పసివానిని రక్షించు జ్ఞాతు లెవ్వరును లేరు; ఉన్న యొకరిద్దఱు నవకుమారుని పక్షము నవలంబించిరి.

అట్లయినను, జమీాయంతయుఁ దా నొక్కఁడే హరింప వలె నను తలంపు మొదట నవకుమారునకు లేదు. వీరేంద్రుఁడు బ్రతికియున్నకాలముననే యతఁడు నాలుగైదు గ్రామములు తనపేరఁ బెట్టించుకొనెను; ఇపుడు మఱినాలుగైదు గ్రామములు తనపేరఁ బెట్టుకొనఁ జొచ్చెను. క్రమముగా లోభము వృద్ధి నొందసాగెను. 'నా యొకేకకూఁతురు హేమకు నరేంద్రునకు వివాహము చేసెదను. తుదకు వీరేంద్రునిజమీా యాయన కుమారునిదే యగును. ఇప్పుడు చిన్నవానిపేర జమీాందారీ యున్నయెడల గజిబిజి కావచ్చును; ప్రస్తుతము నాపేర నున్నదో నే యాటంకము కలుగఁ జాలదు' అని భావించి, యతఁడు తదనుగుణముగాఁ గార్యములు నిర్వహింపఁ దొడఁగెను.

ఆకాలమునఁ బెద్దపెద్ద జమీాందార్లకు, జాగీర్దార్లకును నొక్కొక్క వకీలు సుబాదారుదర్బారునం దుండెడివాఁడు. ఆవకీళ్ళు తమతమ యజమానులకడ నుండి యప్పు డప్పుడు కానుకలు సమర్పించి, సుబాదారుమనస్సు సంతుష్టముగా నుంచుచు, విజ్ఞాపనాది సమస్తకార్యములను నిర్వర్తించు చుందురు. ప్రధానస్థానమున నిట్టివకీలు లేనిపక్షమున జమీాకీ

జాల నష్టము కలుగుటకు వీలుండెను; విశేషించి, జమీా పరహస్తములం బడుటకుఁ గూడ నవకాశ ముండెను.

వీరనగరజమీాందారువకీలు ప్రస్తుతము నవకుమారుని జీతము తినువాఁడు. అతఁడు వంగదేశపు ♦ కానూంగో మహాశయుని సన్నిధి నీ విధముగా విన్నవించెను: "వీరేంద్రుని మరణము మొదలుకొని యీాజమీానుండి సిస్తు నియమాను సారముగా వచ్చుట లేదు. అయినను, నవకుమారుఁ డను కార్యదక్షుఁడు ఆజమీా భారము వహించి, తన గృహామునుండి కప్పమును తిరుణమునఁ బంపుచున్నాఁడు. నవకుమారుఁడు వీరేంద్రునకు మిక్కిలి యాత్మీయుఁడు, వీరేంద్రుని పరివారమునంతను సంరక్షించుచున్నాఁడు" ఈ విన్నపముతో నయిదువేల రూపాయలు కానూంగోమహాశయుని సన్నిధానమును జేరెను. విన్నపమునకు విరుద్ధముగాఁ బల్కువా రెవ్వరును లేరు. తోడనే వీరేంద్రుని పేరు కొట్టువడి, నవకుమారుని పేరు లిఖితమాయెను. నేఁడు నవకుమారమిత్రుఁడు వీరనగర జమీాందారు !

జమీాందారునకు హృదయమునఁ గ్రొత్త క్రొత్తయూహ లావిర్భవింపఁజొచ్చెను. పూర్వమున వీరేంద్రునితండ్రినిబూజించు చుండెడివానికి, ఇంతవఱకును వీరేంద్రుని యత్నముతోఁ బోషించియున్నవానికి నేఁడా నరేంద్రుఁడు నయనశూల మయ్యెను. యెల్లరు 'నరేంద్రునితండ్రిజమీా' యనుచుందురు.

♦ గ్రామములలెక్కలను పట్టావారీలను తనిఖీచేయు నధికారి.

కాని యెవ్వండును 'నవకుమారుని జమీా' యనుట లేదు. గ్రామములోని ప్రజలును నరేంద్రునిఁ జూచి, 'జమీాందారు కుమారుఁ' డందురు; ఇప్పటి జమీాందారు నవకుమారుఁ డిది యంతయు సహింపఁగలుగునా? 'నింద మోయుటకేనా నే నీజమీా సంపాదించినాను? నరేంద్రునకు హేమకు వివాహ మయిన పిదపఁ దండ్రిజమీా కొడుకునకు వచ్చిన దని యెవ్వఁ డనకుండును? నాపే రెచట నుండును? ఇంత చేసినమీాఁద ఫలిత మిదియా? నేను జమీాందారునయినను బాలుని దివానునా? సయత్నముగా జమీా రక్షించి, తరువాత నరేంద్రునకు మరల నిత్తునా?' అని చింతించుచు విచక్షణుఁడు, ధీర మంతుఁడు నగు నవకుమారుఁడు తనపేరు చిరస్మరణీయ ముగాఁ జేయుట ముఖ్యమనియు, దత్తపుత్రుని స్వీకరింపవలె ననియు, కాదా యెవఁడో దరిద్రునకుఁ దనకుమారిత హేమ లతను వివాహము చేయవలె ననియు నిశ్చయించెను.

నవకుమారుఁ డిట్టి చక్కని సిద్ధాంతము చేసి, కార్య సాధనోద్యోగి యయ్యెను. సమీాప గ్రామములో గోకుల చంద్రదాసుఁ డను పెద్దమనుష్యుఁ డొక కుమారుని, వితంతు పుత్రికను, కొద్దియాస్తిని విడిచి మరణించెను. తనూజుని పేరు శ్రీశచంద్రదాసుఁడు, కుమారిత పేరు శైవలిని. నవకుమారుఁడు శ్రీశచంద్రుని వీరనగరమునకుఁ బిలిపించి పోషింపఁ జొచ్చెను. శైవలిని యత్తవారింట నుండును. సోదరునిఁ జూచుట కప్పు

డప్పుడు వచ్చి యొకటిరెండు రోజు లుండును. తమ్ముఁడు తప్ప నా యనాధ కీలోకమున నెవ్వరు లేరు.

నవకుమారుఁడు దయాశూన్యుఁడు కాఁడు. వీరేంద్రుని జ్ఞాతికుటుంబమును గృహమునుండి వెడలఁగొట్టలేదు. వారం దఱు దాసజనముఖలె వంటలు మొదలగు పనులు చేయుచు, రేయుంబవళ్ళు నవకుమారునిభార్యను బహిరంగముగాఁ బొగ డుచు, నామెకు సంతుష్టి కలిగించుచు లోలోపల విధాతను నిదించుచుందురు. నవకుమారుఁడు నరేంద్రు నింకను సంర క్షించుచుండెను. ఆయన నలుగురి యెదుట నిరంతర మంద హాసముతో ని ట్లనును: "ఏమి చేయను! వీరేంద్రునకు జమీసంగతి తెలియదు. ఆస్తి యంతయు వ్యయము చేసెను. పరులచేతిఁ బడెనేని వీరేంద్రుని పరివారమునకుఁ,గుమారునకుఁ గష్టము కలుగు నని నేనే జమీ కొన్నాను; కానిచో జమీలో నేమిలాభము? దిక్కు లేని నరేంద్రు నిప్పటికి నేను సంరక్షించు చున్నాను; వీరేంద్రుని పెద్ద పరివారమునకు నేనే యన్న వస్త్రము లిచ్చుచున్నాను. ఏమి చేయను! మానవులు కష్ట పడుచుండఁగా నేను జూడలేను. ఆలోచించి చూడుఁడు; భగవంతుఁడు ధన మిచ్చిన దెందులకు! నలుగురకుఁబెట్టిన సుఖ మున్నది. కాని, దాఁచిపెట్టిన లేదు. నే నితరులకుఁ బెట్టుదును; అందువలన నా కేమాత్రము మిగులకపోయిననుమంచి దే!"

అనుచరు లి ట్లనుచుందురు: "నిజము. తమరు మహా శయులు, దయాస్వరూపులు. అందుచేత నే యిట్లు చేయు

చున్నారు. ఇతరు లిట్లు చేయుదురా? ఎందఱో జమీందారు లున్నారు; తమరు వీరేంద్రుని పరివారమునకుఁ జేయునట్లు మ రెవ్వరైన, నెవరికైనఁ జేయుదురా? ఆహా! తమరు లేని పక్షమున నరేంద్రున కెవ రన్నము పెట్టుదురు? తదితరుల నెవరు పోషింతురు? రెండు వేళల వారు కడుపునిండ భుజింపఁ గలుగుట కేవలము తమ యనుగ్రహముచేత. తమవంటి పుణ్యజనులు మఱి కలరా?"

మందహాసవిస్ఫారిత నేత్రములతో, హర్షగద్గద స్వరముతో నవకుమారుఁ డిట్లు బదులు పలికెను: "లేదు, బాబులారా! నేను బుణ్య మెఱుఁగను. నా కేమియుఁ దెలియదు. కాని, లోకులకష్టములు చూచి నేను నిలువఁ జాలను. చిరకాలమునుండి యిది నాస్వభావము. నేఁడు వీరేంద్రుని పరివార మని క్రొత్త గాదు. ఇందు దోష మున్నచో దోషిని, పుణ్య మున్నచో నంతే!" ఇత్యాది.

నవకుమారుఁడు కేవలము నీచుఁడు కాఁడు. చూడుఁడు. నవకుమారుఁడు బుద్ధిమంతుఁ డని యెల్ల రాయనను గౌరవించుచున్నారు; ఆకర్ణింపుఁడు, ఆయన దయాశీలుఁ డనియు బ్రాహ్మణభక్తుఁ డనియు నందఱు పొగడుచున్నారు. నవకుమారునివంటి పురుషులవలన నేఁటికిని మనసంఘము గర్వితమై యున్నది. ఎల్లచోట్లను వారికి గౌరవము, ప్రశంస, అధికారము! అభిమాని, జ్ఞాని, లోకజ్ఞుఁడు నగు నవకుమారుఁడు మృతినొందిన యెడల సంఘము శిరోమణిని గోల్పోవును. సంఘమునఁ గలకలము పుట్టును!

# 3

సంజవేళ శైవలిని ఘట్టమునుండి మరలి వచ్చెను. ధర్మ పరాయణయు, శాంతచిత్తయు నగు సనాథ సంధ్యాపూజ సమాప్తికావించి బాలకులను, బాలికలను జేర్చి కథలు చెప్పఁ గూరుచుండెను. నెలకో, రెండునెలలకో యొకసారి శైవలిని వీరనగరమునకు వచ్చుచుండును. ఆమె కథలు బాగుగాఁ జెప్పఁగలదు. ఆమెకు సంతానము లేదు. అందఱి పిల్లలను దనవాండ్రని యామె భావించును. ఈకారణము లన్నిటిచే నామె బాలికాబాలకుల కత్యంత ప్రీతిపాత్రమై యుండెను. శైవలిని వచ్చి కథలు చెప్పఁ గూరుచున్నదని విని, పిల్ల లందఱు మేడమీఁద గుమిగూడిరి. ఒకరి నొడిలో, ఒకరిని బ్రక్కను, ఒకరి నెదుటను గూరుచుండఁ బెట్టుకొని శైవలిని యమృతమయ మగు మహాభారతకథ చెప్పనారంభించెను.

శైవలినితండ్రి సామాన్యుఁడు, సజ్జనుఁడు. తండ్రి గుణ సమూహము శ్రీశచంద్రునకును, తల్లి ధీరత, నమ్రతయు శైవలినికిని పట్టుపడెను. చిన్నతనముననే శైవలినిభర్త మృతినొందెను. ఆమెకు భర్తమాట జ్ఞప్తి లేదు. సంసారిక కష్టసుఖముల నామె యించుమించుగా నెఱుఁగదు.

శైవలినితండ్రిమరణానంతరము వారియవస్థ క్రమ ముగా మందము కాఁజొచ్చెను. అన్నము దొరకుటయే యెంతో కష్ట మయ్యెను. కాని యాశాంతసమ్రివితంతు వాకపర్యాయ

మయినను ధైర్యము గోల్పోవలేదు. తెల్లవాఱుజామున లేచి, స్నానపూజాదులు ముగించి, వృద్ధమాతకు బాలునకు వంటచేసి పెట్టుచుండును. ప్రాతఃకాలమున వికసించినపుష్పమువలె శైవలిని తనపనులు చేయ నారంభించి, ప్రశాంత సంధ్యా కాలమున ముగించి, మాతృసేవయందును సోదర పోషణము నందుఁ దత్పరయగును. కృష్ణకేశమండితము, శ్యామవర్ణము, వాక్యాన్యమునగు నామెవదనమును, శాంతతేజో విరాజిత విశాలనయనద్వయమును జూచుచో నిజముగా హృదయము స్నేహపరిపూర్ణము కాఁగలదు. సాయంకాల ప్రశాంతియందు నాఁచు చుట్టుకొని యించుమించుగా వాడిన తామరతీఁగ మొగము వాల్చియున్నట్లు దోఁచును.

ఈలోకమున శైవలిని వాధించున దేదియు లేదు. అనాధయగు నామెకు సహచరుఁడక్కఱలేదు. ఆమె చిన్న కుటీరమునకు నల్వంకల సస్నేహముగాఁ బెరిఁగి మధ్యాహ్న మున ఛాయను వర్షించుచు సాయంకాలమున మృదులగాన మొనర్చు మామిడిచెట్లు, వెదుళ్ళే యామె సహచరులు. వానివలెనే యామెయును బ్రకృతి సంతానము. భగవంతుఁడు వానిని బోషించుచున్నాఁడు. దిక్కులేని యామెను బోషించు చున్నాఁడు. శైవలిని బాలవితంతువయినను బేరిమను గోరు నది కాదు. లోకమంతయు నామె ప్రేమపాత్రము. వృక్ష ముపైనుండి గానము సేయు కపోతములు, కపోతాంగనలు నామెప్రేమభాజనములు; వానితోఁ గూడ నామె పాటలు

పాడును. వాని కనుదినము బియ్యము చల్లి, కాపాడుచుండును. ముసలితల్లిని శుశ్రూషచే సంతుష్టం జేయఁగలిగినప్పుడు శైవలినిహృదయము ప్రేమరసాప్లుత మగును; జనని సుఖముగా నుండుటఁ జూచినపుడు నేత్రము లానందాశ్రు పరిపూర్ణ ము లగును. బాలుం డగు శిశు నక్కునఁ జేర్చి ముద్దాడ నాహ్లాదముతో బాలుఁడు "అక్కయ్యా!" యని ముద్దుపెట్టుకొన్నప్పుడు శైవలినిహృదయము నాట్యమాడును, బాష్పములతో వస్త్రము తడిసిపోవును; సాయంసమయమున శాంతనదీవక్షమునఁ జంద్ర తారా విభూషితాకాశ ప్రతిబింబమును గాంచి చంద్రుని, నక్షత్రములను, నదిని సృజించినట్టియు; విహంగములకు శాబకములను, శైవలినికి శ్రీశుని దయచేసిన భగవానునిసంగతి జ్ఞప్తికి రాఁగా నామెహృదయ మనంత ప్రేమలో సిక్తమగును; ఆమెయనురాగమున కేకభోగి యెవ్వఁడు లేఁడు; కావున, వర్షకాలపు నదీప్రవాహమువలె నాయమస్నేహజలము నల్వంకలఁ బ్రవహించుచుండును. గ్రామమునందలి బాలికలు బాలకు లామె నెంతో ప్రేమింతురు. అనాథల, దరిద్రతాపీడితల దుఃఖము నామె పంచుకొనును. పశులుకూడ నామె ప్రేమభాక్కులు. భువన మెట్లు విస్తారమో, సముద్ర మెట్లు గభీరమో, యాకాశ మెట్లనంతమో యటులే శైవలినిప్రేమయు విస్తారము, గభీరము, అనంతము!

ఇవ్విధమునఁ గొంతకాలము చనఁగా నామెతల్లి మరణించెను. ధీరుఁడు, రూపవంతుఁడు, భద్రవంశసంజాతుఁడు

నగు శ్రీశచంద్రునకుఁ దనకుమారిత నిచ్చి వివాహము చేయు కోరికతో వానిని నవకుమారుఁడు వీరనగరమునకుఁ దీసికొని పోయెను. ఎవరికోసము శైవలిని యత్తవారిల్లు విడిచెనో వారులేనప్పుడు మరల నత్తవారింటికిఁ జని, యామె యచ్చట నివసింపఁ జొచ్చెను.

౪

నాలుగు సంవత్సరములు గడచినవి. ఎన్నో మార్పులు జరిగినవి.

శ్రీశచంద్రుఁ డిప్పుడు పదునేడేండ్ల పడుచువాఁడు. అతఁడు ధీరుఁడు, శాంతుఁడు, విచక్షణుఁడు, ధర్మపరాయణుఁడు. ఆతని యున్నతలలాటము,నవయవములను జూచుచో నతని గంభీరప్రకృతిని, స్థిరబుద్ధిని దెలిసికొనవచ్చును.

నరేంద్రుఁడు పదునై దేండ్ల యుగ్రుఁడు. శ్రీశునికంటె నతఁ డెఱుపు, పొడుగు, తేజోవంతుఁడు; కాని యుగ్రస్వభావుఁడు, క్రోధపరవశుఁడు, అసహిష్ణువు. నవకుమారుని కృపణతను, శ్రీశచంద్రుని యథార్థగుణకథనము నాతఁడు సహింపఁ జాలకుండును. నిరంతర మాతని ముఖమండలము రక్తవర్ణము దాల్చి యుండును. నరేంద్రుఁ డింతవఱకు సహించినదంతయుఁ గేవలము హేమలతకోసము. మరుభూమియందలి వాగువలె హేమలతా సుధాసదృశవదనము నరేంద్రుని యుత్తప్తహృదయమును శాంతము చేసి, చల్లపఱచుచుండెను. హేమలత

కోసమే నరేంద్రుఁడు నవకుమారుని తిరస్కారములను సహించుచుఁ, దన విపరీతక్రోధము నణఁచుకొనుచుండెను.

హేమలతకుఁ బదుమూఁడు సంవత్సరములు. ఆకసమున నుషఃకాలపు మొదటి చిహ్నములవలె, ప్రథమయౌవన చిహ్నములామెశరీరమునఁ బ్రకాశము నొందుచుండెను. నిబిడకృష్ణకేశరాశి వ్రేలాడుచుఁ జెక్కిళ్ళను, వక్షమును నావరించుచుండెను. యౌవనారంభమున గౌరవర్ణ మధికతరోజ్జ్వలమయ్యెను. సుందరవిశాల నేత్రద్వయము బాల్యకాల సులభ చాంచల్యమును బరిత్యజించి, యిప్పుడు శాంతధీరభావమును దాల్చెను. సమస్తావయవములు క్రమముగా సంపూర్ణత నొందుచుండెను.

సౌష్ఠవము కలిగి, కుసుమములను నిందించు శరీరమున నూతనభావములు ప్రవేశించె నేమో! నరేంద్రునితో సంభాషింప నిప్పటికిని హేమలత యెంతో కుతూహలము చెందును. కాని, మాటలాడునప్పుడు ముఖము వాంచును. మెలమెల్లన నేత్రములను నరేంద్రునివదనమువంక నెత్తి, మరల నధోవదన యగును. ఆ శాంత విశాల నయనయుగళి నరేంద్రుని యాననముఁ జూడ నభిలషించును. ఆమె చిన్నహృదయము నరేంద్రునిసంగతులను దలపోయ వాంఛించును. సాయంకాలమున నరేంద్రుఁడు పడవయెక్కి గంగాగర్భముపై నిటు నటు విహరించునప్పు డాబాల గవాక్షమువ్రేక్కఁ గూరుచుండి, యనిమేషదృష్టితో నతనిని విలోకించుచుండును.

పడిన చాలసూరము పోఁగా నపరిస్ఫుట సంధ్యారాగమునఁ జూపుమేరకు నిరంతర గంగాప్రవాహమును వీక్షించుచుం డును. సంధ్యదాఁటిన తరువాత నరేంద్రుఁ డింటికి వచ్చి 'హేమా!' యని పిలిచి, సంభాషించునప్పు డానందమయ భాషణములను హేమలతహృదయ మించుక గంతులు వైచును. నరేంద్రుఁడు గ్రామాంతరమునకరిగి యొకటి రెండురోజులు రాకున్నపుడు, ప్రభాత మధ్యాహ్న సాయం సమయములందు హేమలత యన్యమనస్కయై యుండును.

అట్లయినను, హేమహృదయములోని సంగతి నెవ్వరు నెఱుఁగరు. కపోతాంగన తన శాబకములను గూటిలో నతి ప్రయత్నమున దాఁచి యుంచునట్లుగా బాలికయు నూతన భావములను రహస్యముగా హృదంతరాళమున నుంచును. ఆభావముల నామెయు సరిగా నెఱుఁగనేరదు; ఎఱుఁగ కున్నను దత్ప్రియభావములు లోకమున కెఱుకపడకుండ నయత్నముగాఁ గప్పియుంచును.

వృద్ధనవకుమారుఁడు హేమలత నింకను జిన్నపిల్లగా నే యెంచుచుండెను. వివాహము చేసినచోఁ దనయేకపుత్రిక పరునిది యగుననుభయముతో నాఁపుటకు వీలున్నంతకాలము నవకుమారుఁడు పెండ్లి చేయక నిలిపెను. శ్రీశచంద్రుఁడును హేమలతహృదయమును గ్రహింపలేదు. ఎట్లు గ్రహింపఁ గలుగును? హేమ యతనితో నెప్పుడు సరళహృదయముతో నిస్సంకోచముగా మాటలాడును. శ్రీశచంద్రునికడ ననుదిన

మామె చదువు కొంచెము కొంచెముగా నేర్చుకొనుచుండును. పాఠ మప్పగించిన తరువాతఁ గ్రొత్త పాఠము చెప్పించుకొనును. శ్రీశుని యుపదేశవాక్యములను శ్రద్ధతో గ్రహించుచుండును. నరేంద్రుఁడు పాఠము చెప్ప వచ్చినపుడు బాలికమనస్సు నిశ్చలముగా నుంచలేకుండును; పాఠ మప్పగించుకొను నెడ సరిగాఁ జెప్పలేక యంతయు మఱచిపోవును. గృహకార్యవృత్తాంతము లన్నిటిని హేమ శ్రీశునికడఁ జెప్పుచుండును; అతని యుపదేశమునకు భిన్నముగా నేపనియుఁ జేయదు. నరేంద్రుఁ డుపదేష్ట కాఁడు. ఆతఁడు వచ్చినచో నేవో యితర విషయములు వచ్చును. కాదా మాన నే చాలసారులు సంఘటిల్లుచుండును. కావున, బాలికహృదయమునఁ గల స్నేహము తనయెడనే యని శ్రీశుఁడు భావించుచుండును.

౩

ఇవ్విధమునఁ గొంతకాలము చనెను. ఒకనాఁటిసాయంకాలమున శ్రీశుఁడు, నరేంద్రుఁడు పడవ నెక్కి గంగమీఁద విహారము చేయుచుండిరి. తనబలము చూపింపవలెనను కోరికతో నరేంద్రుఁడు పడవవాండ్రను లేవఁదీసి, రెండు చేతులతో రెండు తెడ్లు వేయుచుఁ బడవ నడపుచుండెను. శ్రీశుఁడు నిశ్చలముగాఁ గూరుచుండి, సాయంకాలశోభను వీక్షించుచుండెను. వారి కిరువురకు నిజమైన స్నేహ మెన్నఁడు లేదు; నేఁడు స్వల్పవిషయమును బట్టుకొని తర్కము జరుగఁ

జొచ్చెను. నరేంద్రుని చేతినుండి యాకస్మికముగా తెడ్డు జాఱుటచే నతఁడు పడిపోవ శ్రీశచంద్రుఁడు పెద్దపెట్టున నవ్వి 'ఎవ్వరిపని వారిని చేయనిమ్ము, పరాక్రమముతోఁ బనిలేదు!' అని పలికెను.

గంగాతీరమున నున్న మేడనుండి హేమలత యాసమయమున వీరిని జూచెను. ఆమె చూచుచుండఁగాఁ బడిపోయిన నరేంద్రునకుఁ జాల కష్టము కలిగెను. ఆమీఁద శ్రీశుని పరిహాసవాక్య మసహ్య మయ్యెను. కావున, నరేంద్రుఁడు చాల కఠినముగా బదులు పలికెను. క్రమముగా వివాదము హెచ్చసాగెను. నరేంద్రుఁడు శీఘ్రక్రోధముతో మండిపడి, కటుభాషణములతో శ్రీశుని నిందించెను. శ్రీశుఁ డీసారి కోపమాఁపుకొనలేక 'నీవంటి మోటువానితోఁ గలహించుట యవమానకరము!' అని నుడివెను.

ఇయ్యవమాన వాక్యములకు నరేంద్రుని ముఖనాడులుబ్బెను, కన్నులెఱ్ఱ నయ్యెను. ఆతఁడు శ్రీశునిఁ గొట్టుటకయి లేచెను. శ్రీశుఁడును లేచి, నిలువఁబడెను. క్రోధముచే నొడలెఱుంగని నరేంద్రుఁడు నతనిని నీటిలో విసరివైచెను. 'బాబుగారు నీటిలోఁ బడినారు, నీటిలోఁ బడినారు!' అని పడవవాండ్రు, ఆక్రోశించిరి. వారిలో నొకఁడు నీటదుమికి, యచేతనావస్థయందున్న శ్రీశునిఁ బడవలోని కెత్తెను.

సాయంకాలమున నవకుమారుఁడు నరేంద్రుని బిలిపించి యిచ్చవచ్చినట్లుచీవాట్లుపెట్టి 'నేఁడు నీవు శ్రీశుని గంగా

జలమునఁ బడవైచినావు కాదా? పల్లెవాండ్రు లేనిచో వాఁడు జలమరణము నొంది యుండువాఁడే !' అని వక్కాణించెను.

'అతఁడు నాతో దెబ్బలాట యెందుకు పెట్టుకోవలె!' అని క్రోధోన్మత్తుఁడైన నరేంద్రుఁడు ప్రత్యుత్తరమిచ్చెను

'శ్రీశునితో దెబ్బలాడుటకు నీకు సిగ్గులేదా ? నీ వెవరో శ్రీశుఁ డెవరో యెఱుఁగవా? నీవు శ్రీశునితో సమానుఁడవా?'

కోపకంపమానస్వరముతో నరేంద్రుఁడు 'నేను శ్రీశునితో సమానుఁడను గాను. జమీందారు వీరేంద్ర సింహుని కుమారుఁడను; శ్రీశుఁడు త్రోవనుబోవు బిచ్చగాఁడు, పరాన్నభుక్కు. నే నాతనితో సమానుఁడ నెట్లగుదును?' అని పలికెను.

నవకుమారుఁ డిట్టి ప్రత్యుత్తర మెన్నఁడు వినలేదు. విస్మయము, కోపము నొంది యతఁడు 'నీ వెవ్వరితో మాట లాడుచున్నావో యెఱుఁగుదువా ?' అని యడిగెను.

'ఎఱుఁగుదును. ఏదరిద్రబాలుఁడు నాతండ్రిపోషణలో నుండి కాలసర్పమువలె వారినే కఱచి, యిపుడు సంపదను హరించియున్నాఁడో యట్టి నవకుమారబాబుతో మాటాడు చున్నాను !'

నవకుమారుఁడు క్షణకాలము నిరుత్తరుఁ డయ్యెను. ఆయన కేసంగతి జ్ఞప్తికి వచ్చెనో ! పిమ్మట నతఁ డిట్లనెను. కృతఘ్న బాలుఁడా! నీతండ్రి తనదోషముచేత నే జమీ పోఁ గొట్టుకొనెను. ఇంతవఱకు దిక్కులేని నిన్నుఁ బోషించినాను. నేఁడు శ్రీశచంద్రుని నీట వైచితివి. తేపు కత్తితో నాగొంతు

కోయుదువు. ఈదినమే నాయింటినుండిలేచి దూరముగావెళ్ళు!

'వెళ్ళినాను! కాని, యీజన్మములోఁ గాని పరజన్మములోఁ గాని న్యాయవిచారణ యుండునేని నవకుమారా నీవు తత్ఫల మనుభవింతువు!'

సాయంకాలమున గంగాతీరమునందు హేమలత యొంటరిగా సంచరించుచుండెను. జరిగిన సంగతులన్నియు హేమలత వినియుండెను. ఆమెం జూచి నరేంద్రుఁ డొకపర్యాయ మాఁగి విలోకింపఁగా హేమకన్నులపై వస్త్రము వేసికొని రోదనము చేయుచుండెను.

నరేంద్రుని కోపము తొలఁగెను. అతఁ డామెదగ్గఱకుఁ జని, చేయి పట్టుకొని 'ఏడ్చుచున్నా వెందులకు హేమా?' అని పలికెను.

'నరేంద్రా! నరేంద్రా! నాచేయి విడు. శ్రీశుని నేనన్నవలె గౌరవింతునే! అట్టి వానిని నీవు నీట విసరివేసినా వెందులకు? మానాయనను నీవు కాలసర్ప మని నిందించినావే! మమ్ము నీవు ద్వేషింతువా? నరేంద్రా! నాచేయి విడిచిపెట్టు' అని హేమలత కాతరస్వరముతో ననెను.

శ్రీశుని జలమున విసరివైచినను, కుపితుఁ డగు నరేంద్రునకుఁ దెలివి కలుగలేదు. నవకుమారుని దిరస్కరించినను మైకము తగ్గలేదు. కాని, యిప్పుడు హేమలత కన్నీటిని జూచియు భీతి యగు నామెమాట లాలకించియు తరుణునకుఁ దెలివి వచ్చెను. మెల్లమెల్ల నతఁ డామె కన్నీటిం దుడిచి,

చేయిపట్టుకొని "హేమా! క్షమింపుము! నేను దోషము చేసినాను. శ్రీశుఁడు శాంతుఁడు, ధీరుఁడు, సద్గోష్ఠి. అట్టివానిని నీటఁ బడవైచి, మూర్ఖునివలెఁ బ్రవర్తించినాను. నీతండ్రిని దూషించి, చండాలునివలెఁ బ్రవర్తించితిని. కాని, హేమా! నన్ను క్షమింపవలెను. నీవు తప్ప స్నేహవాక్యములు పలుకు వారు లోకములో నాకు మఱెవ్వరు లేరు. నేఁడు దేశము వదలుచున్నాను. పోవుటకు ముందు నీస్నేహవాక్యములు రెండు వినఁగోరుచున్నాను. నన్ను క్షమింపుము హేమా!" అని వ్యాకుల స్వరముతో నుడివెను.

హేమలత నరేంద్రుని క్షమించి, గంగాతీరమునఁ గూరుచుండఁబెట్టి, తా నాతనికడఁ గూరుచుండి, కన్నీరు తుడిచికొని యిట్లనెను: "నరేంద్రా! దేశ మెందులకు విడిచెదవు? కోపమువచ్చి మానాయన యేదో యన్నాఁడని వీరనగరమునుండి యెందులకు వెడలిపోయెదవు? నాయనను బ్రార్థించి, యాయనకోపము పోఁగొట్టెదను. నరేంద్రా! నీవు వీరనగరమునుండి వెడలిపోవద్దు."

హేమలత యనునయము వ్యర్థమయ్యెను. ఉద్ధతుఁడగు నరేంద్రుఁడు హేమలతబాష్పములం గాంచి క్షమాపణము వేఁడెనే కాని యాతని నేఁటి హృదయవ్యథ శాంతింప లేదు. అంత నతఁ డిట్లనెను: 'హేమలతా! నీబలవంతమువలన లాభములేదు. నిజముగా వీరనగరమున నాకుఁ జోటు లేదు. కొన్నిసంవత్సరములనుండి నాతండ్రియింట నేఁ బడిన యాత

నలు నీ వెఱుఁగఁజాలవు. ఆయాతన లన్నియు నీస్నేహము కోసము, నీప్రేమకోసము సహించినాను. ప్రాతస్స్మరణీయుఁడగు నాతండ్రి పరిపాలించిన దేశమున నేను దిరస్కృతుఁడనై పరపోషణమున నివాసము చేయుచుండుట కేవలము నీ స్నేహము కోసమే. హేమా! నీయందలి ప్రేమచేతనే, నీ యాశచేతనే యింతకాలమున్నాను.ఆయాశయుఁ బోయినది!'

నీతండ్రి మనకు వివాహము చేయు ననెడి యాశ యుండెను. నామాటలకుఁ గోపము వద్దు. సిగ్గు వద్దు. లజ్జకుఁ గాని, కోపమునకుఁ గాని యిది సమయము గాదు. నీతండ్రి యభిప్రాయము గ్రహించినాను. అడఁకువ గల శ్రీశచంద్రుని యెడ నాయనకుఁ బ్రేమ, నే నాయనకంటికి శూలమను. శ్రీశచంద్రున కాయన కన్యాదానము చేయును. అది నేను గన్నులారఁ జూతునా? దానిం జూచి, యీయింట నివసింతునా? హేమలతా! హేమలతా! మానవుఁ డాదెబ్బ నోర్చుకొనలేఁడు. ఒకవేళ ఋషుల కట్టి యోర్పు కలుగును. హేమలతా! నేను ఋషిని గాను. నాకు సెల విమ్మ! హేమా! వీరనగరము నాస్థానము గాదు.

కొంచెము సే పుండి మరల నరేంద్రుఁడు ధీరస్వరముతో నిట్లు చెప్పఁ జొచ్చెను: 'హేమలతా! యేడువ వద్దు బ్రతికియుండునంతకాలము దుఃఖించుటకు సమయ మున్నది. ఒక్కసారి నామాటలు విను. నేఁడు వెళ్ళుచున్నాను. ఎచ్చటికిఁ బోవుదునో, యేమి చేయుదునో తెలియదు. అయినను,

నా కాచింత లేదు. లోకములో లక్షలకొలఁది ప్రాణు లున్నారు. నాకును నివాసమునకుఁ జో టుండును గాని, జనాకీర్ణ మైన యీలోకమున నేఁటినుండి నే నేకాకిని! దేశ దేశములందు, వివిధస్థానములందు నెందఱో జనులను జూతును. కాని వారి నడుమ నేను బంధుశూన్యుఁడను, ఏకాకిని నగుదును. జీవిత కాలములో నరేంద్రుని దమవానినిగా నెంచువారు లేరు. మరణ కాలమున దుఃఖించువారు లేరు!'

హేమలతకన్నీటితో వస్త్రము, శరీరమును దడిసిపోవు చుండెను. ఇఁక నామె సహింపలేక యుచ్చైస్స్వరమున రోదనము చేసెను. నరేంద్రుని నేత్రములు జాజ్వల్యమాన ముగనున్నను బాష్పములు లేవు. క్రమ్మఱ నతఁడు మెలమెల్ల నిట్లు పలుకఁ దొడఁగెను: "హేమా! కొంచెము సేపు స్థిర ముగా నుండుము. ఏడువఁబోకు. నే నిప్పు డేడువ లేను; నా తలంపులు దుఃఖముచే వ్యక్తము కానేరవు. హేమా! నీవు నన్నుఁ బ్రేమింపుము; లోకములో నీవే నరేంద్రు నొకసారి సస్నేహముగాఁ జూడుము; నరేంద్రుని బ్రేమతోఁ దలంపుము. కాని, నరేంద్రుఁడు ని న్నెంత గాఢముగాఁ బ్రేమించు చున్నాఁడో, అంధకారమై సుఖములేని జీవితాకాశమునఁ బ్రియతారవంక సతృష్ణనయనములతో నెట్లు చూచు చున్నాఁడో హేమా! నీ వెఱుఁగవు! బాలికహృదయ మా తలంపులను భరింపఁజాలదు. కాని, యీస్వప్నము నేఁటితో ముగిసినది. జీవితైకదీపము నేఁటితో జల్లారినది! నేఁటినుండి

చీకటిలో దేశదేశములవెంట, నరణ్యములలో యావజ్జీవము తిరుగుచుందును !''

నరేంద్రుఁడు కొంచె మూరకుండి గంభీరముగా నిట్లు పలికెను: 'హేమలతా! యింకొకసంగతి. చిన్నతనమున మన మిద్దఱ మీమాధవీలతను బెంచినాము. మన యనురాగము వలెనే యీలతయు నభివృద్ధి నొందినది. ఇప్పు డిది యుంకు టెందులకు?'

అతఁ డాతీఁగను బెఱికి, కంకణము చేసి, యామె చేతికి మెల్లగాఁ దొడిగి యిట్లనెను: ''హేమా! పూవు లెండి నంతశీఘ్రముగాఁ దీఁగె యెండదు. నీవు నన్నుఁ గొంత కాలము జ్ఞప్తియం దుంచుకొందు వని తలఁచుచున్నాను. నరేంద్రునియెడఁ బ్రేమయున్నంతకాల మీ మాధవీకంకణ మును ధరింపుము; దీనుఁడు మఱపునకు వచ్చినపుడు, ఎండు తీఁగెను నదీజలమున విసరివేయుము!'

శోకవిహ్వలయు, దందహ్యమానహృదయయు నగు హేమలత యచ్చెరు వొంది, నరేంద్రునివంకఁ జూడ నతఁడు నిశ్చలుఁడై యుండెను; అతని కంఠస్వర మకంపితముగ, గంభీరముగ నుండెను. కన్నుల నీరు లేదు, విస్ఫులింగములు రాలుచుండెను. మెల్లమెల్లన హేమలతహస్తమును విడిచి నరేంద్రుఁడు వెడలిపోయెను. ఆచీకటిరాత్రి నరేంద్రుఁ డెవ్వరికిని గానఁబడ లేదు.

౬

సంజచీకటి యావరించిన గంగాతీరమునఁ బదుమూఁడేండ్ల బాలిక కూరుచుండి, యసంఖ్యాక తరంగములవంకఁ జూచుచున్న దేల? కనుచూపు మేరలో వీచిమాల లేచుచుఁ బడుచుండెను. అటుపిదప సన్నని ధూసరరేఖ గోచరమగుచుండెను; తరువాతఁ జీకటిలో నేమియుఁ గానఁబడుట లేదు. చూడంజూడ హేమకన్నులనిండ నీరు గ్రమ్మెను. ఆమె కిఁక నేమియుఁ గానవచ్చుట లేదు. రాత్రి గాఢ మగుచుండెను. అయినను, హేమలత చూపు ముగియ లేదు.

రాత్రి జమీందారునింట నెల్లరు నిద్రించిరి. హేమలతకా రేయి యెంత భయంకరముగా నుండెను! బాలిక నెమ్మదిగా శయ్యపైనుండి లేచి, గవాక్షముకడకుఁ జని మెల్లన దానిం దెఱచి బయటకుఁ జూచెను. తారలు నిండియున్న నభోమండలము, క్రిందవిశాలగంగాప్రవాహము. ఆగంగనువిలోకింప హేమలతకుహృదయవిదారకభావములెన్నోకలుగఁజొచ్చెను. చిన్ననాఁటి యాటలు, ప్రథమానురాగము, ఎన్నో సంగతులు, ఎంతో వేడుక—ఇవి యొక్కొక్కటిగా జ్ఞప్తికివచ్చి యామె మనస్సును వేధింపసాగెను. ఒక్కొక్కమాట జ్ఞప్తికివచ్చును. మనోవ్యథ కలిగి యవిరళబాష్పధారలతో నేత్రములును, వక్షమును మునిఁగి తేలును; మరల నామె శాంతి నొంది, గంగానదివైపు చూచును. క్రమ్మఱ నింకొకమాట జ్ఞప్తికిరాఁగా మరల శోకవిహ్వలయై, ఆక్రందనము చేయును. ఏడ్చి యేడ్చి

యామె యవసన్నయయ్యెను. అర్ధరాత్ర మయ్యెను. అయినను హేమలత గవాక్షముకడనే నిలిచి కాని, నేలపై దొరలుచుఁ గాని నిశ్శబ్దముగా దుఃఖించుచుండెను.

శోకపు మొదటి వేగము తగ్గెను. కాని, చింతాపరంపర నివారితము కాలేదు. చెక్కిటఁ జేయి పెట్టుకొని, యామె యేకాకిని కిటికీప్రక్కఁ గూరుచుండి భావింపఁజొచ్చెను. ఒక్కొకసారి హేమలత నేత్రమున బాష్పకణ మొకటి పొడమి, నెమ్మదిగా నేల రాలును; మరల నింకొక బొట్టు బయలువెడలును. ఆయశ్రుపరంపర శుష్కింపలేదు. ఆచింతాపరంపర సాంతము కాలేదు.

రేయి గడచెను. పూర్వదిక్కున రక్తిమాచ్ఛట దృగ్గోచర మయ్యెను. మలినావస్థ నున్న బాలిక యింకను జెక్కిటఁ జేయి పెట్టుకొని, గవాక్షముప్రక్కఁ గూరుచుండి యుండెను. అప్పటికిని జింతాసూత్రము తెగలేదు.

ప్రభాత మయ్యెను. సూర్యప్రథమావలోకమున హేమలత చకితయై లేచెను. ఆమెకన్నులు దించుకొని పోయెను. ముఖమండలము మాసి యుండెను. శరీర మవసన్న మయ్యెను. మెల్లగా గవాక్షముపజ్జనుండి లేచి శూన్య హృదయముతో నామె శూన్యముగాఁ గానఁబడు గృహమునఁ బనులు చేయఁజొచ్చెను.

అది యొకనాఁటిదేనా? దినదినము, వారమువారము, మాసముమాస మామె యావాతాయనముప్రక్కఁ గూరు

చుండి, నరేంద్రుఁడు వీడుకోలొందిన గంగాతీరము దెసఁ జూచుచుండెను. ప్రాతఃకాలమున, మధ్యాహ్నమున, సాయంకాలమున, అర్ధరాత్రిమున నాశూన్యహృదయ యాగంగ వైపు చూచుచుండెను. ఆమె యెంత తలపోయుచుండునో! ఒకనాఁడు నరేంద్రనాథుఁడు తనచెవిలో నేమి చెప్పెనో, ఒకరోజున నావలితీరమునుండి తన కేమి తెచ్చెనో, ఒక దినమునఁ జెట్టునుండి మామిడిపండు రాల్చి తాము రహస్యముగా భుజించుటయు, ఒకవాసరమునఁ దండ్రితోఁ జెప్పకుండ సాయంకాలమునఁ దాను నరేంద్రునితో నౌకావిహారము చేయుటయు, ఒకదివసమున నరేంద్రునకుఁ దాను పూలదండ వేయుటయు, ఒకనాఁడు నరేంద్రుఁడు తన కేశములందు పూవులు ముడుచుటయు — ఇట్టి వొక్కటొక్కటిగా జలతరంగములరీతిని హేమలతహృదయమున నుదయించును. రెండు జాములు మొదలు సాయంసమయము వఱకును, ఒక్కొకప్పుడు సాయంకాలము మొదలుకొని యర్ధరాత్రము వఱకును హేమలత చింతామగ్నయై యుండును. ఒక్కొక్కసారి కన్నులనిండ నీరు గ్రమ్మును; ఎవ్వ రయినఁ జూతురేమో యను భీతిచే నామె యశ్రువులు దుడిచికొనును. నవకుమారుని పెద్దకుటుంబమున నాదుఃఖమును బంచుకొను వా రెవరు? నోరు విప్పి తనమనస్సు నామె యెవ్వరికిని జెప్పుటలేదు. ఎవరికిని రహస్యము దెలియనిచ్చుటలేదు. ఇంటిలోనివారికిఁ దెలియకుండఁ జింతించుచుండును. అప్పు

డప్పుడు శోకపారావారము విడివడ నడంచుకొనఁజాలకుం డును. నయనములనుండి యవిరళ బాష్పధారలు ప్రవహించును.

వసంతకాలము తరువాతఁ గ్రమముగా గ్రీష్మము వచ్చెను. వంగదేశమున స్వాదుఫలములతోను, రమణీయ ప్రసూనములతోను, మధురకంఠము లగు పక్షులతోను బ్రకృతి నింపినదై చెను. నవపల్లవిత మహీరుహములు మందానిలముచే మధురగానము చేయఁజొచ్చెను. వానివెంట సుందరవిహంగ ములు సంతోషముతోఁ బాటలు పాడుచుఁ, దమతమ కులాయ ములు నిర్మించుకొనసాగెను. మధ్యాహ్నమున వృక్ష చ్ఛాయలఁ గూరుచుండి, పర్ణముల మర్మధ్వని వినుచు విహంగ శాబకములను, శకుంత దంపతులను విలోకించుచుఁ జెక్కిటఁ జేయిపెట్టుకొని యేమో భావించుచుండును. సంజమసక దట్ట మయి చెట్ల నావరింప నంతవఱకు నామెచింతాతంతువు తెగ కుండును. పిమ్మట వర్షకాల మేతెంచి దేశమంతను ముంచి వైచి, వెడలిపోయెను. కృషీవలులు సంతోషముతో ధాన్యము నూర్చిరి. కొట్టములు, గృహములు, గ్రామములు ధాన్య ముతో నిండిపోయెను. జగమంతయు నానందభరిత మయ్యెను. కాని, హేమలత నిరానందహృదయము శాంతి నొందలేదు. మనోహరమగు నాశ్వయుజమాసమున పూజాధ్వని బయలు వెడలెను. నల్వంకల సంతోషధ్వను లుప్పతిల్లెను. ఆకాశము నిర్మల మయ్యెను. కాని, హేమలత హృదయాకాశము తిమి రచ్ఛన్న మయ్యెను. తరువాత శీతకాలము రాఁగా నానంద

ముతోఁ గాఁపువాండ్రు మరల ధాన్యము నూర్చిరి. సంతోష మున గృహస్థులు, భాగ్యవంతులు, పేదవారందఱును పౌష పర్వము చేసిరి. హేమలతకుఁ బర్వదిన మీజన్మమున వచ్చునా ?

నవకుమారునిది పెద్ద కుటుంబము. ఎవ్వరికి నించుక కష్టమైన లేదు, లోపము లేదు, విచారము లేదు. ఆకుటుం బమున స్నేహపాలిత యగు పుత్రికమాత్రము విచారగ్రస్త రాలు. విపులమైన సంసారమున హేమలత యేకాకిని !

౨

నరేంద్రుఁడు యీఁతగాఁడు. ఆరాత్రివేళ నీఁదుచు, నతఁడు గంగానదిని యావలియొడ్డు చేరెను. ఎదుట బహు దూరమువఱకుఁ గేవల మిసుకయు, నటుతరువాత నంతు లేని మైదానమును గానఁబడుచుండెను. నరేంద్రుఁ డాచీకటి రాత్రి తడిబట్టలతో నా యిసుకభూముల విహరింపఁజొచ్చెను.

నరేంద్రుఁడు గంగ రెండవవైపు చూచెను. చీకటిలోఁ గూడ వీరనగరమునందలి తెల్లనిమేడ కొంచెముగాఁ గానఁ బడుచుండెను. దృష్టి మరల్చి క్రిమ్మర నతఁడు తిరుగఁ జొచ్చెను. మరల నిలిచి యావంకఁ జూచెను. ప్రశాంత మైన యంధకారమున గంగాకూలంకష కలకలనినాదము శ్రవణగోచర మగుచుండెను; నడుమ నడుమ గుడ్లగూబల

కూఁతలు వినవచ్చుచుండెను; అప్పుడప్పుడు దూరమునుండి నక్కకూఁతలు చెవిఁ జేరుచుండెను. నరేంద్రుఁడు గంగను జూచుట లేదు. గూబచప్పుడు గాని, నక్కకూఁతలు గాని వినుట లేదు; నిశ్శబ్దముగా నంధకారమునఁ దిరుగులాడుచుండెను. కొంతసేపటి కతఁడు మరల వీరనగరమువంకఁ జూడఁ జిమ్మచీకటిలో హర్మ్యము కానఁబడలేదు. నరేంద్రుఁడు నిట్టూర్పువిడిచి మరలి, యెదుటనున్న త్రోవ వెంటఁ జనెను.

తా నెచ్చటికిఁ బోవుచుండెనో నరేంద్రుఁ డెఱుఁగఁడు. మీఁద ననంతాకాశము, క్రింద ననంతమైన భూమి; నరేంద్రుని చింతయు ననంతము, అపారము. కనఁబడిన బాటవెంట నతఁడు నడచుచుండెను. మార్గముప్రక్కనున్న వటవృక్షమునుండి నిశాచరపక్షి నరేంద్రునిఁ జూచి, కులాయము విడిచి పలాయనము చేసెను. రాత్రులందు విహరించునక్కలు నరేంద్రునిగాంచి, కూయఁజొచ్చినను నాతఁడు లక్ష్యముచేయలేదు.

చాలదూరము నడవఁగా నొకగ్రామము వచ్చెను. ఎల్లరు నిద్రించుచుండుటచేత గ్రామము ప్రశాంతముగా నుండెను. నల్లని చెట్లగుంపుక్రింద చిన్న చిన్న కుటీరములు గానవచ్చుచుండెను. ఆకులసందులనుండి యక్కడక్కడ మిణుఁగురుపురుగులు ప్రకాశించుచుండెను. నరేంద్రుని జూచి యూరి కుక్కలు మొఱుఁగ సాగెను. ఒకరిద్దఱు గృహస్థులు తలుపులు తెఱచి, యతనిని గాంచిరి. నరేంద్రుఁ డేదిక్కు చూడక, మార్గము వెంట నడచుచుండెను. త్రోవ తిన్నఁగాఁ

గనఁబడుటలేదు. నడుమ నడుమ వృక్షములక్రిందినుండియుఁ, బొదలసందులనుండియుఁ జనుచుండుటచే శరీరమున గాయములు తగిలినను లక్ష్యము చేయక నరేంద్రుఁడు కొంతసేపటిలో గ్రామముదాఁటి, సమభూమిని జేరెను.

దానిని గడచి, యతఁడు వేఱొకగ్రామము ప్రవేశించి, నిశ్శబ్దముగాఁ గడచి చనుచుండెను. ఆరాత్రి నరేంద్రుఁ డెన్ని గ్రామములు దాఁటెనో, యెంతదూరము వెళ్ళెనో యాతనికే తెలియదు.

రాత్రి యంతయు నడచి నరేంద్రుఁడు దూరపుఁ బొలిమేరను వెలుతురు చూచి, కాంతివైపునకుఁ జన సాగెను. ఇంచుమించుగా క్రోసుదూరము పోయి సమీపించి చూడఁగా వెలుతురులోఁ గొందఱు శవమునుదహించుచుండిరి. నరేంద్రుఁ డంతట శవమును జూచి నిలిచెను. కాష్ఠాగ్ని యొక్కొక్కసారి ప్రజ్వరిల్లుచు, నింకొకసారి నిస్తేజ మగుచుండెను. స్తిమితాలోకమున నరేంద్రునియాకృతియు, వికృత ముఖమండలమును గొంచెము కొంచెము కానఁబడుచుండెను. శవదాహకులు నరేంద్రుని గాంచి, పరిశ్రాంతపథికుఁ డని తలఁచి సమీపమునకు రమ్మని పిలిచిరి; అతఁడు వెళ్ళలేదు. ఆతని వృత్తాంత మడిగిరి; అతఁడు చెప్పలేదు. అంతట వారు నరేంద్రుని నిశ్చలదీర్ఘ దేహమును, వికృత ముఖమండలమును విలోకించి, శవమును వదలి యూర్ధ్వశ్వాసముతోఁ బరుగెత్తిరి.

ప్రత్యూషమున గ్రామస్త్రీలు కలశములు తీసికొని ఘట్టమునకుఁ బోవుచు దీర్ఘకాయుఁడు, గౌరవర్ణుఁడు, వికృతమూర్తి యొకఁడు తోఁపులోఁ బండుకొని యుండుటఁ జూచి, బెదరి తొలఁగిపోయిరి.

ప్రభాత మయ్యెను. గ్రామములోని మనుష్యులు గుమిగూడి ఘోరముగా నిద్రించుచున్న యాయపరచితుని లేపి, యతనివృత్తాంత మడుగఁగా నతఁడు మెల్లమెల్లన "నాకు పేరు లేదు, ఊరు లేదు—ప్రపంచములో నే నేకాకిని" అని పలికెను. నరేంద్రునకుఁ బిచ్చియెత్తినది.

౯

నరేంద్రుఁ డానాఁడే రోగపీడితుఁ డయ్యెను. ఆగ్రామములోని పెద్దమనుష్యుఁ డొకఁ డాతనికిఁ జికిత్స చేయింపఁ జొచ్చెను. కాని, యతఁడు జీవించు నను నాశ చాలరోజులవఱకు లేకుండెను. బహుదినములకు నరేంద్రున కారోగ్యము కలుగ సాగెను. పోవుటకు శక్తి వచ్చినపుడు నరేంద్రుఁ డాపెద్దమనుష్యునికి ధన్యవాదముచేసి, గ్రామమునువిడిచి వెళ్ళెను.

అప్పటికి దుఃఖవేగము శాంతినొందెను. నరేంద్రుఁడు హేమలతను మరల దక్కించుకొను నుపాయ మాలోచింప నారంభించెను. ఎన్నో యోజనలు చేసి, తనయాస్తి మరల సంపాదించుటకయి సుబాదారునకు విన్నపము చేయ నిశ్చ

యించెను; పిమ్మట మైనజమీా తనకు వచ్చినపుడు స్వార్థ పరుఁడు నవకుమారుఁడు తప్పక తనకుఁ గన్యాదానముచేయు ననియు భావించెను.

ఈయభిప్రాయములతో నరేంద్రుఁడు సుబాదారుసుజా రాజధానిం జేరెను. షహాజీహాన్ పాదుషాహా కొడుకు సుజా వంగదేశపరిపాలకుఁడుగా నియుక్తుఁడై రాజధాని ఢాకానుండి రాజమహాలుకు మార్చి, యిరువది సంవత్సరములు వంగ దేశమును బాగుగాఁబరిపాలించి,మిక్కిలి కీర్తి సంపాదించెను. అతఁడు ప్రభువుగా నున్న కాలమున దేశమున యుద్ధము గాని, యే యుపద్రవము గాని సంభవింపలేదన వచ్చును; కాఁబట్టి ప్రజలు నిరుద్వేగముగాఁ గాలము గడపుచుండిరి. దేశచరిత్ర మునం దాతనిసత్కీర్తి గానవచ్చును. యుద్ధమునం దాతఁ డెట్లు విక్రమమును, సాహసమును జూపునో తదితర సమయములందు న్యాయమును, దయను జూపును. అతని కరుణను, న్యాయపరత్వ మును జూచి వంగదేశమందలి జమీాందారు లేమి, జాగీర్దారు లేమి యతనిని గౌరవింతురు. అతఁడు మృతినొందినపుడు జను లాబాలవృద్ధము దుఃఖించిరను నదంతి కలదు. అయినను నాతని యుదారస్వభావమున నొకటిరెండు కళంకములు గలవు. యుద్ధ సమయమునం దతఁ డెంత సాహసియో, తక్కిన సమయములం దంత విలాసప్రియుఁడు. సుజా మిగుల రూపవంతుఁడు. ఎల్లప్పుడు సుందరాంగనా మండల పరివేష్టితుఁడై యుండ నభిలషించును. అతని ప్రధానభార్య ప్యారీ బానూ వంగదేశమున రూపగుణ

చతురతలయందద్వితీయురాలని ప్రఖ్యాతి నొందెను. వాక్చాటవముచేతను, మధురకౌతుకముచేతను సుబాదారుహృదయము నామె ప్రేమరసమున నెప్పుడు తడుపుచుండును. కాని ప్యారీబానూ సుజా కేక భార్యకాదు; నందలకొలఁది బేగము లుద్యాన కుసుమములవలె నతని ప్రాసాదమును వికాసవంతము చేయుచుందురు. వారల రూపములకు మోహము నొంది సుజా రాజకార్యములను విస్మరించుచు, నపుడప్పుడు రెండు మూఁడు రోజులు మద్యపానమునను, విలాసమునను గడపుచుండును.

నరేంద్రనాథుఁడు సుబాదారునకు విజ్ఞాపనము సమర్పింపఁ జనెను. ఇట్టి సుబాదారు కడ నుచిత విచారణ జరుగునను నాశ యుండదు. గంగాతీరమున సుందర రాజమహాలునగర మిప్పటికిని జూడ మనోహరముగా నుండును. అది వంగదేశ రాజధానిగా నున్న కాలమున దానిశోభ యద్వితీయమై యుండెను. సుబాదారుని ప్రాసాదముతోను, మందిరములతోను, ఉమ్మరాహుల జాగీర్దారుల సుందర హర్మ్యములతోను, వంగదేశీయధనాఢ్యజనసమాగమముతోను రాజమహాలు నిశ్చయముగా రాజధాని యని తోఁచుచుండెను. ధనికు లగు వర్తకుల వేలకొలఁది పడవలను స్వయముగా గంగానది తన వక్షమునఁ దాల్చి యానగర శోభను, ఐశ్వర్యమును వృద్ధి చేయుచుండెను. ప్రశస్త రాజమార్గమున యుద్ధప్రియులు, పోతరించిన ముసల్మాను ఉమ్మరాహులు, జమీందారులు సర్వదా గజాశ్వశిబికారూఢులై చనుచుందురు. హిందూ

వర్తకులు కాఁపురులును నగరములో నొకమూల శాంతముగా నివసించుచుఁ, దమతమ పనులయందుఁ దగిలియుందురు.

నరేంద్రనాథుఁడు సుబాదారునకు విన్నపము చేయు విధము నాలోచించుచుండెను. ధనికవర్తకులు నరేంద్రు నెఱుఁగుదురు. కాని, యతఁ డిప్పుడు దరిద్రుఁడు. బీదవానికోస మెవరు శ్రమపడుదురు? "ఆహా! బాబూ! మీతండ్రి యెంతో పెద్దమనుష్యుఁడు. అట్టి వాని కుమారుని జూచి మిక్కిలి సంతో షించినాము. కొద్దిరోజు లిచ్చట నుండు; తరువాతఁ జూతము" అని నరేంద్రుఁడు చూడఁబోయినవా రెల్లరు జెప్పుచుండిరి. అతఁడు విఫల ప్రయత్నుఁడై యుండెను.

చాలరోజులకు సందర్భవశమున నొకనాఁడు 'ఏఫిన్ ఖాన్' అను మొగల్ జాగీర్దారుతో నరేంద్రునకుఁ బరిచయ మయ్యెను. ఏఫిన్ ఖాన్ పెద్దమనుష్యుఁడు. వీరేంద్రుని ప్రియమిత్రుఁడు. ఆతఁడు నరేంద్రుని సగౌరవముగా నాహ్వానించి, యతనికోసము సుబాదారుసన్నిధికి సత్వరముగాఁ బోవ నంగీకరించెను. అయినను, దరిద్రుని విజ్ఞాపనము విచారణపర్యంతము చనదు. అనేక ప్రయత్నములమీఁదఁ జాల దినములకు ఏఫిన్ ఖాన్ మిగుల ద్రవ్యము వ్యయము చేసి, సుబాదారును మంత్రులను సంతోషపెట్టి, యొకనాఁడు నరేంద్రనాథుని విన్నపము సుజాసముఖమున నుంచెను.

వెండి బంగారములతో ఖచితమైన చక్కని సింహాసనమున సుజా యుపవిష్టుఁడై యుండె. సుందరావయవములపై

రాజ వేషము సుందరతరముగా నుండెను. నల్వంకల మంత్రులు, పెద్దపెద్ద మొగల్ ఆఫ్గన్ వీరులును శిరసులు వాంచి నిలిచి యుండిరి. న్యాయసభ వివిధ జనులతో నిండియుండెను. పాషాణ స్తంభముల వరుసపై నాధారపడి, నగిషీపనులు చేసిన యింటికప్పు రమణీయముగా నుండెను. సింహాసనమున కిరువంకలఁ బరిచారకులు చామరములు వేయుచుండిరి. ప్రాసాదము నెదుట కనుచూపు మేరలో జనులు నిండియుండిరి. సుబాదా రెల్లప్పుడు దర్శన మీయఁడు; నేఁడు సమ్మతించుటచే నెందఱో యాతని దర్శనమునకు వచ్చిరి.

వృద్ధుఁడు ఏఫిన్ ఖాన్ లేచి, సుబాదారు సమ్ముఖమున విన్నపము చేసెను: 'జహాపనాహా! ఈ సేవకుఁ డించుమించుగా నిరువదిసంవత్సరములనుండి పాదుషాహ వారిసేవలోనున్నాఁడు. సుబాదారువారి సేవలోఁ దల తెల్లఁబడినది. ముఖమునఁ గత్తి దెబ్బలు తగిలినవి. ఈసేవకుని దొక చిన్నవిన్నప మున్నది.'

'ఏఫిన్ ఖాన్! మీరు మా ప్రధానానుచరులు, ప్రీతిపాత్రులు. మీయాచనకు మే మీయరాని దేమున్నది!' అని సుజా పలికెను.

ఏఫిన్ ఖాన్ భూమికిఁ దాఁకునట్లు తలవంచి మరల నిట్లు విజ్ఞాపన చేసెను: 'జహాపనాహా! వంగదేశవాసులు మిక్కిలి దుర్బలులు. అయినను, వారిలో నప్పుడప్పుడు పరాక్రమవంతులగు జమీందార్లు మనకు యుద్ధమున సాయము చేయుచుందురు. వారు సుబాదారువారి ప్రీతిపాత్రము లనుటకు సందేహము లేదు. జమీందారు వీరేంద్రసింహుఁ డట్టివాఁడు.'

'అవును. నే నాహైందవవీరుని పేరు విన్నాను. పఠాను లంతో మనము యుద్ధముచేసినప్పు డాయన మనకు సాయము చేసినాఁడు' అని సుజా పలికెను.

ఏఫిన్ ఖాన్ తస్లీము చేసి మరల నిట్లనెను: 'జహాపనాహా! తమ రానతిచ్చినది యథార్థము. ఈ దాసుఁడు ఒడిస్సాకు యుద్ధమునకు వెళ్ళినప్పుడు వీరేంద్రసింహుని రణకౌశలమును, రాజభక్తిని స్వచక్షువులతోఁ జూచినాఁడు. ఈ దర్బారులోఁ బరాక్రమవంతులగు మొగల్ పఠాన్ యోధులెందఱో యున్నారు. కాని, వీరేంద్రసింహునికంటె నెక్కువ సాహసము గలవాని నే నింతవఱకుఁ జూడలేదు.'

సభలోని వారలఖడ్గములు కోశములలో ఝుణఝుణారవము చేసెను. ముసల్మానులముఖము లెఱ్ఱనడెను. కాని, సుజా దరహాసవదనముతో నిట్లు నుడివెను: 'ఏఫిన్ ఖాన్! మీరు కాఫరును మిక్కిలి శ్లాఘించినారు. మీరు పలికిన మాట లయథార్థములు గావు. ఆ హైందవుఁడు నిజముగా సాహసియే యని వింటిని. ఇప్పు డాయనవిషయమయి యేమి చెప్పదుగో చెప్పుఁడు. మీకోరికప్రకార మాయనకుఁ బారితోషిక మీయ సంసిద్ధుఁడనై యున్నాను.'

ఏఫిన్ ఖాన్ గంభీరస్వరముతో ని ట్లనెను: 'సుబాదారులకు సుబాదారు, పాదుషాలకుఁ బాదుషా యగు నతఁడు మాత్రము వీరేంద్రునకుఁ బ్రస్తుతము బహుమానము గాని శాంతి గాని యీయఁగలఁడు. దిక్కులేని యాయనకుమారుని

కోసము విన్నపము చేయుచున్నాను. చిన్నవాఁ డిప్పు డింటింట భిక్షాటనము చేయుచున్నాఁడు. కానూంగో సాయమున నొక మోసగాఁ డితనితండ్రిజమీ హరించినాఁడు.'

బొమలు ముడిపైచి, సుబాదారు కానూంగోను సవిశేషముగాఁ బ్రశ్నించెను. ఆకాలమున ఖజానా యంతయు, జమీందారుల వ్యవహారములును కానూంగోమహాశయుని యధీనమున నుండెను. వంగదేశపు సుబాదారు ఢిల్లీనగరమునకుఁ బంపుకాగితములపై కానూంగోదస్కతు లేనిచో గ్రాహ్యములు కావు. నవకుమారుని డబ్బుతినెడి కానూంగో మహాశయుఁడు వినయముతో నిట్లు విన్నవించెను: 'సుబాదారువారి యానతి శిరోధార్యము. వీరేంద్రుని మరణానంతరము కొన్ని సంవత్సరముల సిస్తు ఖజానాకు రాకుండుటచేఁ బ్రభువుగా రా జమీ నవకుమారున కొసఁగుట కాజ్ఞ యిచ్చినారు.'

సుజా కేవిషయ మైనను దెలుపుట కష్టము గాదు. కానూంగోమహాశయుఁడు తెలిపిన విషయ మాతఁడు గ్రహించెను. ఏఫిన్‌ఖాన్ విన్నపము పడిపోయెను. ఏఫిన్ రోషమునఁ దల వాంచెను. ఆయనకుడిప్రక్కనున్న రేంద్రుఁడు కానూంగో దెసఁ దీవ్రదృష్టిని బ్రసారించెను.

సుబాదారు తుద కిట్లనెను: 'ఏఫిన్‌ఖాన్! లోకమున కొసఁగిన రశ్మిని సూర్యుఁడు మరలఁ దీసికొనఁడు. జమీ స్వాయముగా నిచ్చి, మరలఁ దీసికొనుట రాజధర్మము కాదు.

వీరేంద్రసింహునికుమారుఁడు తేజస్వివలె నున్నాఁడు; వీరేంద్రునివలె నితఁడు రణశిక్ష నొందిన తరువాత నంచి పారితోషికము, వేతోొకజమిా తప్పక లభించును.'

సభాసదు లెల్లరు 'కేరామత్! కేరామత్!' అని సుబాదారువాక్యములను బ్రశంసించిరి. విధిలేక, ఏఫిజ్ ఖాన్ అందుల కంగీకరించెను. ఆనాఁటినుండి యాయన వీరేంద్రుని దనదగ్గఱ నుంచుకొని, రణవిద్య నేర్పుచుండెను.



మూఁడు సంవత్సరముల తరువాత క్రీ. శ. ౧౬౫౭ లో ఆశ్వయుజమాస ప్రారంభమున నొకనాఁడు భారతవర్ష రాజధానులగు ఢిల్లీ, ఆగ్రా నగరములందుఁ గోలాహల మయ్యెను. ఆగ్రానగరమున రాజద్వారము జనాకీర్ణ మయ్యెను. నాగరకు లెల్లరు భీతు లయిరి. దుకాణము లన్నియు మూసిరి. ఉమ్రాహులు, మన్సబ్దార్లు, రాజపుత్రులు, మొగలులు, పఠానులు—అందఱు నస్థిరచిత్తులు, చింతావిహ్వలులు నయిరి. పను లాఁగిపోయెను. అందఱు బెదరుతో, ఉత్సుకతతో నుండిరి. షాహజహాన్ పాదుషాహ కొన్నిరోజులనుండి రోగపీడితుఁడై యుండెను. నేఁ డాయన మరణమునొందినట్లు సమాచారము వ్యాపించెను.

ఈయసత్యవృత్తాంతము దేశ మంతటను వ్యాపించెను. వంగదేశమునుండి సుజా, దక్షిణమునుండి ఔరంగ్‌జేబ్, గుజ

రాతునుండి మురాదును యుద్ధసన్నద్ధులై బయలు వెడలిరి. తండ్రి మరణించిన తరువాత నందఱు సింహాసనారోహణ లాలసు లయిరి. కాని, షాహజహాన్ జీవించి యున్నట్లు ప్రమాణమునడుమ వారికిఁ దెలిసినను యుద్ధముచేయుతలంపును విడిచిపెట్ట లేదు. అందులకుఁ గారణ మిది. ఇంతకుముందుఁ గొన్ని మాసములనుండి షాహుషాహ రోగవశమున రాజకార్యములుచూడ నశక్తుఁడై యుండఁ, బెద్దకుమారుఁడు దారా పనులు చక్కఁబెట్టుచు, నేవిషయమందును దండ్రి యభిప్రాయమును గనుఁగొనక; యావజ్జీవము తండ్రినిఁ గారాగారమున నుంచి తానే ప్రభుత్వముచేయ ప్రయత్నము లొనరింపసాగెను. తండ్రికి విషప్రయోగముచేసి, యువరాజు సింహాసనమార్గము నిష్కంటకము కావించు నని కొందఱు సంశయించిరి. దారాతమ్ములు పితృపరిపాలనము సమ్మతించిరి. కాని, యన్నగారి శాసనము నంగీకరింపలేదు. ఇట్టికారణమున హిందూదేశమున యుద్ధాగ్ని ప్రజ్వరిల్లెను.

౧౬౫౭ చివరరోజులలో కాశీయుద్ధము జరిగెను. శీతకాల సాయంసమయకాంతియందు రణరంగము భయంకరాకృతి ధరించెను. లొట్టిపిట్టల, గుఱ్ఱముల, యేనుఁగుల, మనుష్యుల శవరాశితో యుద్ధక్షేత్రము నిండెను. కొన్ని చోటుల శవములు నక్షత్రములవంక ననిమేషదృష్టితో నుండెను. కొన్నితావుల మరణావస్థలోనున్న యంగహీనులగు సిపాయీలు క్షీణస్వరముతో 'నీరు నీరు' అని యఱచుచుండిరి. కొన్నియెడల నొక

రిద్దఱు భటులు తమతమ సోదరులను గాని, చుట్టములను గాని వెదకుచుండిరి. ఒకరిద్దఱు తస్కరులు వెలఁగల వస్త్రములను, స్వర్ణభూషణములను, శస్త్రాదులను వెదకులాడుచుండిరి. మాటి మాటికి గుడ్లగూబల భీకరధ్వని వినఁబడుచుండెను. పెడబొబ్బలతో నక్కలు యుద్ధభూమివంకకు వచ్చుచుండెను. ఒకటిరెండు తావుల నిప్పువెలుతురు కానవచ్చుచుండెను. మాటి మాటికిని దీపకాంతితో క్షేత్రము, శవరాశియుఁ బ్రోజ్జ్వలముగానుండెను. దూరముగాఁ బవిత్రగంగాజలము కలకల నినాదముతోఁ బ్రవహించుచుండెను. నదీవక్షము శాంతము, విశాలము, ప్రకాశమానమునై మానవసుఖదుఃఖములచే విచలిత మగుట లేదు.

క్రమముగా రాత్రి గాఢమగుచుండెను. తుదకుఁ జంద్రుఁడుదయించెను. ఆనిర్మల కిరణములు మానవులకళంకమును బ్రకటము చేయసాగెను. అన్నదమ్ములు విరోధులయి, పరస్పర రక్తపానలాలసులయి యీయుద్ధాగ్ని ని బ్రజ్వరిల్లఁజేసిరి. నక్క, పెద్దపులి, ఎలుగుబంటి - ఇవి స్వజాతిజంతువును హింసింపవు. ఆవెన్నెలలో రాజపుత్రు లిరువురు బంధువు నెవనినో వెదకుటకు యుద్ధక్షేత్రమునకు వచ్చిరి. ఒకచోటఁ బడియున్న కొన్ని శవములనడుమనుండి వేదనాసూచకమైన ధ్వని బయలువెడలెను. మరణావస్థలో నున్న పడుచువాఁడు మూల్గినట్లు వారు కనుఁగొనిరి. ఱొమ్ముపై గాయమునుండి రక్తము స్రవించుచుండుటచే నతఁ డించుమించుగా నచేతనావస్థయందున్నను శీఘ్రముగా మరణము నొందునట్లు కానఁబడలేదు.

తరుణుని యాకారము చూచి రాజపుత్రు లచ్చెరు వొందిరి. వయసు చాల తక్కువ, పదునెన్మిదియేండ్లకంటె నెక్కువ యుండదు, ముఖము తేజోవంతము, సుందరము. అట్టి చక్కఁదనము, కాంతియు స్త్రీలకుఁగాని సామాన్యముగాఁ బురుషుల కుండదు. విచారముగాని, వయస్సును సూచించు రేఖలుగాని లలాటమున నంకింతమై యుండలేదు. నాసలు విశాలముగ, నున్నతముగ నుండెను. మొగము విలోకించినచో నతఁడు యోధవలెఁ గాక బాలునివలెఁ దోఁచును. చిన్నతనముననే నిర్భాగ్యుఁడు స్వజనమును, స్వదేశమును విడిచి బహు దూరము వచ్చి నేఁడు ప్రాణములు గోలుపోవనున్నాఁడు!

యుద్ధవ్యవసాయముచే రాజపుత్రభటుల కిద్దఱకును స్వాభావిక కరుణ చాలవఱకు తగ్గియుండెను. చిన్నవానిని జూచి నవ్వి, వా రిట్లు సంభాషింపసాగిరి.

'ఇంత చిన్నవాఁ డీయీడుననే యుద్ధమునకు వచ్చినాఁడే!'

'చూడఁగా సుజాపక్షము సైనికుఁడు. చిన్నవాఁడైనను యుద్ధమున వెన్ను చూపువాఁడు కాఁడు. మన రేఖవఱకు వచ్చి పోరాడినాఁడు. ఇతఁ డే దేశపువాఁడో!'

'తెలియదు'

'వంగదేశహిందు వని తోఁచుచున్నది. మొగలుగాని, పఠానుగాని యయినచో నిట్టి వేష ముండదు.'

'ఆహాహా! సుజా యీబంగాళా శిశువును దీసికొని జయసింగుమహారాజు, సులేమానులతో యుద్ధము చేయవచ్చినాఁడా? ఈమాలు వమ్ముపక్షమున యుద్ధమునకు మనము రాక, మనపిల్లలను బంపుదము. నడు నడు. ఎందుల కిక్కడ? బంధువును వెదకొదము.'

'ఇతఁడు ప్రాణముతో నున్నాఁడు. కొంచెము సాయ పడినయెడల బ్రదుకు నని నాయూహ. ఇతనిని విడిచి పోవుదమా?'

'శత్రువును బ్రదికించుటకు మనకుఁ దీఱిక లేదు. ఒక్క క్షణములో నితనిని గడతేర్చెదను' అని పలికి యాసైనికుఁడు కత్తి దూసెను.

రెండవ భటుఁడు వానిని వారించి 'వద్దు వద్దు. మరణావస్థలో నున్న సైనికులను సంహరింప వలదని ప్రభువు జస్వంతసింగుమహారాజుగారు ఆజ్ఞాపించినారు. నీవు పొమ్ము. నే నితనిని రక్షించేదను' అని పలికెను.

మొదటి సైనికుఁడు నవ్వుచు వెడలిపోయెను. రెండవ వాఁడు మరణదశలో నున్న చిన్నవానిని జలసేచనముచే బ్రదికించెను. చిన్నవాఁడు కన్నులు దెఱచి చూచెను. నల్వంకల శవములు పడియుండెను. ఆకాశమునఁ జంద్రుఁ డుదయించెను. యుద్ధము ముగిసిపోయెను. లోకము నిశ్శబ్దముగా నుండెను. అప్పు డతఁడు 'మిత్రమా! మీరు నాప్రాణములు కాపాడినారు. మీ నామధేయ మేమి? ఏపక్షము జయించినది. షాహ సుజాగారు ఎచ్చటికి వెళ్ళినారు?' అని ప్రశ్న చేసెను.

'నా పేరు గజపతిసింగు. జస్వంతసింగుమహారాజుగారి దండనాథులలో వాఁడను. ప్రస్తుతము జయసింగుమహారాజు గారి యధీనమున నున్నాను. మీా సుజా మిక్కిలి విలాసప్రియుఁడు. బేగములతోడి వియోగములను సహింపలేక యిప్పు డాయన యూర్ధ్వశ్వాసముతో వంగదేశాభిముఖముగా వెళ్ళినాఁడు. ఆహాహా!' అని యతఁడు పలికెను.

చిన్నవాఁడు చాల ఖిన్నుఁడై, నేలవంకఁ జూచి పిమ్మట నిట్లనెను: 'మీారు శత్రువైనను నా జీవము రక్షించినారు. ఇప్పు డింకను నాకుఁ గొంచెము సాయము చేయుఁడు. కొంచెము మంచినీ రిచ్చి, యొకటి రెండు రోజు లుండుటకుఁ దా వొసఁగుఁడు. నాది చాల దూరదేశము. ఇక్కడ స్నేహితుఁడే లేఁడు. నా పేరు నరేంద్రనాథదత్తు. దాహ మిండు, దాహ మిండు!'

నరేంద్రుని బాలకాకృతిని జూడ గజపతిసింగునకు దయ పుట్టెను. చిన్నవానిదుఃఖవాక్యములను వినఁ గొంచె మనురాగము కలిగెను. అంత నతఁడు నరేంద్రునకుఁ దగిన శుశ్రూష చేసి, శిబిరమునకుఁ గొనిపోయెను.

## ౧౦

పెద్దడేరాలో మహావీరు లిరువురు సంభాషించుచుండిరి. అందొకఁడు రాజపుత్రుఁడు జయసింగుమహారాజు; రెండవయతఁ డాయనప్రియమిత్రుఁడు పఠానకులోద్భవుఁడునగు దేవేర్ ఖాన్.

మహారాజునకుఁ జాలవయస్సు. కాని, ముఖము యౌవనతేజఃపూర్ణము; శరీరము బలిష్ఠము. ఆకాలమున మొగల్ చక్రవర్తి ప్రధాన సేనాపతులలోఁ జాలమంది రాజపుత్రులు. రాజపుత్రుల బాహుబలముచేతనే మొగలులు సముద్రము మొదలు బ్రహ్మపుత్రానది వఱకును గల భారతవర్షమునంతను శాసించుచుండిరి. ఘోర విపత్తుగాని, సంగ్రామముగాని సంభవించిన చోటికి రాజపుత్ర సేనాధిపతిని పంపును; సాధారణముగా జయము కలుగును. రాజస్థాన ప్రభువులలో జయసింగుమహారాజు, జస్వంతసింగుమహారాజును మహాపరాక్రమశాలురు; మహాసత్వసంపన్నులు. షాహజహాన్ చక్రవర్తి కుభయులయెడ విశ్వాస ముండెను. చిక్కు తటస్థించినపుడు వీరినే యుద్ధమునకుఁ బంపుచుండును. ఆకాలమున పఠాన్ మొగల్ సేనాపతులలో జయసింగువలె రణధీరుఁడు, మహాసత్వశాలి, వీర్యవంతుఁడు నెవ్వఁడును లేఁడు. ఆసమయమునఁ బ్రసిద్ధుఁడు, విచక్షుఁడు నగు ఫ్రెంచియాత్రికుఁడు హిందూదేశమునఁ జాలరోజు లుండెను. 'జయసింగుమహారాజువంటి కార్యదక్షుఁ డెవ్వఁడును లేఁ డని తోఁచుచున్నది' అని యాతఁడు ముక్తకంఠముగాఁ జెప్పి పోయెను. షాహజహాన్ యువరాజు దారా షేక్ సులేమాన్ సుల్తాన్ సుజా కెదురుగాఁ బంపినపుడు రాజపుత్రసైన్యములో జయసింగును వానివెంటఁ బంపియుండిరి. కాశీయుద్ధమున సుజా పరాజయ మొంది వంగదేశాభిముఖముగాఁ బలాయనము చేసెను.

డేరాలో దీపములు ప్రకాశించుచుండెను. వెలుపల సైనికులు ఫారాయిచ్చుచుండిరి. నలువంకల శిబిరము లుండెను. జయసింగుమహారాజు శిబిరమున, ఆయనయు స్నేహితుఁడు దేవేర్‌ఖాఁ మాత్రము రహస్యముగా సంభాషించుచుండిరి. ఆసమయమున మ రెవ్వరును లేరు.

'నిజముగా మీ పేరు జయసింగే! మీ రున్నచోట జయమే!' అని దేవేర్‌ఖాన్ పలికెను.

'నేఁటి యుద్ధముమాట చెప్పుచున్నారా? యుద్ధ మెక్కడ? వంగదేశసైన్యముతోడి యుద్ధ మొక యుద్ధమా? సుల్తాను సుజాయును వంగదేశమునం దుండుటచే విలాస ప్రియుఁ డయినాఁడు. ఆయనతో యుద్ధమా?'

'కాని, నేఁటియుద్ధమున సుల్తాన్ సుజా పరాక్రమము, సాహసము చూపలేదా?'

'చూపినాఁడు, నిజమే! యుద్ధసమయమున నతఁడు సాహసి, తక్కినప్పుడు విలాసప్రియుఁడు. కేవల సాహసముచే నే మగును? అతనికి రణకుశలత లేదు.'

'పాదుషా పుత్రులలో నెవనికి యుద్ధమున నేర్పుకలదు? ఔరంగజేబ్ విషయమై యేమందురు?'

'ఓ! ఆయనపేరు చెప్ప నక్కఱ లేదు. అట్టి కుశాగ్ర బుద్ధిని నేను జూడ లేదు; ఎంత పరాక్రమమో, అంత నేర్పు కలవాఁడు. ఆయన నడ్డగించుటకు జస్వంతసింగుమహారాజు గారు వెళ్ళుచున్నారు. కాని ఔరంగజేబుతో యుద్ధమగునో,

కాదో తెలియదు. జస్వంతసింగు గారికి సాహస మున్నది, నేర్పు లేదు. ఈయన్నదమ్ముల విరోధమునఁ దుదకు ఔరంగ్ జేబుకు విజయము కలుగునని తోఁచుచున్నది.'

'మీరు దారాను విడుతురా ?'

'ఇచ్ఛాపూర్వకముగా నెన్నఁడు విడువను. కాని, యుద్ధమునఁ జివరకు ఔరంగ్ జేబు విజయము నొందు నెడల నాయననే చక్రవర్తిగా నెంచవలసి యుండును. మనము పాదుషాయధీనులము. పాదుషా యగువానికి విరుద్ధముగాఁ బ్రవర్తించుట రాజద్రోహ మగును.'

'మంచిది. మీరు తలఁచినచో నేఁడు సుజాను నవలీలగాఁ జెఱపట్టియుందురు. ఆయన పాఱిపోవునప్పుడు మీరనాయాసముగా వెంట నంటియుండఁగలరు. అటు చేసినచో యువరాజు దారా సంతుష్టుఁ డగువాఁడే. మీ రటు లేల చేయలేదు ?'

'నేఁడు, సుజాను బోనిచ్చుటకు హేతు వున్నది. అన్నదమ్ములకు విపరీతక్రోధ మున్నట్లు తెలిసినపుడు దారాసమ్ముఖమునకు సుజాను గొనిపోయినపక్షమున యువరా జాతనికిఁ బ్రాణదండన విధింప వచ్చును, యావజ్జీవము కారాగారము నం దుంచవచ్చును. విశేషించి, నే నీ యుద్ధమునకు వచ్చు సమయమున షాహజహాన్ పాదుషాహ యుద్ధము సంభవింపకుండునట్లు యత్నింపవలె'నని పలికెను. సుజాకు హానిచేయుట యాఁతని యభిప్రాయము కాదు. పాదుషాహ మాటఁ జొప్పున

నేను సంధికోసము కబురంపితిని. సుజాయు నొకవిధముగా సమ్మతించెను. కాని సులేమాన్ పదునువాఁడు; పరాక్రమమును జూపుటకయి తొందరపడి, యాకస్మికముగా గంగానది దాఁటి యుద్ధము ప్రారంభించెను.

ఇవ్విధమున సంభాషణ జరుగుచుండఁగా సైనికుఁడు వచ్చి 'మహారాజ్! సేనాధిపతి గజపతిసింగుగారు దర్శనము వేఁడుచున్నారు' అని విన్నవించెను. జయసింగుమహారాజు సమ్మతించెను.

ఇంచుకసేపటికి గజపతిసింగు చనుదెంచి 'మహారాజా! వంగదేశ హిందూసైనికుఁ డొకఁడు ఖైదీ యయినాఁడు. అతనికి గాయములు తగిలినవి. అతనివలన వంగదేశ వృత్తాంతము తెలియవచ్చును' అని పలికెను.

జయసింగు కొంచె మాలోచించి 'ప్రస్తుతము వానిని నాడేరాలో నుంచుము' అనెను.

అచేతనావస్థయం దున్న నరేంద్రనాథుని, శిబిరములోనికిఁ గొనివచ్చిరి. పిమ్మట జయసింగు గజపతిసింగుతో నిట్లనెను: 'నేఁడు మీరు యుద్ధముఁ జాల శ్రోద్పడినారు. అందులకు మీకును, మీప్రభువు జస్వంతసింగుమహారాజు గారికిని గృతజ్ఞుఁడను. జస్వంతసింగుగారు నా కేమి తెలుపుటకు మిమ్ము బంపిరో, ఆ విషయములు చెప్పవచ్చును.'

ఇరువురు రహస్య విషయములను గూర్చి సంభాషింపఁ జొచ్చిరి.

## ౧౧

అటుతరువాతఁ గొన్నిరోజులు నరేంద్రనాథుఁడు జ్వరముచే నొడలెఱుఁగక యుండెను. నడుమ నడుమ నాతనికిఁ దెలివి వచ్చుచుండెను. పడవ నెక్కి వేగముగా గంగానదిపైఁ బోవుచున్నట్లుండును. మరల నతఁడు దేశమునకుఁ జనుచుండెనా? తరుణి యొకతె యాతనికి శుశ్రూష చేయుచున్నట్లు తోఁచును. మరల హేమలత లభించెనా? రోగి కన్నుల నీరు గ్రిమ్మెను.

కొన్ని దినము లివ్విధమునఁ గడచెను. క్రమముగా రోగ ముపశమించెను. సంపూర్ణముగాఁ దెలివివచ్చినపిమ్మటఁ జూడఁగా నపూర్వగృహమున దీపము వెలుఁగుచుండెను. తాను శయ్యమీఁదఁ బండుకొని యుండెను. ఇట్టి సుందరమందిరము నాతఁ డెన్నఁడును జూడలేదు. ఇల్లంతయుఁ దెల్లరాతితోఁ గట్టినది. వెండిసెమ్మెలో దీపము వెల్గుచుండెను. గృహ మంతయుఁ బరిమళముతో గుమగుమ లాడుచుండెను. ఆతని మంచము ఏనుఁగుదంతముతోఁ జేసినది, వెండి బంగారు చెక్కినది. ఎదుట నాధారము మీఁద వెండిచెంబులో నుదక ముండెను. మంచమున కించుక దూరమున చిత్రాసనముమీఁద యువనకన్యయు, కొజ్జావాఁడును గూరుచుండి మృదుస్వరమున మాటలాడుచుండిరి. యవనయువతి తన్వంగి, సుందరి. ముఖమున లావణ్యము మిలమిలలాడుచుండెను. నేత్రములనుండి చక్కఁ

దనము పొంగి పొరలుచుండెను. లలితబాహులతలు, కమ నీయ తనూవల్లియు సౌందర్యప్రవాహమునఁ దేలి యాడు చుండెను. హేమలత యవయవములు నరేంద్రుని హృదయాం కితము లై యుండెను. కాని, ఇట్టి యుజ్జ్వలసౌందర్యము నతఁ డెచ్చటను జూడ లేదు. దేవాంగనావయవములవంటి యీ యవయవముల నెన్నఁడు జూడలేదు. యవనయువతి దృష్టియు, నంగభంగియుఁ, దేజో దర్పములను సూచించుచుండెను. ఆమె యొకమాఱు హిందూ...గివంకఁ జూచుచు, నింకొకసారి విషణ్ణ భావముతో నేలవంకఁ జూచుచు, వేఱొకసారి మృదుస్వరమున ఖోజాతో సంభాషించుచుండెను. ఖోజా నల్లనివాఁడు, బలి ష్ఠుఁడు. వా రేమి సంభాషించుచుండిరో నరేంద్రుఁడు తెలిసి కొనఁజాలకుండెను. ఒకటిరెండు మాటలు మాత్రము వినఁ గలిగెను.

'మసూర్! ఎందుకు నీ వీ హిందువును నన్ను నాశము చేసెదవు? నిర్దోషి ప్రాణములు తీయుట నీకు సంతోషమా?'

'జులేఖా! ఎందుకీ కాఫరు నీస్థలమునకుఁ దెచ్చినావు?'

'అది నా తప్పు. ఈయన దోష మేమున్నది! ఈయన నిర్దోషి.'

'ఎందు కింత మమత? ఈ కాఫరు నీ ప్రియుఁడా?'

జులేఖా యోధుని కూఁతురు. వెంటనే యామె ముఖ మునఁ బిత్ర్యము లగు క్రోధతేజము లావిర్భవించెను. రక్తో ద్భాసముచే ముఖమండలము కెంపు వారెను. 'మస్రూర్!

నీ వాఁడుదాన వయినపక్షమునఁ బ్రేమబలము నెక్కిగి యుందువు. మగవాఁడవయినయెడల హృదయమునఁ గరుణ యుండెడిది. నీమగతనముతోపాటు దయయు నశించినది. ఇప్పుడు నీవుండెడి యీ రాతిసానకంటెను గఠినము, దుర్భేద్యము' అని యామె పలికెను.

మసూరిక్ నవ్వి 'చూడు, ఇదిగో! కాఫరు లేచుచున్నాఁడు. నేను వెళ్ళుచున్నాను' అని వెడలిపోయెను.

జులేఖా మంచము దిక్కునకుఁ బోవుటకయి లేచెను. కాని, కొంచె మాగి స్థిరదృష్టితో నేలవంకఁ జూచుచు నిలిచి యిమ్మట నెమ్మదిగా నరేంద్రుని జేరి గాయమును బరీక్షించెను. గాయము మానినట్లే. జ్వరము తగ్గిపోయెను. శరీరము మాత్రము దుర్బలముగ నుండెను. నరేంద్రుఁ డాశ్చర్యము నొంది నిశ్చలదృష్టితో నామెముఖమువంకఁ జూచుచుండెను. జులేఖావదన మెఱ్ఱవారెను. మేనిరక్తము వేగముగ లలాటమును, నేత్రములను, జెక్కిళ్ళను నెఱుపు జేసెను.

ఈ మందిరమును, శయనమును జూచి నరేంద్రుఁ డిదివఱకే మిక్కిలి విస్మయ మొందెను. తా నున్నస్థల మేది? తన్ను దీసికొని వచ్చినవా రెవరు? ఎవరు శుశ్రూష చేయుచున్నారు? జులేఖా మస్రూరుల సంభాషణము విని భీతుఁడై యిప్పుడు జులేఖా చేయుచున్నపనికి నింకను వింత పడెను. 'నే నెక్కడ నున్నాను? ఇది వంగదేశమా? మీ రెవరు? మీ పేరేమి?' అని ప్రశ్నించెను.

శాంతిగ నున్న రాత్రివేళ నాకస్మికముగాఁ బిడుగు పడినచో సంచలించునట్లు నరేంద్రుని యీ ప్రథమవాక్యముల నాలకించి జులేఖా యులికిపడి బదులు చెప్పక తన చిన్న పెదవులపై వ్రేలు పెట్టుకొనెను.

'అసహాయుఁడను! నిరాశ్రయుఁడను! ఎక్కడనున్నానో దయచేసి తెలుపుఁడు.'

జులేఖా మరలఁ బెదవిమీఁద వ్రేలు పెట్టుకొని, వెంటనే మొగ మావలకుఁ ద్రిప్పెను. ఆమె యుజ్జ్వల నేత్రములందు బాష్పము లున్నట్లు నరేంద్రునకుఁ దోఁచెను. అతని కేమియుఁ దెలియ లేదు; ఆలోచింపుచు నతఁడు మరల నిద్రపోయెను.

౧౨

కొద్దిరోజులలో నరేంద్రనాథునకు సంపూర్ణారోగ్యము కలిగెను. దేహారోగ్యము కలిగిన నేమి? చింతచే నంతఃకరణము వ్యథ నొందసాగెను. మస్రూర్ జులేఖా తప్ప,ఆయింటి లోనికి మరెవ్వరు వచ్చుటలేదు. ఎవ్వరును మాటలాడుట లేదు. మసూరిరును నేమయిన నడిగినచో నతఁడు నవ్వి వెడలిపోవును. జులేఖా పెదవులపై వ్రేలిడును. అయినను, జులేఖా యతని దుఃఖమునకు దుఃఖించుచున్నట్లును, ఆపదకుఁ దా నాపదయందున్నట్లును స్పష్టముగాఁ దోఁచును. నరేంద్ర నాథుఁ డెంత యోజించినను నిర్ధారణ చేయలేకపోయెను. తాను వంగదేశమునకు వచ్చినాఁటనుండి తనయెడ ననుగ్రహముగల

సుల్తాన్ సుజా ఆజ్ఞ యిచ్చి నరేంద్రుని రోగదశలో రాజ మహాలునకుఁ దెప్పించెనా! కా వచ్చును; రాజమందిరములందుఁ గాక యిట్టి విలువగల వస్తువు లెచట నుండును? కాని, సుజా కాశీయుద్ధమున నోడిపోయెననియుఁ, దాను మృతప్రాయుం డై శత్రుహస్తములం బడెననియు నతనికిఁ గొంచెము కొంచె ముగా జ్ఞప్తియుండెను. శత్రువులు తుద కాతనిని శూలారోప ణమునఁ దప్పగించుటకేనా యిట్లు శుశ్రూష చేయుచున్నారు? నరేంద్రుఁడు కొంచె మయినను నిర్ణయింపఁజాలకుండెను.

రాత్రి రెండుజాముల వేళ నరేంద్రనాథుఁ డేనుఁగు దంతపుఁ బీఠమునఁ గూరుచుండి యుండెను. ఎదుట దీపము వెలుఁగుచుండెను. నరేంద్రుఁడు చెక్కిటఁ జేయి వెట్టుకొని మిక్కిలి చింతామగ్నుఁడై యుండెను.

చింతాసూత్రము విచ్ఛిన్నమై, యతఁ డొకసారి మొగ మెత్తి యెదుటఁ జూడఁగా నతని కేమి కనఁబడెను! జులేఖా సమ్ముఖమున నిశ్శబ్దముగా నిలిచియుండెను. ఆమె ముఖమును బెదవులును పాలిపోయినవి. కేశపాశము చెదరి యున్నది. విషణ్ణవదనయై యామె కన్నుల నీరు నించుచుండెను. నరేం ద్రుఁ డామెను జూచి విస్మితుఁడై 'రమణీ! మీ రెవరో నే నెఱుంగను. మీ యభిప్రాయ మేమో స్పష్టముగాఁ దెలుపుఁడు!' అని యడిగెను.

జులేఖా బదులుచెప్పక మెల్లగా బాష్పకణములవిడిచెను.

'మిమ్మేఁ జూడఁగా నేదో యాపదయో, భయమో యాసన్నమయినట్లు తోఁచుచున్నది. స్పష్టముగాఁ బలుకుఁడు. ఉద్ధరించుట కుపాయ ముండెనేని ప్రయత్నము చేసెదను' అని నరేంద్రుఁడు మరల నుడివెను.

అప్పటికిని జులేఖా మాటలాడక, నిశ్శబ్దముగాఁ గన్నీరు విడిచి, మెల్ల మెల్లన వెడలిపోయెను.

నరేంద్రుఁ డచ్చెరు వొందెను. రాత్రివేళ నిట్లాస్మిక ముగా నామె కాన్పించుటకుఁ గారణము గ్రహింపలేక, యేదో ఘోరవిపత్తు సమీపించె నని తలఁచెను. చెక్కిటఁ జేయి పెట్టుకొని నరేంద్రుఁడు విచారమున మునిఁగి యెన్నో యపాయముల నాశంకించుచుండెను.

చప్పున గృహములోని దీప మాఱిపోయెను. ఆచీక టిలో ఖొజ్జావాఁడు వచ్చి, తన వెంట రావలయు నని నరేం ద్రునకుఁ దెలిపెను. నరేంద్రుఁడు భయముతో నాతని వెంటఁ జనెను. ఇరువురు నిశ్శబ్దముగా నెన్ని గృహములు, నెన్ని యావరణములు దాఁటిపోయిరో తెలియదు. నరేంద్రుఁడు రాజమహలులోని ప్రాసాదమును జూచియుండెను. కాని,యిట్టి దాని నెన్నఁడుఁ జూడలేదు. కొన్నిచోటుల స్ఫటికశిలా నిర్మి తములైన మందిరములలో సుగంధ సుందర దీపములు ప్రకా శించుచుండెను. చంద్రకాంతశిలా స్తంభములమీఁదను వెల గల శిలలతోను, వెండిబంగారములతోను జేసిన కట్టడపుఁబని వర్ణింప నలవి గాదు. కొన్నితావుల ప్రాంగణములందు గుడ్డి

వెన్నెలలో కేళాకూళులందు జలము నాట్యమాడుచుండెను. నల్దిక్కుల నున్న మనోహరోద్యానమందలి రమణీయ పుష్ప లతలమీఁదుగా మందమారుతము వీతెంచుచుండెను. కొన్ని చోట్ల నారామ వృక్షతలంబులఁ గూరుచుండి యుజ్జ్వల వేష ధారిణులు, జాజ్వల్యమాన దేహాలు నగు రమణు లొకరిను వురు వీణవాయించుచునో, నిద్రావస్థయందో యుండిరి. వెలు పల కొజ్జాలు నిశ్శబ్దముగాఁ బచారు చేయుచుండిరి. నడుమ నడుమ మృదుస్వరముతో మారుత మాయింద్రనగరియందుఁ బ్రసరించుచుండెను. తనవిపత్తు మఱచి నరేంద్రుఁడు కమనీయ ప్రాసాద రమ్యహర్మ్య ప్రాంగణారామములను, నపూర్వ నేపథ్యధారిణులగు రమణీమణులను జూచి యాశ్చర్యము నొందెను. ఆతఁ డెక్కడ నున్నాఁడు? ఆస్థాన మేది?

కొన్నినిముసముల కతఁడు సువర్ణఖచితోన్నతద్వారము నెదుటకుఁ జేరెను; తోడనే కవాటము లోపలినుండి యున్ముక్త మయ్యెను.

నరేంద్రుఁడు ప్రశస్త దీపాలంకృత విశాలభవనము జొచ్చెను. ఆకస్మికముగాఁ జీకటిలోనుండి పెద్దకాంతిలోనికిఁ బోవుటచే నతఁ డేమియుఁ జూడలేక, దీపకాంతి సహింపఁ జాలక, చేతులతోఁ గన్నులు మూసికొనెను. ఇంతలో బహు రమణీకంఠవినిర్గతహాస్యధ్వని ప్రాసాదము నిండెను.

జీవితకాలములో నరేంద్రుఁ డెన్నఁడు నింతవింత నొంద లేదు. తా నెచ్చటికి వచ్చెనో, యీజరుగునది స్వప్నమో,

కాక ప్రాపంచిక చర్యయో, యింద్రజాలమో! నరేందు్రుఁడు మరల కన్నులు తెఱచెను. క్రమ్మఱ జాజ్వల్యమాన తేజః పుంజమున నాతని నేత్రములు మిఱుమిట్లుగొలుప, నీరు గ్రమ్మెను. మరలఁ జేతులతోఁ గన్నులుమూసికొనఁగాఁ దిరుగ బహు రమణీ కంఠవినిర్గతహాస్యధ్వనిచేఁ బ్రాసాదము శబ్దాయమాన మయ్యెను.

కొంచెము సేపటికి కనఁబడినవానిచే నతని విస్మయము పదిరెట్లు హెచ్చెను. చంద్రకాంతశిలలతోఁ గట్టిన గొప్ప భవనములోని కతనిని గొనిపోయిరి. ఉన్నత స్తంభములపైనున్న లోపలి కప్పునను, గంబముల మీఁదను నున్న చిత్రపుఁబని విచిత్రమయినది. ఒక కంబమునుండి యింకొక స్తంభము మీఁదికిఁ బుష్పమాలికలు వ్రేలాడుచుండెను; క్రిందఁ బూవులు రాశీభూతమై యుండెను. యువతీకంఠములందుఁ బూదండలు వ్రేలాడుచుఁ బరిమళమును మందిరమున వెదచల్లుచుండెను. ఇంటికప్పునుండియు, స్తంభములనుండియు, ప్రసూనపత్రరాశి మధ్యమునుండియు ననేక సుగంధ దీపిక లాసుందర మందిరమును గాంతిమంతము, సువాసితమును జేయుచుండెను. రేఖాకారముగా నెందఱో సుందరాంగనలు నిలిచియుండిరి. ఆ రేఖనడుమఁ బ్రదీప ప్రభా ప్రతిస్పర్ధియగు రత్నసింహాసనముపై వారల రాణి యుపవిష్టయై యుండెను. ఇది స్వప్నమా? యింద్రజాలమా? 'ఆలిఫ్ లైలా' అను పుస్తకమున 'అబుల్ హాసన్' అను దరిద్రుఁ డొకనాఁడు నిద్రలేచి, తాను 'బాగ్దాదు

ఖలీపా' అయినట్లు చూచిన కథను నరేంద్రుఁడు చదివియుం డెను. నరేంద్రునిస్వప్న మంతకంటెను నాశ్చర్యకరము; ఆకస్మికముగాఁ దాను దేవళోద్యానమున నచ్చరలచేఁ బరి వేష్టితుఁ డయినట్లు లాతఁడు విలోకించెను !

నరేంద్రుఁ డాయచ్చరుల వంకఁ జూచెను. వారు నిశ్శబ్దముగా నిలిచియుండి, తమతమ తొమ్మలపైఁ జేతులు పెట్టుకొని, నేలవంకఁ జూచుచు నిర్జీవ ప్రతిమలవలెఁ గానఁ బడుచుండిరి. వారి కేశపాశములనుండి వెలువడు మాణిక్య ప్రభ దీపావళిని బరిహసించుచుండెను. బహు మూల్య వస్త్రము లా కాంతియం దుజ్జ్వలతరము లయ్యెను. వారెల్లరు రాణి యానతికై వేచియుండిరి.

ఆరాణివంకఁ జూచినప్పుడు నరేంద్రుఁడు నూఱు మడుఁగు లాశ్చర్య మొందెను. ఆమె యౌవనము దాఁటి పోయినను బడుచుఁదనపు సౌందర్యము, ఉన్మత్తభావము నింకను వీడలేదు; ప్రథమ యౌవనావేగము, లాలసయు వయస్సుతో వృద్ధి నొందుచున్నట్లు బోధపడును. ఆమెశరీరము పొడువుగను, ముఖము పెదవులు నెఱ్ఱగాను నుండెను. నల్లని కేశపాశమున నమూల్య వజ్రఖండ మొకటి కాంతితో ధగ ధగలాడుచుండెను. నేత్రము లంతకంటెను జ్యోతిర్మయ ములు. ఆమె మేలిముసుఁగా కాంతిని మఱుఁగు పెట్టలేకుం డెను. చూడఁగనే యామె-స్త్రీ కాని, అచ్చర కాని, ఎవ

రయినను-అసాధారణ మహిళ యనియు,భూమినో స్వర్గమునో శాసించుట కవతరించె ననియుఁ దోఁచెను.

దీని నంతను విలోకింప నరేంద్రున కవకాశము లేకుండెను. శీఘ్రముగా వాద్యములనుండి తానము బయలు దేఱెను. దానితో నూర్వురు యువతుల కంఠధ్వనులు సమ్మేళన మొందెను. అట్టి యపూర్వ సంగీతమును నరేంద్రుఁ డెన్నఁడు వినలేదు. అతని శరీరము పులకరించెను. నిశ్చేష్టుఁడై యతఁడు గానము నాకర్ణింప సాగెను. ఆసంగీతము క్రమక్రమముగా హెచ్చి, ప్రాసాదమును దాఁటి, యాకాశమున వ్యాపింపఁ జొచ్చెను. గగనసంచారులగు నదృష్టజీవులాగానమునకు సహకారులై నూఱుమడుఁగులు వృద్ధిచేయుచున్నట్లు తోఁచెను. మరల గీతము క్రమముగా మందీభూతమై లీనమైపోయెను. ప్రాసాదము తిరుగ నిశ్శబ్దమయ్యెను. ఇవ్విధముగా గీతధ్వని మూఁడుపర్యాయములు కర్ణగోచరమై తుదకు లీనమాయెను.

అంతట రాణి సత్తువకొలఁదిఁ బదాఘాతము చేయఁగ నామందిరమున నొకప్రక్క నెఱ్ఱనితెఱ జాఱెను. నరేంద్రునకు భయముకలుగునట్లు రెండవప్రక్కనఁ గుఠారములు పట్టుకొని రక్తాంబరధారులు,కృష్ణదేహులు నగు నలుగురు కొజ్జాలు నిలువఁబడియుండిరి. రాణి మరలఁ బదాఘాతము చేయుటచే వారిలో ముఖ్యుఁడు సింహాసనముదగ్గఱకు వచ్చి నిలిచెను. అతఁడు మస్రూర్.నరేంద్రునినాడులందు రక్తమింకిపోయెను.

మన్సూర్ మృదుస్వరమున రాణితోఁ గొంతసేపు మాటలాడుచుండెను; వానివాక్యములు నరేంద్రునకు వినఁబడలేదు; కాని మాటలాడునపుడు నడుమనడుమ మన్సూర్ నరేంద్రునివంక వ్రేలుపెట్టి చూపుచుఁ, బండ్లు కొఱుకుచుఁ, గన్నులెఱ్ఱచేసికొని, రాణి నుత్తేజింపఁ జేయుచున్నట్లుండెను. మన్సూర్ మాటలు తెలియకపోయినను సంగభంగిని జూడ నరేంద్రునకు వెఱపు కలిగెను. ఈక్రొత్తదేశమున శూలారోపకునిచే మృతినొందవలసియుండు నని దుఃఖము కలిగెను.

రాణి మరలఁ బదాఘాతము చేసెను. తోడనే రెండవదిక్కునుండి పచ్చని తెఱ పడెను. హారిద్రాంబరధారిణు లగు పరిచారికలు నలుగురు నిలువఁబడి యుండిరి. రెండవసారి కాలితోఁ దన్నుటచే నా పరిచారికలు ఖైదీని రాణిసమీపమునకుఁ బట్టుకొని వచ్చిరి. ఆమె జులేఖా. నరేంద్రుఁ డాశ్చర్యపడెను.

జులేఖా యేమిపలికెనో నరేంద్రునకు వినఁబడ లేదు; కాని, యామె యాకారమునుజూచి రాణి నామె ప్రార్థించుచుఁ గన్నీటితో రాణిపాదములపైఁ బడినట్లు తెలిసికొనెను.

నరేంద్రుని దేహకాంతి సహజముగఁ బచ్చనిది, నేత్రములు తేజస్వంతములు, లలాట మున్నతము, ముఖము పరాక్రమ సూచకము. తరుణుఁడు, సుందరుఁడు, సాహసియునగు నరేంద్రుని రాణి మాటిమాటికిఁ జూచుచుండెను.

కొంతసేపు చూడఁజూడ నాతని వ్రేలిపై నుంగరము రాణికిఁ గానంబడెను. పాపము! నరేంద్రుఁడు రోగపీడితుఁడై యున్నప్పుడు జులేఖా యొకనాఁడు విలాసార్థ మాయంగుళీయము నాతనివ్రేలికిఁ బెట్టెను;అప్పటినుండియు నదియతనిచేత నున్నది. ఉంగరమును రాణియుఁ బరిచారికలును గుర్తించిరి. అంతటఁ గ్రోధముచే రాణి సుందరవదన మెఱ్ఱవారెను. నేత్రములనుండి విస్ఫులింగములు రాలెను.

విచారణ ముగిసెను. రాణి కఠినముగా నిట్లాదేశించెను: 'ఈపాపాత్మురాలిని శూలారోపణ చేయింపుము; కాఫరు నేనుఁగుపాదములక్రింద వేయుము!'

తటాలున నొక్కసారిగా దీపము లన్నియు నాఱిపోయెను. చీకటిలో నిశ్శబ్దముగా కొజ్జాలు నరేంద్రుని త్రాటితో బంధింపసాగిరి.

అంధకారమున నెవ్వరో నరేంద్రునినోటికడఁ బాత్రను బట్టిరి. అతఁడు విస్మయోద్వేగములచేఁ దృషాపీడితుఁ డగుటవలనఁ బాత్రములోని పానీయమును ద్రాగెను.కోడనే తెలివి తప్పెను. అటుపిమ్మట నేమిజరిగెనో యతనికిఁ దెలియదు. ఆచీకటిలో నెవ్వరో వచ్చి చేతియుంగరమును దీసికొన్నట్లును, గరుణాస్వరముతో దుఃఖించుచున్నట్లును మాత్రమాతనికి గోచరించెను. స్వప్నముననునరేంద్రుఁడు దీనురాలగు జులేఖాను జూచెను.

నరేంద్రనాథునకుఁ దెలివివచ్చిచూచునప్పటికి సూర్యోదయ మయ్యెను. నీరెండలో నాతఁడు వీథినడుము డేరాప్రక్కఁ బండుకొనియుండెను. తరుణారుణకిరణజాల మతనిముఖముపైఁ బడి సర్వమును దేజోమయ మొనర్చెను. అది యేపట్టణము? వంగదేశరాజధాని యగు రాజమహాల్ నగరమా యది? సుల్తాన్ సుజా యనుగ్రహించి తన్ను కాశీనుండి యిచ్చటకుఁ దెప్పించెనా? గతరాత్రమున నతఁడు నేలపైఁ బండుకొని స్వప్నమున మేడలను నప్సరసలను గాంచెనా!

## ౧౩

నరేంద్రుని యాశ్చర్యమునకుఁ దావలము లేకుండెను. ఆప్రదేశ మతఁ డెన్నఁడును జూచినది కాదు. అది పెద్ద సత్రమునలే నుండెను. నడుమ విశాలప్రాంగణము; దానికి నల్వంకల రెండంతస్తుల మేడలచాలు; ప్రతి ప్రకోష్ఠమునం దొకరిద్దఱు మనుష్యులు; పారసీకులు, ఉజ్బెక్కులు, పఠానులు, హిందువులు – అందఱు వర్తకులు. క్రొత్తగా నగరమునకువచ్చి యీసత్రములో జనులు నివసించుచుందురు. రాత్రి బాటసారులెల్లరు సత్రములోనికి వచ్చినతరువాతఁ దలుపులు మూసి, ప్రాతఃకాలమున మరల సింహద్వారమును దెఱచిన తోడనే జనులు రాకపోకలు చేయుచుందురు.

ముసలి పారసీక షేక్ సాహెబొకఁ డంగణమునఁ గూరుచుండి పొగాకు నమలుచుండెను. నరేంద్రుఁ డాతనికడ

కేగి 'షేక్ జీ! ఈప్రదేశము పే రేమి? నేనిచ్చటకుఁ గ్రొత్తగా వచ్చినాను. అంతయును నూతనమే' అనెను. 'బావా! నేను గూడ వ్యాపారముమీఁద నిన్ననే యీనగరమునకు వచ్చినాను; విశేషములు నాకుఁ దెలియవు' అని షేక్ సాహెబు పలికెను.

'తమకు నాకంటె హెచ్చుగాఁ దెలియును. ఈప్రదేశముసంగతి కొంచెము చెప్పుఁడు.'

'నిజముగాఁ జెప్పుచున్నాను. నేనీనగర మెంతమాత్ర మెఱుఁగను. అయినను, ఇది బేగంసాహెబాల సత్రము. పాదుషాగారి పెద్దకూఁతురు క్రొత్తగావచ్చినవారి వీలుకొఱకీసత్రమును గట్టించెనని విన్నాను. నేను సమర్కంద్, బుఖారా, షిరాజ్, ఇస్పహాన్ నగరములను జూచినాను; కాని, యింత చక్కనినగరము చూడలేదు.'

'ఈనగరము పే రేమి? పాదుషా యెవ్వరు? బేగము లెవరు?'

ముసలివర్తకుఁడు తీక్ష్ణదృష్టితో నా పసుచువానిని జూచి, సేవకు నొకనిఁ బిలిచి 'చూడఁగా యీకాఫరు బుద్ధిహీనునివలె నున్నాఁడు. ఈపిచ్చివానిని వెడలఁగొట్టు. పిచ్చివల్ల నేమిచేసిపోవునో!' అని యాజ్ఞాపించెను. నరేంద్రుఁడుపాయము లేదని యచ్చటనుండి తొలఁగిపోయెను.

పిమ్మట, పండ్లను విక్రయించుటకయి ధనికవర్తకుల కడకుఁ బోవుచున్న పఠాన్‌స్త్రీని జూచి, నరేంద్రుఁ డామె

దగ్గఱకుఁ జని 'బీబీ! ఈపట్టణము పేరేమి? ఈప్రదేశము నేమందురు?' అని ప్రశ్నింప నామె యాశ్చర్యపడి, క్షణ మాత్రము నరేంద్రునివంకఁ జూచి 'కాఫర్! నేను పడుచు దానను గాను; పరిహాసములాడుటకు వేఱొకచోటికి వెళ్ళు. ఈచక్కని మొగము చూచిన భోగస్త్రీలు మఱుపువచ్చు వయస్సు లేదు?' అని పలికెను. నరేంద్రుఁ డప్రతిభుఁ డయ్యెను.

తరువాత, ఎదుట నిలిచియున్న రాజపుత్ర సైనికుని నరేంద్రుఁడు చూచెను. సేవకుఁ డాతనిగుఱ్ఱమునకు మాలీసు చేయుచుండెను. యోధుఁడు సంసిద్ధుఁడై కార్యము శీఘ్రముగా ముగింపు మని సేవకునితోఁ జెప్పుచుండెను. నరేంద్రుఁ డాయనతో 'అయ్యా! నే నిచ్చటకుఁ గ్రొత్తగా వచ్చినవాఁడను. ఈ స్థానము పేరే తెలియదు. తమ రిచ్చట బహుకాలమున్నట్లు తోఁచుచున్నది. అనుగ్రహించి, యీపురవిశేషములు కొంచెముగాఁ జెప్పఁగలరా?' అని యడిగెను. రాజపుత్రుఁడు కొంత తడవు నరేంద్రునివంకఁ జూచి 'బాబూ! నీముఖము పూర్వము చూచినాను. నీవు వంగదేశమునుండి వచ్చితివి కావా? అవును, జ్ఞప్తికివచ్చినది. నీవు నన్నింతలో నే మఱచినావా?' అనెను.

నరేంద్రుఁడు రాజపుత్రుని నిదానించి చూచి 'మఱవ లేదు. గజపతిసింగుజీ! మీరు నన్ను కాశీయుద్ధము తరువాత రక్షించినారు. ఈజన్మములో మిమ్ము విస్మరింపఁ జాలను!' అని పలికెను.

ఇరువురు చాలసేపు సంభాషింపఁ జొచ్చిరి. హిందూస్థాన రాజధానియగు ఢిల్లీనగర మిదియే యని తెలిసికొని

నరేంద్రుఁడచ్చెరువొందెను. మాటపై మాటమీఁద గజపతి యిట్లనెను: 'నేను జయసింగుమహారాజుగారి సన్నిధినుండి కొన్ని కాగితములనుదీసికొని జస్వంతసింగుమహారాజుగారి సముఖమునకుఁ బోవుచున్నాను. ఔరంజేబుతో యుద్ధము కయి వారు ప్రస్తుత ముజ్జయినికి వెళ్ళినారు.యుద్ధము కాకపూర్వము నే నచ్చటకుఁ జేరుదునేని శుభ మగును. నీ కిష్ట మయిన నో నావెంట రమ్ము. మహారాజుగారికి విన్నవించి, అశ్వికదళములో నుద్యోగ మిప్పించెదను.' బంధుహీనుఁడు, అర్థహీనుఁడు నగు నరేంద్రుఁ డా ప్రస్తావన కంగీకరించెను. పిమ్మట నిర్వురు ఢిల్లీనగరమును సందర్శించుటకు బయలుదేఱిరి.

మహాభారతమునందుఁ జెప్పఁబడిన యింద్రప్రస్థనగర మెచ్చట నుండెనో భారతవర్షశేష హిందూచక్రవర్తి యగు పృథ్వీరాయని రాజధాని ఢిల్లీనగర మచటనే యుండెను. షాజహాన్ చక్రవర్తి యచ్చోటనే నూతనముగా రాజధాని సంస్థాపించి చక్కని ప్రాసాదము మొదలగువానిని దుర్గమును నిర్మించి నగరమునకు 'షాజహాన్ బాద్' అని పేరు పెట్టెను. కాని, యాపేరెవ్వరు నెఱుఁగరు. నేఁటికిని ఢిల్లీనామమే విశ్రుతమై యున్నది. పృథురాయనినాఁటి నామమే యిప్పటికిని గలదు.

ఢిల్లీ నొకప్రక్క యమునానదియుఁ, దక్కినమూఁడు వైపులను నర్ధగోళాకారముగాఁ బ్రాకారమును గలవు. ప్రాకారము మీఁదుగా రాకపోకలకు మార్గ మున్నది. యమునకుఁ బ్రాకారమునకు నడుమగా ఢిల్లీనగర మున్నది. ఆవరణము

నకు వెలుపల నాలుగు పెద్ద పేఁట లున్నవి; అందు ధనాఢ్యు లగు ఉమ్మరాహుల మేడలు, రాజుల మేడలు, ఆరామములును జాలదూరమువఱకుఁ గానఁబడుచుండును. దక్షిణనగరమునకు లోపలను, యమునానదికి సమీపమునను పాషాణ ప్రాకార పరివేష్టిత మగు దుర్గము, చక్రవర్తిప్రాసాదము, అద్వితీయ మైన చంద్రశిలానిర్మితహర్మ్యములును గలవు.

గజపతియు నరేంద్రుఁడు ప్రధానమార్గము వెంట దుర్గాభి ముఖముగాఁ జనుచుండిరి. నగర మంతయు నించుమించుగా సైనికులతో నిండియుండెను; అందు ముప్పది వేలసేన నివసించు చున్నది; సైనికుల కుటుంబములును, సేవకు లనేకులును నగ రమున మట్టిగోడలపూరిండ్లయందు నివసించుచుండిరి; కావున, నగర మిట్టికుటీరములతో నిండియుండెను. ఖాద్యద్రవ్యములను వస్త్రాదులను విక్రయించు దుకాణము లనేకము లాకుటీరములే యగుటచే సాధారణముగాఁ బ్రతిసంవత్సరము వందలకొలఁది దగ్ధము లగుచుండెను. నరేంద్రుఁ డిరుప్రక్కల నిట్టి కుటీరము లను జూచుచుఁ బోవుచుండెను. దుకాణదారులు పచారిద్రవ్య ములు విక్రయించుచుండిరి. మార్గము జనాకీర్ణము. సామాన్య వేషధారు లగు జనులు చాలమంది తమ తమ పనులపై వెళ్ళు చుండిరి. మధ్యశ్రేణి గృహస్థులు తదితరులు నిప్పు డిటుకలతో గృహములు నిర్మించి నగరమునకు అందము దెచ్చినారు. కాని, రెండువందల సంవత్సరములకు ముం దామాటయే లేదు. అప్పుడు మహల్లోకము మేడలయందును, సామాన్యజనము కుటీరములందును నుండెడిది.

పోయి పోయి నరేంద్రుఁడు ఘంటాపథము చేరెను. ఆ మార్గమున కిరువంకల మేడ లుండెను. మన్సబ్‌దారులు, కాజీలు, ఉమ్మరాహులు, వర్తకులు, రాజులు మొదలగు మహాజనులు హార్మ్యశ్రేణులనుండి మార్గమును జూచుచుండిరి. మేడలప్రక్కఁ జనుచు నతఁడు గజపతిసింగుతో సంభాషింపఁ జొచ్చెను. కొంచెము దూరము పోవునప్పటి కిరువురకును సుప్రసిద్ధమగు జుమ్మామసజిద్ దృగ్గోచర మయ్యెను. అట్టిది భారతవర్షమున నేకాక ప్రపంచమునం దెచ్చటను నున్నట్లు తోఁచదు. విస్మితుఁడై నరేంద్రుఁడు "ఎదుటఁ గనఁబడు పెద్దమసీదు పే రేమి?" అని గజపతిసింగు నడిగెను.

'జుమ్మామసీద్. ప్వారతముమీఁదిభాగమును జదును చేసి, దానిపై నీ మసీదు నిర్మించి రని వింటిని. దానిరక్తవర్ణముచేఁ గన్నులు మిఱుమిట్లు నొందుచున్నవి. దానిపైఁ దెల్లరాతితోఁ గట్టిన మూఁడు గంబూజు లున్నవి. పాదుషా ఢిల్లీనగరమున నున్నప్పుడు ప్రతిశుక్రవార మీ మసీదుకు వచ్చును. ఆసన్నాహము చూచిన చో నెన్నటికి మఱువరాదు. దుర్గమునుండి మసీదువఱకు నాలుగైదువందలమంది సిపాయీలు బారు తీరి నిలిచి యుందురు. వారి తుపాకులమీఁదఁ జక్కని యెఱ్ఱజెండా లెగురుచుండును. అయిదారుగు రాశ్వికులు తోవ్రిన చేయుచు ముందు వత్తురు. తరువాత నేనుఁగు మీఁద జాజ్వల్యమాన సింహాసనమునఁ బాదుషా విచ్చేయును. అటుపిమ్మట ఉమ్మరాహులు, మన్సబ్‌దారులు, మంచిదుస్తు

లతోఁ జనుదెంతును. ఇచ్చట నిలిచియున్న నేమి లాభము? నడవు; దుర్గములోనికిఁ బోయి రాజభవనములను జూతము' అని గజపతి చెప్పెను.

దూరమునుండి యెత్తుగా నున్న యెఱ్ఱని ప్రాకార సౌందర్యము చూచి నరేంద్రనాథుఁ డాశ్చర్య మొందెను. ఆకాలమున భారతవర్షమున కెచ్చటెచ్చటనుండివచ్చిన బాటసారులు ఢిల్లీనగరదుర్గమును బ్రాసాదమును దెల్లరాతిలో గట్టిన మస్జిదును హార్మ్యములను విలోకించి యిట్టివి ప్రపంచమున మఱి లేవని వర్ణించి పోవుచుండెడివారు. దుర్గ ప్రవేశస్థానమున విస్తీర్ణాంగణము కలదు. దానియందు హిందూరాజశిబిరము కలదు. ఆరాజు దుర్గద్వారము రక్షించుచుండును. రౌతులు, ఉమ్మరాహులు నిరంతరముగా నిటునటు పోవుచుండిరి. దుర్గమునుండి సిపాయీలు వెలుపలికి రాక పోకలు చేయుచుండిరి. విదేశీయవణిజులు దుర్గద్వారమున గూడుచుండిరి. వేలకొలఁదియితరజనులు నదీప్రవాహము వలె నిటునటుఁ బరుగెత్తుచుండిరి.

ద్వారదేశమున పాషాణగజములు, వానిపై మనుష్యాకృతులు నుండెను. నరేంద్రుఁ డుత్సుకుఁడై యాప్రతిమూర్తు లెవరివో యని యడుగ గజపతి యిట్లనెను: 'హిందువులు మీ రెఱుఁగరా? వీరిద్దరు రాజపుత్రవీరులు,'జయమల్లు''పత్తు' అనువారు. అక్బరుతో యుద్ధమునఁ చితోడుదుర్గమును రక్షించుచుండిరి. తరువాతఁ గాపాడ లేనప్పుడు పారతంత్ర్యము నంగీక

రింపక యుద్ధమున నిహతు లయిరి. మాతాత 'తిలకసింగు' ఆయుద్ధమున ప్రాణము లర్పించెను. నాతండ్రి తేజసింగుగారి వలన, ఆవృత్తాంతము చిన్నతనమున వినుచుండెడివాఁడను. పత్తు తల్లియు, భార్యయు వీరాంగనలు. వారుకూడ యుద్ధమునఁ బరాక్రమము చూపి మృతి నొందిరి. వారి జ్ఞాపకార్థము 'అక్బరు పాదుషా' యీవిగ్రహముల నిచట స్థాపించెను. కాని, రాజపుత్ర రాజులకీర్తి చిరస్థాయిగా నుండుటకు విగ్రహము లక్కఱ లేదు. పరాక్రమమునకు గౌరవ ముండునంత కాలము రాజపుత్రనామము నెవ్వరు మఱచిపోరు. రాజస్థానమునఁ బ్రతిపర్వతశిఖరమందును రాజపుత్రవీరులకీర్తి యంకితమై యున్నది; భారతవర్షమునందలి ప్రతినదీప్రవాహతరంగములయందు శబ్దాయమాన మగుచున్నది!'

ఘంటాపథమునుదాఁటి యిద్దఱు దుర్గములోఁజొచ్చిరి. మార్గమున కిరుపంకల నున్నమేడలలో రాజసేవకులు తమ తమపనులు చేయుచుండిరి. దుర్గద్వారమును వెలుపల హిందూ రాజు రక్షించుచున్నట్లు, లోపలమార్గముకడ మన్సబ్ దారులు ఉమ్మరాహులు దుర్గద్వారమును రక్షించుచుండిరి.

ఇరువురును దుర్గములోఁ బెద్దపెద్ద కారఖానాలు చూచిరి. రాజపరివారమునకుఁ గావలసిన విచిత్రవస్తువు లన్నియు నీకారఖానాలయందే తయారుచేయుదురు. ఒకచోట పట్టుబట్టలు నేయువారు, ఒకచోట స్వర్ణకారులు, ఒకచోట చిత్రకారులు, జోళ్ళు కుట్టువారు, దర్జీలు, వస్త్రములు నేయు

వారు నుండిరి. పనివాండ్రు ప్రాతఃకాలమునుండి సాయం కాలమువఱకును పనులుచేయుచు నెలజీతములు పుచ్చుకొనుచుందురు.

ఈకర్మాగారముల నన్నిటిని దాటి యుభయులును దుర్గములోనికిఁ బోవసాగిరి. చాలసమ్మర్దమునుండి విస్మయకరము లగు ననేక హర్మ్యముల ప్రక్కనుండి చని, వారు తుదకు జగద్విఖ్యాతముచంద్రకాంతశిలానిర్మితమునగు'దివాన్ ఖానా' ప్రాసాదమును గాంచిరి. దాని లోపలిభాగము సువర్ణమండితమై, సూర్యకాంతిచే ధగధగలాడుచుండెను. ప్రాసాదమున వజ్రకాంచన ఖచితంబును సూర్యకాంతి ప్రతిఘాతియు నగు సింహాసనమున షాజహాన్ చక్రవర్తి యుపవేశించి యుండెను. ఆయన శాంతగంభీర ముఖ మింకను రోగచిహ్నాంకితము. దక్షిణపార్శ్వమునఁ బెద్దకుమారుఁడు దారా కూరుచుండెను. అతనిముఖ మంద మయినదే, కాని దుర్దమనీయదర్పము కానఁబడుచుండెను. ఎడమప్రక్క పౌత్రుఁడు సుల్తాన్ సులేమాన్ నిలువఁబడి యుండెను. అతని కిరువదియైదు సంవత్సరము లుండును; ఉన్నతకాయుఁడు, సుందరుఁడు. వెనుకవైపున కొజ్జాలు నెమిలియీకలచామరములు వీచుచుండిరి. నాలుగువైపులనున్న కటకటాలు వెండివి. వాని కీవల రాజులు, ఉమ్మరావులు, మన్సబ్ దారులు, దూతలు, సేనాపతులు, భారతవర్షమునందలి ప్రధానపురుషులును నుచిత వేషభూషలుదాల్చి కృతాంజలులై నేలవంకఁ జూచుచు నిలిచియుండిరి. ఎదుటి

సమతలమున జనులు నిండియుండిరి. ధనవంతుఁడు గాని, నిర్ధని గాని, ఉన్నతుఁడు గాని, నీచుఁడు గాని యెల్లరు నచటకేఁబోయి పాదుషాదర్శనము చేయుట కధికారము గలదు. ఆయపూర్వ ప్రాసాదమున 'ప్రపంచమున స్వర్గ మొంకు నేని; ఇది స్వర్గము, ఇది స్వర్గము, ఇది స్వర్గము' అని వ్రాసి యున్నది.

పాదుషా యెదుట మొదట అరబ్బీగుఱ్ఱములు, తరువాత గొప్ప యేనుఁగులు ప్రదర్శించిరి. మాతంగములు తుండము లెత్తి బాదుషాహాకు సలాము చేసి వెడలిపోయెను. పిమ్మట లేళ్ళు, వృషభములు, మహిషములు, ఖడ్గమృగములు, పులులు మొదలగు జంతువులు. పిదప వివిధ విహంగములు నొక్కటొక్కటిగాఁ జూపినారు. అనేకయుద్ధములు చూచిన భటులు, సామాన్యసైనికులు చక్రవర్తి సమ్ముఖముగాఁ జనిరి. వారల పదభరముచే భూమి వణఁకెను.

ప్రదర్శనముముగిసినతరువాతఁ బాదుషా దరఖాస్తులు గ్రహింపఁజొచ్చెను. కొద్దివారు గొప్పవారు నందఱు నేతెంచి భారతవర్ష రాజాధిరాజు సన్నిధిని దమతమకష్టములను విన్న వించుకొన సాగిరి. ఒకటిరెండు మాటలతోఁ జక్రవర్తి వారి వారికష్టములను దొలఁగించుచుండెను. పాదుషా యేవిషయమున నేమాట చెప్పినను ప్రధాన ఉమ్మరాహులు 'కేరామత్, కేరామత్!' అని ప్రభువును బ్రశంసించుచుండిరి.

రెండుగంటలలో రాజకార్యములు ముగిసెను. చక్రవర్తి తనకుమారునితోను, ముఖ్యులైన కొందఱు ఉమ్మరాహుల

తోను 'గోసల్ ఖానా'కు వెళ్ళెను. 'గోసల్ ఖానా' కాలుచేతులు కడుగుకొనుటకే నిర్మితము కాదు. అచ్చట ప్రధానామాత్యులతోఁ జక్రవర్తి రాజకార్యములను గూర్చి రహస్యాలోచనఁ జేయుచుండెను.

'గోసల్ ఖానా' కు వెనుక నెత్తయిన ప్రాకారము నరేంద్రునకుఁ గానఁబడెను. దానికావల నెన్నో మేడలు కలవు. గజపతి యిట్లనెను. 'యీగోడకు వెనుక రాజమందిరము, బేగములకు వేర్వేఱు మహాలులు నున్నవి. అవి చాల చిత్రముగా నుండు నని విన్నాను. ఒక్కొక బేగమునకు మేడ, నాలుగు వైపుల నుద్యానము, లతాగృహము నుండును. వేసవికాలమున పగలు గడపుటకు మృణ్మయములయినగృహములును, రాత్రి శయనించుటకు రాతికట్టడములును గలవు కాని, చక్రవర్తితప్ప నితరపురుషుల నేత్రము లాసౌందర్యము నెన్నఁడును జూడ లేవు; పురుషులపాదచిహ్న మా రమ్యస్థానములం దంకితము కాలేదు.'

కడచినరాత్రిసంగతులు తటాలున నరేంద్రనాథునకు జ్ఞప్తివచ్చెను. ప్రాకారములో నున్న బేగములమహాలుల రామణీయకము తన నేత్రములు వీక్షించినట్లును, తనపాద చిహ్నము లారమణీయప్రదేశములం దంకితమయినట్లును నతనికిఁ దోఁచెను. కాని, గత రాత్రిమునందలి విస్మయజనక వృత్తాంతముల నతఁడు గజపతిసింగునకుఁ బ్రకాశముచేయ లేదు; తానుగూడ సరిగా గ్రహింపలేదు.

ఇరువురు దుర్గము వెలువడి, వెలుపల నున్న విశాలాంగణమును జేరిరి. ఆప్రదేశ మప్పటికి జనాకీర్ణమై యుండెను. పెద్ద పెద్దవారు కొందఱు గుఱ్ఱములపై నిటునటు జనుచుండిరి. విలువ గల నూతన చిత్రవస్త్రముల ననేకులు విక్రయించుచుండిరి; వానిని కొనుటకుఁ గాని, చూచుటకుఁ గాని యనేకులు త్వరితముగా వచ్చుచుండిరి. కొందఱు సంగీతముపాడుచు నృత్యముచేయుచు ధనము యాచించుచుండిరి, కొంద ఱింద్రజాలము చూపుచుండిరి, కొందఱు పాముల నాడించుచుండిరి, కొందఱు సాముద్రికము చెప్పుచుండిరి. గణికుల మని చాలమంది యచటి కరుదెంచి యెండలోఁ దమ జీర్ణవస్త్రములఁ బఱచి కూరుచుండిరి. ప్రతివానికి నొకప్రక్క యంత్రము, రెండవప్రక్క పుస్తకము నుండెను. చాలమంది వారిసమీపమున గుమిగూడుచుండిరి. స్త్రీలుసైతము తెల్లబట్టలు గట్టుకొని వ్యగ్రభావముతో నేతెంచి పైసా యిచ్చి చేయి చూపించుకొనుచుండిరి.

వారినడుమ నరేంద్రుఁడు వింతజ్యోతిష్కుని గాంచెను. అతనికిఁ బదునాలుగు సంవత్సరములకంటె నెక్కువవయస్సుండదు. ముఖము కోమలము, మిక్కిలి గౌరవర్ణము, సూర్యతాపముచే నెఱ్ఱవారినది. జటాభారముచే కొంచెము మాటుపడియున్నను నేత్రములనుండి యగ్నిస్ఫులింగకాంతి వెలువడుచుండును. శరీర మాపాదమస్తకము కృష్ణవసనావృతము. చాల

విలువగల చందువాపెట్టె యతనిదగ్గఱ సూర్యకాంతిలో ధగధగలాడుచుండెను. బాలుఁడు తార్తారదేశ ముసల్మాను; ఎవరిదగ్గఱ డబ్బులు తీసికొనకుండఁగనే చేతులు చూచుచుండెను.

తార్తారబాలుని యాకారము నవలోకించి యనేకులాతనిసమీపమున కేగుచుండిరి. గజపతియు, నరేంద్రుఁడును వానికడ కరిగిరి. గజపతి మొదట చేయి చూపి 'నేఁటి సాయంకాలము మేము దక్షిణనగరము విడిచి యెక్కడకుఁ బోయెదమో చెప్పు' మనెను.

తార్తారుఁడు గజపతిముఖమును, వస్త్రములను బరిశీలించి చూచి 'జస్వంతసింగుమహారాజుగారు నర్మదాతీరమునకు వెళ్ళినారు; మీరు గూడ నచటికిఁ బోవుదురు' అని చెప్పెను.

గజపతి పెద్దపెట్టున నవ్వి, యిట్లనెను; జస్వంతసింగు మహారాజుగారు ఔరంగజేబుతో యుద్ధము చేయుటకు వెళ్ళిన సంగతి, ఆబాలవృద్ధ మందఱకును దెలియును. నావస్త్రములను జూచి నన్ను రాజపుత్రుఁడని యెల్లరు చెప్పఁగలరు. ఇంతకంటె నెక్కువ సంగతులు చెప్పఁగలవిద్య లేదా నీకు?

తన జాజ్జ్వల్యమాన నేత్రములను గజపతిపైఁ దీవ్రముగా నిల్పి, మస్తకమునాడించి,జటాభారము వెనుకకుఁద్రోసి బాలుఁడిట్లనెను: 'రాజపుత్రా! ఇంకను జెప్పఁగలను.ఔరంగజేబుచే రాజపుత్రులు నిహతు లగుదురు. వడిగల గుఱ్ఱమును వెదకి యుంచవలె నని మహారాజుగారితోఁ జెప్పుఁడు; కాని పోఁ బలాయనమున కవకాశముండదు. ఏడు వేల రాజపుత్రులలో

నేడు వందలమంది కూడఁ దక్కరు. రాజపుత్రా! ఆయుద్ధమున నీకు మరణము తప్పదు.'

గజపతిసింగు పరాక్రమవంతుఁడు, సాహసి; కాని తార్తార బాలుని ముఖభంగిని, గంభీరస్వరమును, ఉజ్జ్వలనేత్రములను గమనించి క్షణకాల మలికిపడెను; కోడ నే యదరిపాటు తోలఁగెను. అంత నతఁ డత్యంతగంభీరస్వరమున నిట్లు పలికెను. నష్టము లేదు; భగవంతుఁడు లలాటమున నదే లిఖించిన యెడల మహారాజుగారికోసము హృదయశోణితమును విడుచుటకంటె రాజపుత్రునకు, ఎక్కువకార్య మే ముందునో నే నెఱుఁగను.

అందఱు కొంచెముతడవు నిశ్శబ్దముగా నుండిరి. అనంతరము నరేంద్రుఁడు తనహస్తము చూపి 'నిజముగా నీకు సాముద్రికము తెలిసిన పక్షమునఁ గడచినరాత్రి నే నెచ్చట నుంటినో, యెవరిని జూచితినో చెప్పు, చూతము!' అనెను.

తార్తారుఁడు చాలసేపూరకుండి, నేలవంకఁ జూచి, తుదకు నెమ్మదిగా నరేంద్రునివైపునకుఁ దిరిగి 'యువన్! ముసల్మానీ నీప్రియురాలు. గడచిన రేయి నీ వామెను జూచి యుంటివి' అని చెప్పెను.

గజపతిసింగు నవ్వెను. అందఱు నవ్విరి.

నరేంద్రుఁడు నవ్వలేదు. తార్తారునిమాటల నాలకించి యులికిపడి, యాశ్చర్యముచే నూరకుండెను.

ఇంచుకతడవునకు తార్తారుఁడు నరేంద్రునొకప్రక్కకుఁ బిలిచి యిట్లు చెప్పెను: 'యువన్! దిల్లీనగరమున నున్న పక్షి

మున నీకుఁ జాల విపత్తు గలదు. ఈనగరమును విడిచి నేఁడే పరుగిడుము. నీస్నేహితునితో నర్మదాతీరమునకుఁ బొమ్ము. ఈపిచ్చివాఁడును నతో పోవుచున్నాఁడు; అంగీకరింతువేని నీవెంట వచ్చును. పిచ్చివాఁడు నీ కపకారము చేయఁడు; ఆపదలనుండి రక్షించుటకుఁ బ్రయత్నించును.'

నరేంద్రనాథుఁ డింకను నాశ్చర్యమొందెను. ఈబాలుఁ డెవ్వఁడు? ఈచిన్నవాఁడు భూతభవిష్యద్వర్తమానములను జెప్పఁగలఁడా? కడచినరాత్రికథ నతఁడు నిజముగా నెఱుఁగునా? పిచ్చివాఁడే యయినను నరేంద్రుని హితైషి; ఆపదల నుండి తప్పించినను దప్పించవచ్చును. ఆలోచించి, వానిని తన దగ్గఱ నుంచుకొనుటకు నరేంద్రుఁ డంగీకరించెను.

ఆనాఁటి సాయంసమయముననే గజపతి,నరేంద్రుఁడు, తార్తారబాలుఁడును దిల్లీనగరమును విడిచి నర్మదాభిముఖులై చనిరి.

౧౫

క్రీ. శ. ౧౬౫౮ వసంతకాలమున బ్రాచీనోజ్జయినీనగరము, సిప్రానదియు నూతనాకారము దాల్చినవి. చంద్రుఁ డుదయించెను; వెన్నెలలోఁ జూపుమేర సిప్రానదికి రెండువైపులను దెల్లని గుడారములు కానఁబడుచుండెను. ఒకవైపు జస్వంతసింగు, ఆయన సహయోధ కాసింఖాన్, సేనలు చంద్రకిరణోజ్జ్వలశిబిరశ్రేణియందు విశ్రమించుచుండెను; రెండవతీర

మునఁ బర్వతముమీఁద ఔరంగజేబు మురాదుల మొగలు సైన్యము విడిసియుండెను. నడును సిప్రానది కలకలనినాదముతో శిలాశయ్యమీఁదుగాఁ బ్రవహించుచు రాజపుత్రుల, మొగలుల యుద్ధసన్నాహము చూచి భీతినొందక నవ్వుచుఁ బోవుచున్న ట్లుండెను. భారతవర్షమునకు కటిబంధమునంటి వింధ్యపర్వత శ్రేణి వెన్నెలలో దూరముగాఁ గానవచ్చుచుండెను. మఱు నాఁడు భీషణయుద్ధము జరుగనున్నను నేఁడు లోకమంతయు సుషుప్తియందున్నది. రక్షకభటుల కేకలు నడుమ నడుమ వినఁ బడుచుండెను. సిప్రానదీతరంగమాలిక కలకలనినాదము చేయు చుండెను. దూరమున నక్కకూఁతలు నదీకూలమునను బర్వత శ్రేణియందును బ్రతిధ్వనితము లగుచుండెను.

నరేంద్రుఁడు గుడారమున నిద్రించుచుండెను. అయి నను నానావిధయుద్ధచింతలు స్వప్నరూపమున నాతని మాన సమున మెలఁగ జొచ్చెను. వానితోపాటు వెనుకటి వృత్తాం తములు స్ఫురించుచుండెను. సిప్రానదీకలకలధ్వని భాగీరథీ శబ్దమువలెఁ దోఁచెను. గంగాసమీపమున ఆరామపరివేష్టిత మైన యున్నత హార్మ్యము కానఁబడెను. తీరమున నిసుకలో బాలు రిరువు రాటలాడుచుండిరి. బాలిక నిలువఁబడి సంగీతము పాడుచున్న ట్లుండెను. ఆ యనురాగమూర్తి యెవ్వరు? ఆమె యెక్కడిది? భాగీరథీతీరమునందలి వనమున నామువ్వురు చీకటి వేళ నాటలాడుట సత్యమే; కాని, కాల నిష్ఠురగతిచే నాచిత్త రువు నశించిపోయినది!

స్వప్నము మార్పు నొందెను. భాగీరథీకల్లోలము లేదు. రమణీగీతధ్వని! ఈమె రమణియా? అచ్చరయా? పెద్ద మేడ లోకస్పూస్తంభములు బంగారు వెండి రంగుగా నున్నవి; నడుమ నప్సరస గానము చేయుచున్నది. అది విషాదగీతము. జులేఖా కన్నీరు విడుచుచు విషాదగీతము పాడుచున్నది. అదిగో, జులేఖా నిలువఁబడియున్నది. రత్నవిభూషిత కేశపాశముచే వదనమండల మించుక యావృతమైనది. అదిగో, తదీయ జాజ్వల్యమాన నయనద్వయమునుండి బాష్పకణము రాలుచున్నది!

స్వప్నము మాఱిపోయెను. జులేఖా కాదు, తార్తారబాలుఁడు గీతము పాడుచున్నాఁడు. ప్రేమించి, ప్రేమకు బదులెఱుఁగక, పిచ్చివాఁడై దేశదేశములు తిరుగుచున్నవాని గీతమిది. గానమువలన నరేంద్రునకు నిద్రాభంగ మాయెను. అంత నతఁడు పటకుటీరమునుండి యీవలకు వచ్చెను. లోకము శాంతముగా నుండెను. అర్ధరాత్రిమున వాయువు వీచుచుండెను. వెన్నెలలో నదీపర్వతశిబిరములు దృగ్గోచర మగుచుండెను. నిర్భాగ్యుఁడు తార్తారబాలుఁడు డేరావాకిటఁ గూరుచుండి, యుచ్చైస్స్వరమున పాడుచుండెను. సప్తస్వరమిళితమైన యాగానము వాయునీతమై, యాకాశము నధిరోహించి నల్వంకల వ్యాపించుచుండెను.

నరేంద్రుఁడు సాశ్రునయనుఁడై బాలుని కేలు పట్టుకొని కన్నీరు దుడుచుకొని యిట్లనెను: నీవు నిజముగాఁ బ్రేమ

చేతనే పిచ్చివాఁడ వయితివా? నీహృదయమున నేదయిన నిందుదుఃఖ మున్నదా? ఉన్నచో నాకుఁ జెప్పుము; నేను నీకష్టమును పంచుకొందును. మనస్సు విప్పి యున్నిసంగతులు నాయెదుటఁ జెప్పుము.'

బాలుఁడు తదేకదృష్టితో నరేంద్రునివైపు చూచు చుండెను; శరీరము కంపమొందఁజొచ్చెను. కొంచెము సేపటి కతఁడు హృదయోద్వేగము నడఁచుకొని, కరుణాస్వరమున మెల్లగా నిట్లు పలికెను: 'క్షమింపుఁడు, నేను వెఱ్ఱివాఁడను; నోటికి వచ్చిన దెల్ల పాడుచుందును.' నరేంద్రుఁ డనేక ప్రబోధ వాక్యముల నుపయోగించి, మాటిమాటి కాతని దుఃఖకారణ మును, అంతచిన్నతనముననే ఫకీరగుటకు హేతువును నడి గెను. బాలుఁడు తగిన సమాధానము చెప్పక 'నేను దివా నాను!' అని మాత్రము చెప్పెను.

తెల్లవాఱుజామున నరేంద్రుఁడు సైనిక వేషముధరించి, మిత్రుఁడు గజపతిసింగు డేరాకుఁ జని చూడఁగా నతఁడు సైనిక కార్యములు నిర్వర్తించుచుండెను. ఖడ్గమును, బల్లెమును దానే నూఱుచుండెను. శస్త్రములు వెండివలె తెళతళలాడుచున్నను గజపతి యింకను బదను పెట్టుచుండెను. చూచి నరేంద్రుఁ డచ్చెరువొంది, గజపతిశయ్యవైపు చూచెను. అతఁడు నిద్రింప లేదు, ఈపనియే చేయుచుండెను, ఆతని ముఖము పాలిపో యెను, కన్నులు నీలిమ దాల్చెను. ఏల? కొన్నిరోజులనుండి చూచుచున్న నరేంద్రుఁడు గజపతిమార్పులకు కొంచెము

కొంచెముగాఁ గారణము గ్రహింపఁగలిగెను. ఉన్మత్తాకార బాలుఁడు చేయి చూచినదిమొదలు తా నుజ్జయినీయుద్ధమున మృతి నొందునట్లు గజపతిసింగు దృఢముగా నమ్మెను; కడచిన రేయి నిద్రింపక మరణమునకు సంసిద్ధుఁ డగుచుండఁబోలును!

గజపతిసింగు భీరు వని తెలుపరాదు. రాజపుత్రు లందఱు సాహసులు; అందులోఁ దేజసింగుపుత్రుఁడు గజపతిసింగుకంటె నెక్కువసాహసి యగును. అయినను, మఱునాఁడు మరణము దృఢ మని తెలిసినచో ధైర్యశాలిహృదయము గూడ చింతారేఖాంకిత మగును. యోధులు యౌవనమదోన్మత్తులై జీవనసుఖమున మునిఁగియుండి, రణోత్సాహముచే ప్రఫుల్లహృదయులై, జయాశచే నూఱడిల్లి, మరణచింత మఱతురు. అట్టివారికి యుద్ధము సంతోషకరమే. అనేకులు మృతి నొందుచున్నారు. తాముకూడ నెప్పుడో యొకనాఁడు మరణింతురు; అందు విచార మేమి? కాని 'రేపు మరణము' అను పిడుగువంటిమాట లాకస్మికముగా హృదయమునఁ దగిలినచో నుత్సాహవికాసము లడుగంటును. ఆకాలపు జనుల కందఱకువలె గజపతిసింగునకు జ్యోతిషమున నమ్మకము మెండు. కావున, మరణము తప్ప దని గట్టిగా నమ్మి, రేయి నిద్రపోవక యతఁడు చావునకు సంసిద్ధుఁ డయ్యెను. ఆయుధములుబాగుచేయుట కాలయాపనమున కుపాయము. నరేంద్రుఁడు వచ్చినంతనే గజపతిసింగు లేచి, యాతనిచేయి పట్టుకొని, మందహాసముతో 'ఆయుధములు పరిశుభ్ర మయినవో లేదో యని చూచుచున్నాను' అని పలికెను.

'నిజముగా మీరు యుద్ధమునకు బోవుదురా? పిచ్చి ఫకీరుమాటలు జ్ఞాపకముచేసికొనుచున్నారా?'

ఎదుట యుద్ధము పెట్టుకొని రాజపుత్రుడు డెన్నడును వెనుదిరిగి చూడడు. 'నరేంద్రా! ఒక యుద్ధమున నేను జస్వంతసింగుమహారాజుగారి కుపకారము చేసినాను; వారు సంతోషించి నా కీముత్తెపుసరము నొసగినారు. అప్పటినుండి యన్నియుద్ధములలో నీ హారము వేసికొనుచున్నాను. నేటి యుద్ధమున నీవు కుశలముగా నుందువేని మహారాజుగారి కీహారము సమర్పించి, దేశములో నాశిసువు బిడ్డ ఉన్నారనియు, తల్లి లేదనియు, ప్రభువుగారు వారియెడ గృపాదృష్టిని ప్రసారింపవలెననియు విన్నవింపుము. బాలుడు రఘునాథుడు తండ్రివలెనే ప్రభువునానతిచొప్పున రణరంగమున జీవితము విడువ సమర్థుడగుగాక! ఇంతకంటె నెక్కువశుభము వాని తండ్రి తలపోయడనియును మనవిచేయుము!'

నరేంద్రుడు నిశ్శబ్దముగా నుండెను; అతని కంటి నుండి బాష్పకణము రాలెను. గజపతినేత్రములు ప్రకాశమానముగ, నిర్జలముగ నుండెను.

చప్పున భేరీభాంకారము వినవచ్చెను. ఔరంగజేబు సిప్రానదిని దాటుటకయి యత్నించుచుండెను. గజపతి యుద్ధవేషముదాల్చి, వెలుపలికివచ్చి, గుఱ్ఱమెక్కి శరవేగమున నదివైపునకు జనెను.

నరేంద్రుడును యుద్ధరంగాభిముఖముగా జనెను.

౧౬

ఔరంగ్ జేబు ముందే శిబిరముచేరి మురాదుకొరకు వేచియుండెను. మూడు రోజుల తరువాత మురాదు తనసేనతో ఔరంగజేబును గలసెను. ఈ రెండు మూడు రోజులలో జస్వంతసింగు ఔరంగజేబు నాక్రమించిన పక్షమున నాతఁడోడిపోయెడివాఁడే. ఔరంగ్ జేబునకుఁ గొలఁది సైన్యమే యుండె నని తెలియకుండుటచే జస్వంతసింగు యుద్ధము నుపక్రమింపలే దని కొందఱు చరిత్రకారు లనుచున్నారు; ఉదారహృదయుఁడగు రాజపుత్రసేనాని యీసంగతి నెఱిఁగియు, అల్పసేనతో యుద్ధముచేయుట ధర్మము కాదని యూరకున్నట్లు మఱికొందఱు చెప్పుదురు.

నేఁడు సోదరు లిరువురు కలసినారు. రేపు యుద్ధము జరుగు నని జయజయ ధ్వనితో శిబిరము నిండిపోయెను. పట్టువస్త్రాలంకృతము, దీపశ్రేణిమండితము నగు పటకుటీరమున సహోదరు లిద్దఱు భోజనమునకుఁ గూరుచుండిరి. లోకమున మోహింపఁజేయు నాటకత్తెలు పాటకత్తెలు నృత్యగీతాదులతోఁ బాదుషాకుమారులమానసములను సంతోషపెట్టుచుండిరి. మురాదుఫాల మున్నతము, వక్షము విశాలము, ఆకారము పరాక్రమ సూచకము, హృదయము నిష్కపటము. ఔరంగ్ జేబు లలాటము కుంచితము, దృష్టి తీక్ష్ణము, మానసము సర్వదా బహుచింతా సంకులము. అయినను 'ఔరంగ్ జేబు' ఎంతసరళముగా, ఎంతమనోహరముగా మందహాసము

చేయుచున్నాఁడు! ఎంత గౌరవపూర్వకముగా మురాదుతో సంభాషించుచున్నాఁడు! అన్నగారిని జూచి నానందము పట్టఁజాలకున్నట్లును, అన్నగారిపని సాధించుటకంటె లోకమున నతనికి వేఱొక యభిమతము గాని, సంతోషము గాని లేనట్లును గానఁబడుచుండెను.

భోజన మయ్యెను. సేవకులు ఫలములు, మద్యములు దెచ్చిరి. పాటకత్తెలు మరల గాన మారంభించిరి. శిబిర మానందముతో నిండెను. కేశములందలి మణులతోపాటు కటాక్షములు కలసిపోవసాగెను; లలితగానముతో మధుర హాసము కలయఁజొచ్చెను. మురాదు సంపూర్ణముగా ముగ్ధుఁడయ్యెను. తుదకు ఔరంగ్‌జేబుసంజ్ఞచే నట్టువకత్తెలు వెడలిపోయిరి.

సువర్ణపాత్రములో మద్యము పోసి ఔరంగ్‌జేబు మురాదుచేతి కిచ్చి 'శుశ్రూషచే మిమ్ము సంతుష్టిపఱచితిని; నేఁడు నాజీవితము సార్థకమయినది!' అని పలికెను.

'ఔరంగ్‌జేబ్! నీవంటి నిష్కపటసోదరుఁడు దొరకఁడు, కొంచెము మదిర తీసికొమ్ము.'

'క్షమింపుఁడు, నాజీవితమున సుఖవాంఛ లేదని మీ రెఱుఁగుదురు. మీవంటి పరాక్రమశాలిని పితృసింహాసనముపై సందర్శింపవలె నని కోరిక గలదు. ఇంతకంటె మఱే వాంఛయు లేదు. ఈయుద్దేశమును పైగంబరు సఫలముచేయునేని సంతుష్టచిత్తముతో ఫకీరు నై మక్కాకు యాత్ర

చేసెదను' అని పలికి ఔరంగ్‌జేబు మఱియొక మదిరాపాత్రి మాతని కిచ్చెను.

మఱి యెవరికోసము ప్రయత్నము చేయుదును? తైమూరుసింహాసనమునధిరోహించుటకుఁ దగినవాఁ డెవ్వఁడు? సుజా విలాసప్రియుఁడు, భీరువు. సుజా తైమూరుసింహాసనమును గలంకము చేయవలసినదేనా? దురభిమాని, మూర్ఖుఁడు, కాఫరు దారా తైమూరుసింహాసనమును గలంకము చేయవలసినదేనా? అంతకంటె హిందూస్థానము మరల కాఫరులకు వశమగుఁగాక! తైమూరు పేరు లేకుండఁ బోవుఁగాక! వీరి కోసము నేను యుద్ధము చేయను. ఎవరి సాహస మపారమో, యెవరి యశోరాశి భారతవర్షమున నిండియున్నదో, ఎవరు మొగలుసామ్రాజ్యమున కాధారులో, ఎవరు మొగలువంశ తిలకులో యట్టివారికై యుద్ధము చేయుదును. నేను మీసన్నిధిని మీకీర్తి నుగ్గడింపఁ గోరను; కాని, మిమ్ము విలోకించినప్పుడు యథార్థముగా మీవిశాలఫాలమున 'పాదుషాహ' యను నక్షరములు కానఁబడినట్లు తోఁచును. ఇట్టిమహావీరుని కార్యసాధనతత్పరుఁడ నగుటచే నాజీవితము ధన్యమైనది!' అని యుపన్యసించి ఔరంగ్‌జేబు మఱియొకసారి సువర్ణపాత్రమును మద్యముతో నింపెను.

'ఔరంగ్‌జేబ్! నీ వాక్యములకు నేను నిశ్చయముగా సంతుష్టుఁడ నైతిని. రేపు యుద్ధము జరుగును; సైన్యము లన్నియు సిద్ధముగా నున్నవా?'

'నేను మూఁడునాలుగురోజులనుండి యుద్ధసన్నద్ధుఁడనై యుంటిని. కాని, రణనీతియందు నే నింకను బరిపూర్ణతనొంద లేదు; ఒంటిగా సాహసము లేదు. మీరు సమీపమున నున్నచోఁ బర్వతపార్శ్వమున భద్రముగా నున్నట్లు తోఁచును, నా సాహసము ద్విగుణిత మగును!'

అలీకస్తోత్రపాఠములు సత్యమని నమ్మునంతటి యా త్మాభిమాని మురాదు; విశేషించి యిప్పుడు మదిరాసేవచే వివేకము గోల్పోయెను. ఔరంగ్‌జేబు పలికిన ప్రశంసావాక్యములకు సంతుష్టుఁడై 'మురాదు' ఇట్లనెను: 'భాయీ! నీవుకూడ క్రమముగా రణకోవిదుఁడ వగుదువు. ఇప్పుడు కొన్నిరోజులు నాపై నాధారపడియుండుము. నేనో, నేను లోకమున నెవరి మీఁదను నాధారపడను; నా పరాక్రమమును, ఈఖడ్గమును కేవలము నమ్మియుందును!' ఇట్లు పలికి యతఁడొఱనుండి కరవాలమును బెఱికెను. దీపకాంతిలో ఖడ్గము తళతళలాడెను. మరలఁ దరవారి కోశమున నుంచఁబోవఁగా నమిత మదిరాపానముచే దృష్టి వివశమై, కత్తి నేలపైఁ బడెను. ఔరంగ్‌జేబు నవ్వు నాఁపుకొని, యింకొక గిన్నెఁడు మద్య మొసఁగఁగా మురాదు దానిని నిశ్శేషముగాఁ ద్రాగివేసెను.

'భాయీ! ఇఁక సెలవు! యుద్ధక్షేత్రమునఁ దిరుగ మీ దర్శనము చేసెదను' అని ఔరంగ్‌జేబు చెప్పెను.

'పో! ఔరంగ్‌జేబు, పో! నాకు నీయెడ మిక్కిలి సంతోషము కలిగినది. రా, కౌఁగిలించుకొందును!' అని 'మురాదు'

ఆలింగనార్థము లేచెను; కాని, యధిక మద్యపాయియగుటచే నేలపైఁ బడెను.

అంతట ఔరంగ్‌జేబుముఖభంగి మార్పు నొందెను. అన్నగారిని మందహాసముతోఁజూచినవదనముమాఱిపోయెను. ముఖము గాంభీర్యము వహించెను. లలాటమున రెండుమూఁడు రేఖలు కానవచ్చెను. నిశ్శబ్దముగా నతఁడు డేరాలో నిటు నటు నడవఁ జొచ్చెను. నడుమ నడుమఁ దటాలున నెదుట నేదో పదార్థ మున్నట్లు స్థిరదృష్టితోఁ జూచుచు మరలఁ బచారు చేయుచుండెను. ఒక్కొకసారి ముఖమున దరహాసము కానఁబడును. ఇంకొకసారి కఠోర భావము లక్షిత మగును, లలాటము కుంచిత మగును.

ఒకసారి యతఁడు నిశ్చలముగా నుండి, స్థిరదృష్టితో నొక వంకఁ జూచుచు నస్ఫుటవాక్యతో ని ట్లనుకొనెను. 'ఉజ్జ్వలమణిమయ కిరీటము, మయూర సింహాసనము, ప్రశస్త భారతవర్షమును జనకుని దుర్బలహస్తమునుండి స్ఖలిత మగుచున్నవి. ఎవరు గ్రహింతురు? దారా! భద్రము! నీకు బల మున్నది. సాహస మున్నది. అయినను నేను దుర్బలహస్తముతోఁ గత్తి పట్టలేదు. త్రోవ విడువుము; కానిచో ఖడ్గ హస్తుఁడనై మార్గము పరిష్కరించెదను. నీ వాత్మాభిమానివి, గర్వివి. కాని నీ గుణములకంటె ఘోరతరదర్పము, దృఢతర వ్రతము దరహాసవదనమున దాఁగి యుండవచ్చును. మురాద్! నీవు పరాక్రమశాలివి! సింహాసనముపైఁ గూరుచుందువా?

సూకరము బురదలోవలె నీవు నేలమీఁద దొరలినా వేమి? అడవిపందికిని సీకువలె సాహస మున్నది. పసువా! రేపు యుద్ధ మనఁగా నేఁడు విలాస విహ్వాలుఁడనై యున్నా వేమి? అవసర మున్నంతకాలము నీద్వారా నాకార్యము నెఱవేర్చికొందును; తరువాత నిన్ను దూరముగాఁ దన్నివైచెదను. రేపు యుద్ధము; లలాట రేఖ యెట్లున్నదో! పితృహస్తమునుండి రాజదండము లాగివేయు నుద్యుక్తుఁడ నైతిని. భ్రాతృరక్తముతో దేశము ముంచివేయ సంసిద్ధుఁడ నయితిని. భీషణోద్యమ ప్రవృత్తుఁడ నయితిని. చాలదూరము ముందునకు వచ్చినాను. ఇఁక వెనుదిరుగుట కుపాయములేదు. ఖడ్గహస్తుఁడనై కంటకమయ మైన మార్గము పరిష్కరింతును;అవసరమయినచో ఉజ్జయిని మొదలు ఆగ్రావఱకును మార్గమును మానవరక్తరంజితము కావింతును. ఈఘోరప్రతిజ్ఞ చలింపదు. తైమూర్ తాతా! నీకిరీటముతో నాలలాటమును శోభిల్లఁ జేయుదును! కానిచో రేపు నా హృదయశోణితముతో సిప్రానదీజలము శోణ మయిపోవును!'

## ౧౨

క్రీ. శ. ౧౬౫౮ వైశాఖమాసమందు ఘోరయుద్ధము జరిగెను. మురాదు ఔరంగజేబుల సేనలు సిప్రానదిని దాఁట యత్నించుచుండెను. కాని, అది సులభకార్యము గాదు. సేన నదిని దాఁటుటకు ఔరంగ్జేబు చాల నిపుణమైన యేర్పాటు చేసెను. ఉన్నతస్థానమున ఫిరంగులు నెలకొల్పి, శత్రులరాక

నరికట్టుచు, తనసైన్యము నది దాటవలె నని యతఁ డాజ్ఞ యిచ్చెను. వైరుల పిరంగులుకూడ బారుతీరియుండెను; వారును ఔరంగ్‌జేబుభటులను నది దాటకుండఁ జేయుచుండిరి. తుములయుద్ధము చాలవఱకు జరుగసాగెను. జస్వంతసింగు మహాపరాక్రమము చూపి మొగలులమార్గమును నిరోధింపఁ జొచ్చెను; కాని, ఆయనతోడి సేనాపతి 'కాసింఖాన్' అట్టిప్రయత్నము చేయలేదు. ఆతఁ డౌరంగ్‌జేబు ధనమునకు వశుఁడై తన మందుగుండుసామానులు దాఁచుటచేఁ ద్వరలోనే యతని పిరంగులు నిశ్శబ్దము లయ్యె నని యీకాలపుఁ జరిత్రకారులు సందేహించుచున్నారు. ఈయవస్థలో శత్రులపిరంగులయెదుట యుద్ధము చేయుట జస్వంతసింగున కసాధ్య మయ్యెను; కాని, అతిలోకపరాక్రమము చూపి, వైరిమార్గము నిరోధించుచుండెను. అది పర్వతమయప్రదేశము. కావున, విరోధులు సులభముగా నదిని దాఁటలేకపోయిరి. అయినను, సాహసి యగు మురాదు కతిపయసేనాసహితుఁడై సకల నిరోధముల నతిక్రమించి, జయనినాదముతో రెండవ తీరము చేరెను. దానిం గాంచి, తక్కిన బలములుకూడ నావలియొడ్డు చేరెను. భీరువు కాసింఖాఁ వెంటనే తనసైన్యముతో పలాయనము చేసెను. కాఁబట్టి, జస్వంతసింగునకు మేరలేనిచిక్కు సంభవించెను. నల్వంకల రిపులు ముట్టడించినను నద్వితీయ పరాక్రమశాలి యగు రాజపుత్రసేనాపతి యుద్ధముచేయసాగును. ఆయన సేన క్రమక్రమముగా క్షీణింపఁ జొచ్చెను. ప్రియానుచరులు

నలువంకల నిహతు లగుచుండిరి. మొగలులజయధ్వాన ముతో భూమ్యాకాశములు వణఁక సాగెను. చాలసేపు యుద్ధము జరిగిన తరువాతఁ బరాజితుఁడై జస్వంతసింగు కేవల మయిమనందలనుంది భటులతో యుద్ధక్షేత్రము విడిచెను. ఏడు వేలమంది రాజపుత్రు లానాఁడా భయంకర రణభూమియందుఁ బ్రాణములు విడిచిరి.

## ౧౮

జస్వంతసింగు, సైనికులు మిగిలిన కొలఁదిమంది రాజస్థానాభిముఖులై చనఁ జొచ్చిరి. తనప్రియమిత్ర మగు గజపతిసింగుమరణమునకు మిగుల దుఃఖము నొందినను నరేంద్రుఁడనుదినము నూతనప్రదేశములను జూచుచుండుటచేత దుఃఖము తగ్గుచుండెను. కొన్నిదినములు ప్రయాణము చేసి తుదకు సైనికులు రాజస్థానముసఁ బ్రవేశించిరి. జస్వంతసింగు మార్వాడ్ దేశ ప్రభువు; అచ్చటకుఁ బోవలెనన్న మేవాడు రాజ్యముగుండ చనవలసి యుండును.

మేవాడురాజ్యమందలి యనేక దుర్గములను గాంచి నరేంద్రుఁ డచ్చెరు వొందెను. సామాన్యముగా దుర్గములు పర్వతశృంగములపై నుండుటచేఁ జప్పున పట్టుకొనుట శత్రుల కసాధ్యముగ నుండెను. దుర్గములు కిరీటములవలె రమణీయముగా నుండెను. ఆదుర్గములన్నిటి నధిరోహించుటకు మార్గములు లేవు. ఒకవైపున సోపానములవంటి బాట యుండును.

దానివెంట జనులు రాకపోకలు చేయుచుందురు. యుద్ధకాలమున దుర్గములోఁ దినుబండములు సంచితము లగును. ఉన్న ద్వారము నొకదానిని మూయుదురు. పిమ్మట శాత్రవు లేమి చేసినను దుర్గనివాసులు నిశ్చింతముగా నుండఁగలరు. వైరులు దుర్గము నధిరోహింప నుపక్రమించినప్పుడు పైఁదినుండి తూల ప్రోవులు జాఱును. అనేకులు నశింతురు.

ఇట్టి దుర్గములను గాంచుచు సైనికులు చివరి కొకనాఁటి సాయంకాలమునకు, చిత్తోడుదుర్గమును సమీపించిరి. భటులు భోజనాదులు ముగించి తమతమ డేరాలలో విశ్రాంతి తీసికొను చుండిరి. నరేంద్రుఁడు కొద్దిమంది రాజపుత్రులతోఁ జిత్తోడు పర్వతము నెక్కి, దానిమీఁదిదుర్గమున విచరింపఁజొచ్చెను. ఆశ్చర్యముతో నతఁడు కుంభరాణా కట్టించిన చక్కని స్తంభమును, పద్మినీదేవి ప్రాసాద సరోవరములను, రాజపుత్రులు ఖడ్గహస్తులై మాటిమాటికిఁ బ్రాణములు విడిచిన సింహద్వారమును, చిత్తోడులోని రాజపుత్రాంగనలు చితులెక్కి మానము గులమును రక్షించిన గుహను విలోకించెను.

వారియెదుట వృద్ధుఁడు చప్పున నిలిచెను. రాజపుత్రులలోఁ గొందఱాయన నానవాలు పట్టిరి. అతఁడు చిత్తోడులోని వృద్ధచారణుఁడు. పూర్వకాలమున రాజస్థానమందుఁ జారణదేవులు రాజుల యశోగీతములు పాడి, రాజపురుషులకును నాగరకులకును సంతోషము కలిగించెడివారు. రాజస్థానమున నిప్పటికిని సంధ్యాసమయమున జనులు గుమి గూడి, చారణ

గీతములు వినుటకు వేడుకపడుచుందురు. పూర్వరాజుల యశో గీతముల నాకర్ణింప వారల నేత్రములు నీరుబాష్పములతో నిండిపోవును.

౧౯

ఆ చారణుఁడు శైశవమందు మేవాడ్ దేశప్రభువు ప్రతాపసింహుని యాశ్రితుఁడు. చిన్నతనమునుండి యతఁడు ప్రతాపునితోఁ బర్వతగుహాలయందు నుపత్యకలయందును నివసించుచు నృపాలుని కీర్తిని కవితారూపమునఁ బాడుచుండె నని నరేంద్రుఁడు మఱునాఁటి యుదయమునఁ దెలిసికొనెను.

దిల్లీచక్రవర్తితో ననేక యుద్ధములు చేసి తుదకుఁ బ్రతాపుఁడు మృతినొందునాఁటికి చారణున కిరువది సంవత్సరము లుండెను. ఇప్పటి కది యఱువది యేండ్లనాఁటి సంగతి. కావునఁ, జారణుని వయస్సు రమారమి యెనుబది సంవత్సరము లుండును. అయినను, అతఁ డింకను జితోడుపర్వతమున రాత్రులందు సంచరించును. దైవబలముచేఁ జారణుఁడు బలిష్ఠుఁ డని యెల్లరు పలుకుచుందురు.

మరణ సమయమునఁ బ్రతాపుఁడు తనకుమారుఁడగు అమరసింగును మంచముకడకు రప్పించి తనవలె 'అమరసింగు' గూడ మొగలులతో యుద్ధము నిరంతరము చేయునట్లును, మొగలులకు లోఁబడకుండునట్లును శపథము చేయించుకొనెను. తండ్రియానతిని పరిపాలించుటకయి అమరసింగు అక్బరుతోను,

తత్పుత్రుఁడు జహాంగీరుతోను యుద్ధము చేయుచు జనకునివలెఁ బరాక్రమము చూపెను. ఈ యుద్ధము లన్నిటను జారణుఁడు సర్వదా రాణా వెంట నుండి, అన్ని వేళలందును బ్రతాపసింగును దృష్టాంతముగాఁ జెప్పుచు నాతని కుత్సాహము కలిగించుచుండెను. కాని, యీ యుత్సాహము విఫలమయ్యెను. అమరసింగు తుదకు జహాంగీరునకు లోఁబడెను. అయినను నది పేరునకు మాత్ర మనవచ్చును. అమరసింగే మేవాడ్ దేశపు రాణా. ఆయన ఢిల్లీపాదుషాకుఁ బంపు కప్పముకంటె రెండురెట్లు పాదుషా యాయనకు బహుమానరూపమునఁ బంపుచుండెను. అమరసింగు ఢిల్లీనగరమునకుఁ బోవ నవసరము లేదు. ఆయన కుమారుఁడు కరుణసింగును పౌత్రుఁడు జగత్సింగును, జహాంగీరు తన్మహిషి నూర్ జహాన్ సాదరముగా నాహ్వానించుచు మణి మౌక్తికములఁ బారితోషికముగా నొసఁగుచుండును. అమర సింగును జారణుఁడు రాణాగా నెంచక, క్రోధాభిమానములచేఁ గటూక్తులుపలికి లేచిపోయెను. అమరసింగు లజ్జనొంది, తండ్రికిఁ జేసిన వాగ్దానము జప్తికిఁ దెచ్చుకొని సింహాసనము విడిచి పెట్టెను. అనంతరము కరుణసింగు రాణా యయ్యెను.

అక్బరు చిత్తోడు ధ్వంసము చేసినతరువాత 'ఉదేపూర్' అను పేర నీచక్కని రాజధాని నిర్మించినారు. కాని, ధ్వంస మయిన చిత్తోడునందే చారణుఁడు నివసింపఁ జొచ్చెను. ఒకటి రెండు రోజులకుఁ బైనుండి దిగి, క్రిందిగ్రామవాస్తవ్యులిచ్చిన వానిని భుజించి యతఁడు మరల దుర్గమున కేగును. ఇవ్విధ

ముగా నిర్జనస్థానమున నుండుటచే నాతఁడున్మత్తుఁడయ్యెను. పర్వతగహ్వర మాతని నివాసస్థాన మాయెను. మేఘము గర్జించినప్పుడు, ఝంఝామారుతముచే నరణ్యము కల్లోలమయినప్పుడును నాతనికి మహోల్లాసము కలుగును. ప్రతాపసింగు అక్బరుతో యుద్ధముచేయుచున్నట్లు లాతఁడు కలవరించును.

రాజపుత్రసైనికులు కొన్నిరోజులు ప్రయాణము చేసి, ఆరావళీపర్వతములను దాఁటిరి. ఒకసారి భటులు పర్వతపాదములవెంటఁ బోవుచుండిరి. ఇరుప్రక్కల పర్వతరాశి తలయెత్తుకొని యుండ శిఖరములు నభోమార్గమునుండి క్రిందకుఁ జూచుచున్నట్లుండెను. ఆశృంగములనుండి యనేక నిర్ఝరములు దూరమునకు వెండిరేకులవలెఁ గానఁబడుచు, సూర్యరశ్మిలో మిలమిలలాడుచు అంధకారమున నదృశ్యమగుచుండెను. సెలయేటినీరు క్రిందఁబడి కొన్నిచోటుల నదీరూపమునఁ బ్రవహించుచు, మఱికొన్నిప్రదేశములందు నల్వంకలఁ బర్వతము లుండుటచే నిర్మలసరోవరమువలెఁ గానిపించుచుండెను. సలిలము పరిశుభ్రమై నిశ్చలముగా నుండ, నాలుగుదిక్కులనున్న పర్వతశిఖరములఛాయ దానిపై నిద్రించుచున్నట్లుండెను.

వేఱొకసారి సైనికులు రాత్రివేళ కొండత్రోవను బోవుచుండిరి. రెండుప్రక్కల పర్వతశిఖరలములు చంద్రకిరణప్రసారముచేఁ గాంతివంతములై యుండెను. అర్ధరాత్రమున నవి ప్రశాంతములై సకలప్రాపంచికవృత్తులు నణఁచి నిర్మలాంబరము దెస ముఖ మెత్తి ధ్యానమగ్నులై యున్న యోగులవలె

నుండెను. ఆప్రశాంతవిభావరియందు రెండువైపులఁ బర్వతము లపై నట్టిశోభను విలోకించుచు నడుమనున్న మార్గమువెంట సుభటులు చనుచుండిరి.

కొండక్రింద భూములందును, కందరములందును, నాదిమ నివాసులగు భిల్లులు నివసించుచుండిరి. భారతవర్షమందలి యితర ప్రదేశములందువలెనే రాజస్థానమందును సేద్యమున కుపయోగించు భూమిని ఖడ్గహస్తుల నార్యులు వశముచేసి కొనఁగా, ఆదిమనివాసులగు భిల్లులు పర్వతగహ్వరముల నివసించుచున్నారు. వారు రాజస్థానప్రభువులకు లోఁబడి యుండలేదు. అయినను మొగలులతో యుద్ధకాలమున ధను ర్బాణములు దాల్చి, పర్వతములపై కెక్కి రాజపుత్రులకుఁ జాలఁ దోడ్పడుచుండిరి.

పర్వతములుదాఁటి జస్వంతసింగు శీఘ్రముగాఁ దన దేశ మునఁ బ్రవేశించెను. మేవాడు, మార్వాడ్ దేశములం జూడఁ బ్రకృతిలీలాకర్మమున దేశములకు భేద మొదవినట్లు కానఁ బడును. మేవాడు దేశమునందుఁ బర్వతములు, పెద్దవృక్షములు, తీఁగెలు కలవు. మార్వాడు విపరీతముగా నుండును. పర్వత ములు లేవు. అశ్వత్థ వట ప్రభృతి బృహద్వృక్షములు లేవు. ఉర్వర లేదు. జీవనదులు లేవు. పర్వతపరివేష్టితజలాశయ ములు లేవు. కేవలము మరుభూమియందు వాలుకారాశి వ్యాపించి యున్నది. కొన్నికొన్ని తావులందు ముండ్లచెట్లు చిన్నచిన్నవి కానఁబడును. ఈమరుభూమిమీఁదుగా సైనికు

లేగుసమయమున మేవాడు దేశభటులు మార్వాడుభటులతోఁ బరిహాసముగా నిట్లనిరి:

ఆకరా ఝుఁకప ఘోకరాబార్
బాజరారా రోటీ భోరరాదార్
దేఖో హో రాజా, తేరీ మారవార్ !

'మాజన్మభూమి సస్యాఢ్య కాదు; కాని, వీరసువు మాత్రి మగుట నిశ్చయము' అని మార్వాడ్ యోధులు సగర్వముగా నుత్తర మిచ్చిరి. మార్వాడరాజపుత్రులు కొంచెము మోటువారు.

ఇవ్విధమున యోధులు కొన్నిదినములు ప్రయాణము చేసి రాజధాని యగు జోధపూరును సమీపించి శిబిరములు సంస్థాపించిరి. అప్పుడు నరేంద్రుఁడు గజపతిసింగుమాటలు స్మరించి, రాజును సందర్శింప నరిగెను. జస్వంతసింగుమహా రాజు పటకుటీరమున విషణ్ణవదనముతో నొంటరిగాఁ గూరు చుండి యుండెను. నరేంద్రుఁ డాయనసన్నిధి కేగెను.

ప్రభువునానతిం బడసి నరేంద్రుఁ డిట్లనెను: 'మహా రాజా! సిప్రానదీతీరమునఁ దమ యనుచరుఁ డొకఁడు నిహతుఁ డయినాఁడు. పూర్వ మొకసారి దేవరవా రాయనయెడఁ బ్రిసన్నులై, ఈ ముక్తాహారము నొసంగినారు. ఆయన తమ యనుగ్రహమునకు నవమానము కలిగింపలేదు. బహిరంగ యుద్ధమున మృతినొందెను. ఈముక్తాహారమును దమకు సమ ర్పించవలె నని మరణమునకు ముందు నా కాయన యాన తిచ్చెను.'

రాజా దండను జాలసేపు చూచి, నిట్టూర్పు విడిచి, యిట్లు పలికెను: 'హా గజపతీ! మార్వాడుభూమియందు నీకంటెఁ బరాక్రమవంతుఁడు కానరాఁడు. నీతండ్రి తేజసింగు నెఱుఁగుదును. సూర్యమహల్ దుర్గమున నాతనియాతిథ్యము గ్రహించితిని. గజపతీ! నా బలవంతముమీఁదనే మార్వాడు భూమికి వచ్చినావు. అనేకపర్యాయములు యుద్ధమునందు నీతండ్రివలెనే పరాక్రమము చూపినావు. ఒకసారి యుద్ధములో నాప్రాణములు రక్షించితివి; అందుకే నీకు నీముత్తెపుదండ నిచ్చినాను. ఇప్పుడు నీయసువులు నాకై విడిచి నా దండను నాకు మరల నిచ్చితివి. వత్సా! నదీజల మొకసారి ప్రవహించి మరల వెనుకకు రాదు.' నీస్నేహితునిమౌక్తికహారమును నీవే ధరింపుము. యుద్ధమునం దాతనిపరాక్రమము నీకు జ్ఞప్తియుండును.

నరేంద్రుఁడు రాజునభివందించి, హారమును శిరస్సునఁ దాల్చి యిట్లు విన్నవించెను: 'మహారాజా! విన్నప మున్నది. గజపతిసింగునకు బిడ్డలు శిశువు లున్నారు; వారికిఁ దల్లి లేదు. మహారాజుగా రనుగ్రహించి శిశువులయెడఁ గృపాదృష్టి ననుగ్రహింతురు గాక యనియు, కాలక్రమమున రఘునాథుఁడు రాజాజ్ఞానుసారముగాఁ దనతండ్రివలె సంగ్రామమున జీవనమును విడువ సమర్థుఁ డగుఁ గాక యనియు, ఇంతకంటెఁ దనకు మఱి యేకోరిక లే దనియు గజపతిసింగు దేవరవారికి విన్నవింపుమని నాతోఁ జెప్పినాఁడు.'

జాలి గొలుపు నీవాక్కు లాలించునప్పటికి నేత్రముల నీరు గ్రమ్మ రా జిట్లనెను: 'వత్సా! చాలు. ఆశిశువులను

నాబిడ్డలవలెఁ జూచెదను. జోధపురమహారాజ్ఞి జనని యగును. నాయాగమన వృత్తాంతము నింతవఱకు రాణిగారికిఁ దెలుప లేదు. మనదూతలతో నీవు గూడ నరిగి రాణిగారికి గజపతి విన్నపముఁ దెలుపుము; ఆతని శిశువులనుగూర్చి రెండు మాటలు చెప్పుము.'

రాజునానతిచొప్పున నరేంద్రుఁడు కొందఱుదూతలతో జోధపురదుర్గమున కరిగెను. ఒకసారి యాదుర్గమును జూచిన వారలు దానిని విస్మరింపఁజాలరు. నల్వంకలఁ గేవలము వాలుకారాశి, మరుభూమి, నడుమ నున్నతపర్వతము. ఆమహీధరశిఖరమున జోధపురదుర్గము వీరునికిరీటమువలెఁ బ్రకాశించుచుండెను. పర్వతతలమున నగరము వ్యాపించి యుండెను. నగరమున రెండు సరస్సులు: తూర్పున 'రాణి తలాబ్', దక్షిణమున 'గులాబ్ సాగర్' కలవు. స్త్రీలు హ్రదమునుండి జలము గొనిపోవుచుండిరి. తటాక పార్శ్వముననున్న యుద్యానమున నందలకొలఁది దానిమ్మకొమ్మలమీఁద ఫలములు వ్రేలాడుచుండెను. నాగరకులు స్వచ్ఛందముగా, ఆ యారామమున విహరించుచుండిరి. నరేంద్రుఁడు పర్వతము నెక్కి, రాజప్రాసాదమును జేరెను. రాణియానతి నొంది నరేంద్రుఁడు, దూతలును లోపలఁ బ్రవేశించిరి.

తెల్లరాతితో నిర్మించిన మందిరములో సింహాసనమున రాణి యుపవేశించి యుండెను. నల్వంకల పరిచారికలు పరివేష్టించి, చామరములు వేయుచుండిరి. రాణిముఖము మేలి

ముసుఁగున కొంచె మాచ్ఛాదితమయి యున్నను, అగ్ని సంకాశమగు నేత్రజ్యోతి డాఁగియుండలేదు. ఆమె నిబిడకృష్ణ కేశరాశిలో రత్నములు ధగధగలాడుచుండెను.

దూత నమస్కారము చేసి, మెల్ల మెల్లన సభయముగా యావద్వృత్తాంతము నామెకు విన్నవించెను. పిడుగుపడుటకు ముందు నభోమండలమువలె రాణి యించుకసేపు నిశ్శబ్దముగా నుండి పిమ్మట నవకుంఠనము తొలఁగించి, ఆరక్తనేత్రములతో దూతదెస దృష్టి ప్రసారించి 'నీచా! నీవలివరక్తమును, ఆసిస్రా నదింగోఁ గలుపలేకపోతివా! నాయెదుటనుండి దూరముగాఁ బో! తాను యుద్ధక్షేత్రమునుండి పలాయనము చేసి కళంకము దెచ్చికొనుటచే, ఈపవిత్రదుర్గమునఁ బ్రవేశింప వీలులేదని నీ నీచప్రభువుంకోఁ జెప్పు!' అని పలికి మూర్ఛిల్లెను.

పరిచారికలు చాల యత్నము చేసి, రాణికిఁ దెలివిఁ దెప్పించిరి. అంత నామె కోపముచే నొడలు మఱచి యిట్లు పలుకసాగెను: 'ఏమంటివి? ఆయన యుద్ధక్షేత్రమునుండి పలాయనము చేసె ననియా? పరుగెత్తువాఁడు క్షత్రియుఁడు కాఁడు! నాభర్త కాఁడు! ఈ నేత్రము లింక జస్వంతసింగును జూడవు! నేను మేవాడ్ రాణా కుమారితను. ప్రతాపసింహుని వంశమునుండి వివాహమాడినవాఁడు భీరు వెట్లయ్యెను? యుద్ధమున విజయము నొందలేనిచో నెందుకు మృతి నొందలేదు? దూత లింకను నిలిచి యున్నారా? నాసైనికు లెచట నున్నారు? దూతలను బర్వతముమీఁదినుండి క్రిందకుఁ బడద్రోయుఁడు! దుర్గద్వారము మూయుఁడు!'

రాణిశరీర మంతయు వణఁకుచుండెను. శోకమునఁ గంఠము రుద్ధ మయ్యెను. ముఖమండలము శోణ మయ్యెను. నరేంద్రుఁ డంతట ముందునకుఁ జని మెల్లమెల్లన గంభీర స్వరముతో నిట్లనెను: 'మహారాజ్ఞీ! మామరణమున కాజ్ఞ యిచ్చితిరి. మేము మరణమునకు భయపడము. జస్వంతసింగు మహారాజుగారిని మాత్రము నీచుఁ డననలదు. వారు యుద్ధము చేయుచుండ నే నీకన్నులలోఁ జూచినాను. నేను జీవించి యున్నంతకాల మట్టి భయంకరయుద్ధము నెన్నఁడు చూడను. అట్టి యద్వితీయపరాక్రమము చూడను!'

రాణి యించుక నిశ్చలదృష్టితో నరేంద్రునివంకఁ జూచి యిట్లనెను: 'నీవు విదేశీయుఁడవు. నీప్రాణములకు భయము లేదు. నిజమైన వృత్తాంతము విస్తరించి చెప్పుము.'

నరేంద్రుఁడు యుద్ధమును విపులముగా వర్ణించెను. రాజపుత్రసైనికుల పరాక్రమము, మహారాజుగారి విక్రమమును దాను జూచినరీతిని నభివర్ణించి, తుద కతఁ డిట్లు విన్నవించెను: 'మేఘరాశివలె మొగల్‌సేన వచ్చి యాక్రమించినప్పుడు, ధూళిధూమములచే యుద్ధక్షేత్ర మంధీభూతమయినపుడు, భీరువు కాసింఖాఁ పలాయనము చేసినపుడు మహారాజుగారు రాజపుత్రోచితసాహసము నవలంబించి యుద్ధము చేసిరి. నాల్గు దెసల రాజపుత్రరక్తముతోఁ బర్వతపాదము, సిప్రానదియు రంజితము లయ్యెను. ఔరంగ్‌జేబు, మురాదును వేలకొలఁది మొగలులతో మహారాజుగారిపైఁ బడిరి. వారు విక్రమముతోఁ

బోరిరి. వారిపాదసన్నిధిని వందలకొలఁది రాజపుత్రులు నిహతు లగుచుండిరి. సంఖ్య క్షీణించుచుండెను. మొగలుల జయ నినాదముతో భూమ్యాకాశములు నణఁకఁజొచ్చెను. కాని, మహారాజుగారిహృదయము చలింపలేదు. ఎనిమిదివేల రాజ పుత్రులలో నెనిమిదివందలమంది జీవించిరో లేదో! అయినను మహారాజుగారు యుద్ధభూమి విడువలేదు. వారిపరాక్రమము నకు ఘోరకల్లోలవతి యగు సిప్రానదియును, భయంకరమైన వింధ్యపర్వతమును సాక్షులు!'

ఈవాక్యముల నాలకింప రాణినేత్రముల జలజల నీరు గాఱెను. ఆమె యిట్లనెను: 'భగవన్! నీకు నమస్కారము! నాభర్త రాజపుత్రనామము నిలిపెను. విదేశీయదూతా! ఈ మాటలచే నాహృదయము శాంతించినది. అటుతరువాత నే మయ్యెనో చెప్పుము.'

'మానవుల కేది సాధ్యమో, రాజపుత్రుల కేది సాధ్య మో జస్వంతసింగుమహారాజుగారది యంతయు నెఱవేర్చి నారు. కేవల మయిదువందల సైనికులు మిగిలి యున్నప్పుడు వారు రణరంగము విడిచిరి.'

'పలాయనము చేసినారా! హా! విధాతా! రాణా జామాత పలాయనము చేసెనా?' అని వక్షముపై గాఢముగా మోఁదుకొని రాణి క్రిమ్మఱి మూర్ఛిల్లెను.

తోడనే పరిచారికలు రాణిముఖమున జలసేచనము చేసిరి. త్వరలోనే తెప్పిరిలి యామె కరుణాస్వరముతో 'పరి

చారికలారా! చితిఁ బేర్పుఁడు. నాభర్త యుద్ధక్షేత్రమున మృతినొందెను. ఆయన నాకోసము స్వర్గమున నిరీక్షించుచుండును. నేనచ్చటకుఁ బోయెదను. ఆయనవెంట వచ్చినవాఁడు ధూర్తుఁడు. దూతా! నీసహచరులతో శీఘ్రముగా మార్వాడ్ దేశము విడిచి పొమ్ము; కానిచో, మరణదండనము సంభవించును!' అని యాక్రోశించెను.

నరేంద్రుఁడు, కోడివారలును దుర్గమునుండి నిష్క్రమించిరి. రాణియానతిచొప్పున దుర్గద్వారము రుద్ధమయ్యెను. దూతలు బయటకుఁజనునప్పుడు జోధపురమంత్రి యొకయుత్తరమిచ్చి యిట్లనెను: 'మహారాజుగారిని మీరు చూడనలసిన పని లేదు. ఈపత్రికను దీసికొని శీఘ్రముగా మేవాడు రాజధానియగు ఉదేపూరునకుఁ జని రాణా రాజసింగుగారి కొసఁగుఁడు. వారు మీ కాశ్రయ మొసఁగుదురు. మామహారాజ్ఞిగారి యానతి యలంఘనీయము. మీరు మార్వాడ్ దేశముననుండుటకు వీలు లేదు. రాణిగారితల్లి కీపత్రికయందినతోడనే యామె జోధపురమునకు వచ్చును. తల్లితప్పఁ గూఁతు నూఱడించువారు లేరు.'

జోధపురరాజ్ఞి యెనిమిది తొమ్మిదిరోజు లున్మత్తప్రాయయై యుండె నని చరిత్రమున లిఖించి యున్నది. తరువాత ఉదేపూరునుండి యామెతల్లి వచ్చి పుత్రికను శాంతపఱచెను. అప్పుడు రాణి భర్తను సందర్శింప సమ్మతించెను. మరల సైన్యము సమకూర్చుకొని జస్వంతసింగు ఔరంగ్జేబుతోఁ ద్వరలో యుద్ధము చేయునట్లు స్థిర మయ్యెను.

౨౦

మేవాడు దేశమునకు 'చితోడు' పూర్వము రాజధాని. ప్రస్తుతము 'ఉదేపూరు'. మార్వాడ వాలుకారాశినుండియు, మరుభూమినుండియు పర్వతసంకులమైన మేవాడదేశమునకుఁ దిరుగ వచ్చి నరేంద్రనాథుఁడు మిగుల నానంద మనుభవించెను. క్రమ్మఱ నతఁ డారావళ్యున్నతశిఖరము నెక్కెను. పర్వతనదీప్రస్రవణవేగమును సందర్శించెను. శాంతనిశ్చలగిరి హారిదశోభ నాలోకించెను. నరేంద్రునిహృదయమున సంతోషోదయ మయ్యెను. కొన్నిరోజు లివ్విధమున సంచరించుచు నతఁడు, దూతలును ఉదేపూరు చేరిరి.

అట్టి రమణీయప్రదేశమున నట్టి సుందరనగరమును నరేంద్రుఁ డెన్నఁడును జూచినట్లు తోఁచలేదు. క్రింద శాంత నిశ్చలసరోవరమును, నిర్మలాకాశమును, నలుదిక్కుల పర్వత శ్రేణీప్రతిబింబమును సయత్నముగా వక్షమునఁ దాల్చుచుండెను. నాలుగువైపులఁ జక్కని మహీధరములపై మహీధరములు బలసియుండెను. ఇట్టిచక్కని యున్నతప్రాకారములోఁ బ్రకృతిదేవి యాసుఖప్రదేశమును సంరక్షించుచున్నట్లుండెను. మదువు సమీపమున గిరిశ్రేణిమీఁదఁ బ్రాసాదము, ధవళ సౌధపంక్తులును మందహాసవదనముతో నిర్మలదర్పణమున నిజప్రతిబింబమును విలోకించుచున్న ట్లుండెను.

సూర్యద్వారముగుండ జోధపురదూతలు నగరములోఁ బ్రవేశించిరి. జోధపురమునకు, ఉదేపురమునకు నప్పుడు

బంధుత్వ ముండుటచే దూతలకు స్వాగతమునకై నాగరకులు జయధ్వనులు చేయఁజొచ్చిరి. పరిష్కృత మార్గము వెంట నరేంద్రుఁడు, నతనిసహచరులును ప్రాసాదాభిముఖముగాఁ జనుచుండిరి. చారణులు మంగళగీతములు పాడుచుండిరి. కలశము లెత్తుకొని యిరువైపుల స్త్రీలు నిలిచియుండి యానంద గీతములు పాడుచు జోధపురదూతలను గౌరవించిరి. ఒకటి రెండు నాణెములచొప్పున నందఱకు బహుమానము లిచ్చుచు దూతలు సంతుష్టి కలిగించుచుండిరి.

పిమ్మట వారు ప్రాసాదమును బ్రాపించి, రాణాయానతి చొప్పున లోపలఁ బ్రవేశించిరి. శ్వేత పాషాణ సోపానముల నారోహించి వారు సూర్యమహాలులోని కేగిరి. రాణా, ఆ మహాలులోనే విదేశీయ దూతలకు దర్శన మిచ్చును. ప్రభువు వంశమున కాదిపురుషుఁడగు సూర్యునివిగ్రహము చెక్కించి యందొకవైపున నుంచుటచేతనే దానికి 'సూర్యమహాల్' అను పేరు వచ్చెను.

రక్తవర్ణవస్త్రమండితము, బహుమూల్యరత్నఖచితము నగు సింహాసనముపై బప్పారావువంశావతంసుఁడగు మహారాణా రాజసింగు, ఉపవేశించియుండెను. నాల్గువైపుల స్వర్ణ ఖచిత రజత స్తంభములమీఁది చాందినీయందు మణిమౌక్తికములు ప్రకాశించుచుండెను. కొంచెము దూరముగాఁ బారిషదులు కూరుచుండి యుండిరి. సుధర్మ సదృశ మగు రాజ సభయందుఁ జారణులు స్తుతిపాఠములతో రాణాను బ్రశంసించుచుండిరి. ఇయ్యవసరమున జోధపురదూత లేతెంచిరి.

వినయముతో దూతలు సమస్త వృత్తాంతమును రాణాకు విన్నవించిరి. జస్వంతసింగు పరాజయము, దేశమునకు మరలి వచ్చుట, రాణికోపము, రాజుదుర్దశ—ఈవిషయముల నన్నిటిని దెలిపి, జోధపురమంత్రి పంపిన పత్రికను రాణాకు సమర్పించిరి. రాణా 'రాజసింగు' అన్నిసంగతులు తెలిసికొని, జస్వంతసింగుకయి విచారము చూపి, దూతలకు సెలవొసంగెను. ఉదేపూరులో నుండుటకు వారికిఁ దగినచోటు నేర్పాటుచేయవలెనని మంత్రి కాజ్ఞయిచ్చెను. కొద్దిరోజులలో జోధపూరురాణితల్లి ఉదేపూరునుండి జోధపురమున కరిగెను.

నరేంద్రనాథుఁ డుదయపురమునఁ గొన్ని మాసములుండి, మిగుల నానంద మొందెను. హేమలతాప్రతిమూర్తి యాతనిహృదయమున గాఢముగా నంకితమై యుండెను. ఆమె తలంపులు మరలిపోవుట లేదు. అయినను, రమణీయమైన యాయుపత్యకయందు నివసించు సమయమున నాతలంపులు కొంచెము తగ్గినవి. ఉదేపూరునుండి కొంచెము దూరమున ననేక యుద్ధక్షేత్రములు, జయస్తంభములు, పవిత్రభూములును గలవు. ఒక్కటొక్కటిగా నతఁ డన్నిటిని సందర్శింపఁ జొచ్చెను. ఒక్కొక్కప్పు డేకాకిగను, వేఱొకప్పుడు ఉన్మత్తతార్తారబాలునితోను నరేంద్రుఁ డెన్నోపర్వతముల నెక్కెను, హ్రదముల నీక్షించెను, బహుప్రదేశముల సంచరించెను. అప్పుడప్పుడు ప్రాతఃకాలమునుండి మధ్యాహ్నమువఱకును, అపరాహ్ణమునుండి సాయంకాలమువఱకు నరేంద్రుఁడు పరిభ్రమించు

చుండును. ఉదేపురమునఁ గ్రీడాసక్తులగు రాజపుత్రబాలకులు ప్రభాతమున నాక్రొత్తయాత్రికుని వేళ్లిశోఁ జూపుచుందురు. సాయంకాలమున రాజపుత్రాంగనలు మడుఁగునుండి నీటిబిందెలు తీసికొని మరలివచ్చునపుడా విదేశీయుని జూచి బాలకుఁడని యెంచి నమస్కరించి పోవుచుందురు.

తార్తారబాలుఁడు నిశ్శబ్దముగా యజమానునివెంట సంచరించుచుండును; చెంతనున్న వృక్షములనుండి ఫలములు దెచ్చును; సాయంకాలమునఁ బడవకు తానే తెడ్డు వేసి, యజమానుని ఉదేపూరునకు మరలఁ దీసికొని వచ్చుచుండును. ప్రశాంతసరస్సుపైఁ బడవ తేలియాడుచుఁ బోవును. సంధ్యాసమయమున నభోమండలమును, ఉత్తుంగమహీధరములను, నిర్మలసరోవరములను వీక్షింప నరేంద్రునిహృదయము శాంతరసపూర్ణ మగును. అప్పుడప్పుడు తార్తారబాలుఁడు సప్తమస్వరమున గానము సేయ నారంభించును. గీతము తార్తారభాషయం దుండుటచే దాని యర్థము తెలియకపోయినను,ఒకటిరెండుమాటలవలన నది ప్రణయగీత మని నరేంద్రునకుఁ దెలియుచుండును. పాపము! ఉన్మత్తబాలుఁడా! నీ వీవయస్సునకే ప్రేమోన్మత్తుఁడ వయితివా! కానిచో, పిచ్చివాఁడవు కా నేల? నేత్రములయం దస్వాభావిక తేజ ముండు టేల? గృహము, దేశము విడిచి విదేశములందుఁ దిరుగ నేల? పిచ్చివాఁడు నరేంద్రునకుఁ దగిన సేవకుఁడు!

రాత్రివేళ వెన్నెలలో హ్రదమునకు వన్నె వచ్చును; తరంగములపైఁ జంద్రకిరణములు రమ్యముగా నాట్యమాడును; మందమారుతము తరంగమాలికను ముద్దాడును. నరేంద్రుఁడు పడవలోఁ గూర్చుండి నల్వంకల నున్న పర్వతరాశిని విలోకించును, ఆకాశనీలచ్ఛవిని గాంచును, పాలనురుగులవంటి తెలి మబ్బుల నొకటి కెంటిని జూచును. వీని నన్నిటిని విలోకింప, నతనికిఁ జిన్ననాఁటిసంగతులు జ్ఞప్తికి వచ్చును; హేమలత జ్ఞాపకము వచ్చును; వీరునిముఖ మలక్షితబాష్పబిందుసంసిక్తమగును.

ఇవ్విధమున కొన్ని నెలలు గడచెను. క్రమముగా నాశ్వయుజమాసమున నంబికాపూజాసమయ మాసన్నమయ్యెను.

౨౧

శరత్కాల మేతెంచెను. రాజస్థానమున నిది యుద్ధారంభసమయము. కావున, అంబికాపూజతో ఖడ్గపూజకూడ జరుగును. పూర్వు లేశస్త్రములు గొని యుద్ధములందు జయమును గాని, మరణమును గాని పొందిరో యాశస్త్రములను యోధులు మహోత్సాహముతో నాయుధశాలలనుండి బయటకుఁ దీసి,కలకలముతో వానిని బూజింపఁజొచ్చిరి. దేవీమందిరములఁ బ్రతిదినము మహిషములను, మేషములను బలియిచ్చుచుండిరి. పదియవనాఁడు సంరంభముతో దుర్గపూజ జరిగెను. తరువాతనోజన మహారాణా యోధుల నెల్లర నాహ్వానించి రంగస్థలమును జేరెను. ఆనాఁడు 'ఉదేపూరు' నూతనశోభతో

వెలుఁగొందెను. బజారుదుకాణములు, మార్గములు, ఘట్టములు పుష్పమాలికలతోను, తోరణములతోను శోభిల్లుచుండెను. ఇంటింటికిని తోరణములు కాఁబడుచుండెను. విజయపతాకము లెగురుచుండెను. ప్రాతఃకాలమున ఢక్కానినాదమున రాజపుత్రసైనికులు సంసిద్ధులై రంగస్థలమునకుఁ బోవుచుండిరి. ఉదేపూరునకు లోఁబడిన నానాప్రదేశములనుండి చాలమంది సేనాధిపతులు తమతమ సేనలతో వచ్చి చేరిరి. చాల తావుల నుండి యెందఱో జనులు బహువిధ వేషభూషలతోను, ఆయుధములతోను ఉదేపూరు వచ్చిరి. పదునైదువేలసైనికులు మహారాణాను పరివేష్టించి యుండిరి.

జాముప్రొద్దెక్కినది మొదలు సాయంకాలమువఱకును రంగస్థలమున సైనికులు గుమిగూడి యుండిరి. వారల యుద్ధకౌశలము నవలోకించుచు నగరవాసు లొకరినొకరు త్రోసికొని పోవుచుండిరి. రాణాయాజ్ఞానుసారముగా సైనికులు బాణములు విడుచుచు; బల్లెములతోను, ఖడ్గములతోను పోరుచు; గుఱ్ఱములను బలుగెత్తించుచు నేర్పు చూపుచుండిరి. మేవాడురాజ్యమందలి వివిధప్రదేశములనుండి వచ్చిన పలుతెగల రాజపుత్రులు తమతమరణకుశలతను బ్రదర్శించుచుండిరి. చోండావత్, గజావత్, ప్రమార్, ఝూలా వంశముల రాజపుత్రులు నేఁడు ఉదేపూరులో రాణాసన్నిధిని రాజభక్తిని, రణపటుత్వమును జూప వచ్చిరి. చారణులావంశముల యశోగీతములను బాడుచుండిరి. నరేంద్రుఁ డివ్విధ

ముగా దినమంతయు సమరోత్సవముఁ జూచి చారణులగీత ములనాలకించి పులకితచిత్తుఁ డయ్యెను. నేఁటికిని రాజస్థానమున నిట్టి యుత్సవము జరుగును. రాజపుత్రవీరు లీసమయమునఁ దమతమ ప్రభువుల సన్నిధిని యుద్ధకౌశలమును జూపుచుందురు. ఇప్పటికిని నాగరకులు దేవీపూజావసానమున దేశీయప్రభువునెడ భక్తిని జూపుచుందురు.

దిన మంతయు నీతీరున నుత్సవముల నుపలక్షించి నరేంద్రుఁడు సాయంకాలము చెట్టుక్రిందకుఁ బోయి, కొంచెము ఫలహారయత్నము చేసి చెంత నున్న బావినుండి నీరము తెచ్చుకొనఁ బోయెను. బావికడ గోసాయి నిలువఁబడి యుండెను. అతఁడును నీటికోసము వచ్చినవాఁడే. ఆగోసాయి మోటుగా నరేంద్రుని నెట్టి, ముందుఁ దాను నీరు తోడుకొనఁ జొచ్చెను. గోసాయిచేసినపనికి నరేంద్రుఁడు కుపితుఁడై యతనిని దిరస్కరించెను. గోసాయి ద్విగుణముగాఁ గటూక్తులతో నరేంద్రుని దిరస్కరించి యిట్లనెను:

'నీవు విదేశీయుఁడవు! రాజస్థానమునకు వచ్చి రాజపుత్రులతోఁ గలహము నారంభించుటకు నీకు జంకు లేదా!'

'నేను విదేశీయుఁడనే. కాని, బహుకాలమునుండి రాజపుత్రులతో సహవాసము చేయుచున్నాను. నీవంటి మోటువానిని జూడలేదు.'

'రాజపుత్రులతో సహవాసము చేసియుందువేని రాజపుత్రుఁడైనవాఁడు కత్తిని, డాలును బట్ట నేర్చియుండునని తెలిసికొనియుందువని తలఁచెద. కాఁబట్టి, యూరకుండుము!'

'గర్వితరాజపుత్రా! నేనుగూడ కత్తిని, డాలును బట్టుట కొంచెము నేర్చియున్నాను. నాకడ డంబములు వద్దు. నీవు గోసాయి వని యీపర్యాయము క్షమించినాను.'

మాటపైమాటమీఁద వివాదమువిజృంభింపఁజొచ్చెను. గోసాయి మిక్కిలి కోపముతో నరేంద్రుని గొట్టెను. నరేంద్రుఁడును గోసాయిని ప్రహరించెను. కొంచెము సేపటిలో నిరువురు నొడలెఱుఁగక కత్తులు దూసిరి. అప్పటికిఁ జీకటి పడెను. అచ్చట మఱెవ్వరును లేరు.

ఈపర్యాయ మిరువురు తీవ్రముగా యుద్ధ మారంభించిరి ఒకరి కొకరు సరిగాఁ గానఁబడ లేదు. త్వరలో నరేంద్రుఁ డోడిపోయెను. మహాబలవంతుఁ డగు గోసాయిప్రేటునకు నరేంద్రునిడాలు భిన్న మయ్యెను, ఖడ్గము చేతినుండి జాఱెను, అతఁడు నేలపై నొరగెను.

గోసాయి కఠోరస్వరముతో నిట్లనెను: 'విదేశీయ యోధా! నీవు చిన్నవాఁడవు. నీయపరాధము క్షమించినాను. మరల రాజపుత్రగోసాయితోఁ గలహింపవద్దు. గోసాయి తన జీవితము దేవతార్చనయందే గడపుట లేదు, కొంచెము యుద్ధము కూడ నెఱుఁగును.'

'రాజపుత్రా! నిన్ను జీవనభిక్ష వేఁడను.నీయిచ్చవచ్చినట్లు సాధ్యమయినది చేయుము. నీయనుగ్రహము వేఁడను' అని నరేంద్రుఁడు కర్కశస్వరమునఁ బలికెను.

అంతట గోసాయి గంభీరముగా నిట్లనెను: 'యోధా! నేనుగూడ యుద్ధము నేర్చి యుందును. యోధను యాచించి నచో యోధ కవమానము లేదు. నరేంద్రా! నేను ని న్నెఱుంగుదును. నీవును నన్ను శీఘ్రముగాఁ దెలిసికొనఁగలవు. నాకడ భిక్షఁబరిగ్రహించుట యవమానకరముకాదు. మూఁడు రోజులలో మరల నేను గానఁబడెదను. ఆనాఁడు నేను గూడ ని న్నొకటి యాచించెదను. నన్ను శైలేశ్వరుఁ డందురు.

గోసాయి సత్వరముగాఁ జీకటిలో నదృశ్యుఁ డయ్యెను. నరేంద్రుఁడు విస్మయముతో నిలిచియుండెను.

## ౨౨

రాజస్థానమునందుఁ గ్రొత్త్రక్రొత్త ప్రదేశములను, ఆచార వ్యవహారములనుజూచిన రేంద్రునిహృదయము శాంతినొందెను. కాని జాతిమీఁదఁ జెక్కు నగుటుతు, ఒక్కమాఱుగాఁ బోవదు. వంగ దేశమునుండి యు దేపూరునకు మధ్యదూరములో నెన్నో నదులు, పర్వతములు, మరుభూములు దాఁటి నరేంద్రుఁడు భారతవర్షపు తూర్పుసరిహద్దునుండి పడమటిహద్దునకు వచ్చి యుండెను. అయినను, ప్రాతఃకాలమునఁ బూర్వాకాశమం దరుణకాంతి దృగ్గోచర మయినప్పుడు పూర్వదేశవాసినియగు కన్య నరేంద్రునిహృదయమున మెలఁగును. రాత్రి నరేంద్రుఁ డొంటరిగా మేడమీఁదఁ జీకటిలో విచరించునప్పు డా ప్రణయ విగ్రహము చుక్కవలె నతనిదెస ననురాగవీక్షణము ప్రసా రించుచున్నట్లు తోఁచుచుండును. వీరనగరహర్మ్య మెక్కడ? కలకలనినాదిని భాగీరథి యెక్కడ? మఱి నరేంద్రనాథుఁ

డెక్కడ? స్వదేశమునుండి తాను బలాయనము చేసినను, తలంపులనుండి పలాయనము చేయఁగలుగునా? మరణమునకుఁబూర్వ మొకసారి యాహేమలతను జూచి, త్రికాలములయందుఁ దాను జేయు నాలోచన లన్నియు నామెతోఁ జెప్పవలె నని యతని కోరిక. మరణమునకుఁ బూర్వ మామెసందర్శన మొకసారి లభించునా? ఏకలింగమందిరమున గోసాయి భవిష్యత్తు చెప్పునని నరేంద్రుఁడు తార్తారునివలన వినెను. ఆ దేవాలయమునకు నరేంద్రుఁ డొకనాఁ డరిగెను.

రేయి జాము ప్రొద్దు వోయిన పిమ్మట నరేంద్రుఁడు దేవాలయములోఁ బ్రవేశించి, దానిశోభ కచ్చెరు వొందెను. ఆలయము పర్వతపాదమున నిర్మితము. దానికి నల్వంకలఁ గను చూపు మేరలోఁ బర్వతరాశి యంధకారమున నాకాశములోఁ గలసిపోయెను; ప్రకృతి దుర్లంఘ్యప్రాకారమునిలిపి, రుద్రున కనురూపమైనగృహమును నిర్మించెనో యనున ట్లుండెను.

అర్ధరాత్రమున నరేంద్రుఁ డాపెద్దదేవాలయమునఁ జొచ్చెను. తెల్లరాతితోఁ జెక్కిన చక్కని స్తంభశ్రేణి నడుమగా నాతఁడు విస్తీర్ణశిలామందిరమునఁ బ్రవేశించెను. ఎదుట మహాదేవునినందియొత్త డివిగ్రహ ముండెను. లోపలఁ బరిశుభ్రప్రకోష్ఠమున, స్తంభములమీఁద సుగంధతైలదీపములు జాజ్వల్యమానముగా నుండెను. నడుమ భోలనాథుని శిలావిగ్రహము ప్రతిష్ఠితము. ఆలయమున దీర్ఘకాయుఁడు, తేజస్వి, జటాధారియు నగుగోసాయి యొకదిక్కు ననుపవేశించియుండెను.

ఫాలమున నర్ధచంద్ర రేఖవలెఁ జందన రేఖయు, విశాలస్కంధ మున యజ్ఞోపవీతము నుండెను. మఱి ముగ్గురు నలుగురు గోసాయి లిటు నటుఁ దిరుగుచుండిరి. ఈయాలయప్రధాన గోస్వామి యవివాహితుఁడుగా నుండును. ఆయన మరణించిన పిమ్మట శిష్యులలో నొకఁ డాపదవి నొందును. దేవాలయపు వ్యయములకై చాల గ్రామములు కలవు. ఇంతేకాక యాత్రికుల దానములును మిక్కుటముగా నుండును.

అర్ధరాత్ర ఘంటారవ మాసుందరమందిరమునఁ బ్రతి ధ్వనించెను. ఓంకారశబ్దముతో దేవాలయము నిండిపోయెను. పిమ్మట వాద్యసమ్మిళితోచ్చగీతారవముతో బోలనాథస్తవము ప్రారంభ మయ్యెను. యౌవనసంపన్నలగు ప్రౌఢనాట్యాంగ నలు నియతితో నృత్యముచేయజొచ్చిరి. గాయకులు సప్తమ స్వరమున మహాదేవుని స్తోత్రము చేసిరి. కొంచెము సేపటికి గానము ముగిసెను. జటాధారియగు గోసాయి సంజ్ఞచేయుటచే నాట్యాంగనలు వెడలిరి, గాయకులు నీరసులయిరి, మందిరమున దీపములు నిర్వాపితము లయ్యెను, పూజ ముగిసెను. నరేంద్రుఁ డాచీకటిలో కర్తవ్య మెఱుఁగక నిలిచియుండెను. కొంచెము సేపటి కాజటాధారి గోస్వామి చీకటిలో రమ్మని సంజ్ఞచేసిన ట్లుండ నరేంద్రుఁ డావంకకుఁ జని 'తా మీ దేవాలయము లోని గోస్వాములేనా?' అని ప్రశ్న చేసెను. గోసాయి యెంత మాత్రము మాటాడక, పెదవిపై వ్రే లుంచుకొని, తరువాత వ్రేలితో నొకవైపున నరేంద్రునకుఁ జూపెను. నరేంద్రుఁ డా

దిక్కు చూడ కటికిచీకటితప్ప నిం కేమియుఁ గానఁబడలేదు. మరల వీక్షింపఁగా నాయంధకారమున దీపశిఖ గోచరమయిన ట్లయ్యెను. గోసాయి నరేంద్రునకు సంజ్ఞచేసి, ముందు కేగుచుండెను. నరేంద్రుఁ డేమియు గ్రహింపనేరక యాతని వెనువెంట నరుగుచుండెను.

ఆచీకటిలో నిరువురు చాలదూరము నడచిరి. అంధకారము! మౌనధారియగు నీయోగి యెవ్వరు? ఈయన యభిప్రాయ మేమి? శైవులు పూజకై యప్పుడప్పుడు నరహత్య చేయు చుందురు! దీర్ఘకాయుఁడు, బలిష్ఠుఁడు నగు నీవికట యోగి యుద్దేశముకూడ నదియేనా? నరేంద్రుఁ డొకపర్యాయము నిలిచి ఖడ్గముపైఁ జేయి నైచి 'నేను కాపురుషుఁడను! ఈ ప్రశాంతమూర్తి వెంటఁ బోవ భయపడుచున్నా నేమి!' అని భావించి మరల గోసాయితో నాచిమ్మచీకటిలో నడవఁ జొచ్చెను.

కొంతసేపటి కాశైవగోస్వామి పర్వతగహ్వరములోఁ బ్రవేశింప నరేంద్రుఁడు మఱింత యాశ్చర్య మొందెను.

ఎదుటఁ గరాళవదనయగు కాళీదేవివిగ్రహ ముండెను. సమీపమున కట్టె మండుచుండెను. ఆకాంతి గుహాలో నల్వంకల నున్న శిలలపైఁ బ్రతిఫలించుచుండెను. అగ్నిప్రక్కన కొన్ని యస్త్రములు,రక్తసిక్తఖడ్గము నుండెను; అక్కడక్కడ శిలాఖండములు రక్తరంజితములు;దూరమున జలప్రవాహము వంటి ధ్వని వినవచ్చుచుండెను.

గోసాయియాకార మపూర్వముగా నుండెను. కొంచెము నరసినగడ్డము రొమ్మువఱకు వ్రేలాడుచుండెను. జడలు వీఁపుపై వ్రేలుచుండెను. శరీర మున్నతము, బలిష్ఠము, తేజస్వంతము నని తోఁచుచుండెను. నేత్రద్వయ మాయగ్ని కాంతిలోఁ దళతళలాడుచుండెను. ఉన్నతలలాటమున నర్ధ చంద్రాకారమున నున్న చందనరేఖ ప్రకాశించుచుండెను.

మండుచున్నకాష్ఠము నార్పి గోసాయి దాని కావల నున్న రక్తసిక్తఖడ్గమును దీసికొనెను. వికీర్ణస్ఫులింగములచే నాతని ముఖమండలము, దీర్ఘానయనములును వికృతముగాఁ గానఁబడుచుండెను. నరేంద్రునిహృదయము స్తంభీభూత మయ్యెను. విధి లేక యతఁడొక యడుగు వెనుకకు వైచి, పాషాణముల నానుకొని, కత్తి దూసి, పరాక్రమమును నమ్మి స్థిరముగా నిలిచెను. అయినను, అతని హృత్కంపముమాత్ర మొక్కసారిగా శాంతింపలేదు.

అత్యంతగంభీరధ్వనితో గోసాయి 'నరేంద్రనాథా!' యనెను.

ఆశైవుఁడు ఉదేపూరయోధ యగు శైలేశ్వరుఁడని నరేంద్రుఁడు తోడనే గ్రహించెను.

## ౨౩

నరేంద్రనాథా! భగవాన్ ఏకలింగేశ్వరుని దేవాలయమునందు గోసాయీలకు మానవహృదయమును గ్రహించు శక్తి కలదు. నరేంద్రనాథా! నీవు పాపహృదయముతో నీమందిరము ప్రవేశించితివి. నీమానసమునఁ బాపచింత యున్నది.'

"మీ రెవరో తెలియదు. కాఁబట్టి, మీప్రశ్నమునకు సమాధానము చెప్పవలసిన యవసరము లేదు."

"నేను భగవాన్ ఏకలింగజీయాలయమున నుండు గోస్వామిని. మందిరమును గళంకితము చేసినవానిని ప్రశ్నించుటకు నా కధికారము కలదు."

"మీరు న న్నెట్లు గుర్తుపట్టినారో తెలియదు. నాలో నేమిపాపమును గనిపెట్టినారో యెఱుక లేదు."

"ఈమందిరమున మోసముతోఁ బని లేదు. ఒక రమణిని బ్రేమించి యామెను బొందు కోరికతో నీ విచటకు వచ్చియున్నావు."

"ఐనచో దోష మేమున్నది? గోసాయీలు స్త్రీ పేరు నెఱుఁగకపోయిన మాత్రాన, ప్రేమించుట పాపము కాదు. సాక్షాత్ శూలపాణియంతటివాఁ డపర్ణను బ్రేమించెను."

"నరేంద్రా! మోసము చేయఁదగిన చోటు కాదిది. నీవు కేవల స్త్రీని బ్రేమించినవాఁడవు కావు. ఈపాపప్రాయశ్చిత్తమునకు లోకమునఁ దగినశాస్తి యున్నదా? నరకమునఁ దగిన యగ్ని యున్నదా?"

"నేను ప్రేమించినప్పు డామె యవివాహిత. ఆమెకు వివాహ మయినచో నిప్పు డామె అస్పృశ్య."

"నరేంద్రనాథా! భ్రాంతి పడకు. నన్ను పొరపెట్టుటకు యత్నింపకు. నీ వెంత ఘోరపాపమున మునిఁగి యుంటివో చక్కఁగా నాలోచింపుము. మనోహర గంగాతీరమునందలి

యారమ్యహార్మ్యమును జ్ఞప్తికిఁదెచ్చికొనుము. శ్రీశచంద్రుఁడు పవిత్రాత్ముఁడు. హేమలత పవిత్రహృదయ. వారిది పవిత్ర సంసారము. దుర్మార్గుఁడా! నీకోరిక యేమి? ఆకుటుంబము పాడువడి, శ్రీశచంద్రుఁడు నాశముచెంది హేమలత నీకు లభింపవలెనా! చిన్నతనమున నీతో నాటలాడి యిప్పటికి నిన్ను సహోదరునివలెఁ బ్రేమించుచు నీకై చింతించుచున్న పుండరీకసన్నిభ, పవిత్రహృదయ, స్నేహమయి, పతివ్రత, హేమలత కులటయై నీకు సేవ చేయవలెనా? నీమూలమునఁ బతివ్రతముఖమునఁ గులపాంసని, దుశ్చారిణి యను శబ్దములు తుడిచివేయుటకు వీలులేకుండ ముద్రితము లగును; పాల నురుగువలె శుభ్రమైన యామెకీర్తియందు బొగ్గురంగు దేదీప్యమాన మగును; బంగారమువంటి కుటుంబము చెల్లాచెదరగును. నరేంద్రనాథా! భ్రాంతి పడకు. ఇంతదూరము నీవు తలపోయ లేదనుట నిక్కమే. కాని, మనోరథము కొనసాగునేని నింతకంటె వేఱుఫల మే మున్నది? ఈపాపమనోరథముతో నీ వీ పవిత్రమందిరమునకు వచ్చినావు."

శైలేశ్వరునిమాటలు పూర్తియయ్యెను. కాని, యావజ్రధ్వని యింకను నరేంద్రునిచెవులలో ధ్వనించుచుండెను. నరేంద్రుఁడు కొంతతడవ వధోవదనుఁడై యుండెను; ఆతనిశరీరము వణఁకుచుండెను; ఆలోచింప నాలోచింప నాతనికోర్కె మస్తమించెను. నేత్రములనుండి రెండు బాష్పబిందువులు రాలెను. కొంతసేపటి కతఁడు నిట్టూర్పు విడిచి

మెల్లన 'స్వామిన్! నేను పాపిని! నాకుఁ దగినశిక్ష చేయుఁడు!' అని వేఁడెను.

'వత్సా! ఈలోకమున నౌషధములేని వ్యాధి, ప్రాయశ్చిత్తములేని పాపము లేవు. నిన్నుఁ బరీక్షింప నెంచితిని, శిక్షింప నెంచలేదు.'

'స్వామిన్! నేను దయార్హుఁడను గాను. హేమలత వంటి పవిత్రమూర్తి కపకారము తలపెట్టిన యీపాపాత్మున కిహలోకమునఁ బ్రాయశ్చిత్తము లేదు!'

'నరేంద్రా! నీవు తలంచుకొనుచున్నంత పాపాత్ముఁడవు కావు. నాకుఁ దెలియని దేమియు లేదు. నీవు హేమలతను బొందవలె ననుకోరికతో లేవు. ఆమె నొకసారి యీజన్మలోఁ జూడవలె ననుతలంపుతో నీదేవాలయమునకు వచ్చినావు. నీవు చిన్నవాఁడవు. హేమలత నొకసారి చూచినచో నామె కొంప మునుఁగు నని నీ వెఱుఁగవు.'

'ప్రభో! తమరు సెలవిచ్చిన దంతయు యథార్థము. హేమలతకు హానిమాట దూరముగా నుంచుఁడు; ఆమెకు గ్రుచ్చుకొన్న కంటకమును బెఱికివేయుటకుఁ బ్రాణముల నీయఁ గలను. సర్వాంతర్యామి యగు భగవంతుఁ డీ విషయ మెఱుఁగును.'

'అట్లయినచో, నీ వామెహృదయమున నాఁటిన కంటకమును దీసివేయుట కేల యత్నింపవు?'

'ఎట్లో సెల వీయవలెను.'

'బాల్యమున నీ వామెహృదయమున నాఁటిన ప్రేమ కంటకమును పెకలింపుము. నీ వట్లు చేయవేని, ఆకంటక మటులే యుండి, హేమలత జీవన్మృత యగును. ఇప్పు డామెకు సచ్చరిత్రుఁడు, ధర్మపరాయణుఁడు నగుభర్త లభించినాఁడు. ఆమె సంసారభారము వహించినది. అప్పు డప్పుడు నిన్ను గుఱించి తలఁచుచుండును. అప్పు డామె భర్తృవిశ్వాస ఘాతుకురా లగును. నీ వామెచింతను దొలఁగింపవలెను.'

'తొలఁగించు టెట్లు? నే నామెను సందర్శించినచోఁ గొంప మునుఁగు నని తమరు చెప్పియున్నారు.'

'ఉపాయ మున్నది. హేమలతతో విచ్ఛేద మొక్క సారిగా సంఘటింపవలెను; నరేంద్రా! నీవు నిజముగా నామె మేలు కోరితి వేని, నిజముగా నామెకంటకమును పెకలింపఁ బ్రాణములను గూడ విడువ సమ్మతింతువేని నారీసంసర్గము విడిచి, సన్న్యాసి నగుము. కాదా, ఇస్లాంధర్మము స్వీకరించి ముసల్మానుకన్యను బెండ్లియాడుము. నీవు చిన్ననాఁటి ప్రేమ మఱచి యోగి వయితి వని కాని, అన్యమత మవలంబించి యన్యమతస్త్రీని బెండ్లియాడితివని కాని హేమలత విన్నప్పుడు తప్పక యామెహృదయము మాఱిపోవును. మానవహృదయము తీఁగవలె నెందుకొయ్యో కల్లుకొనదు. తన్ను నీ వొక్క సారిగా మఱచిపోతి వని హేమలత భావించును. వేఱాశ, వేఱుప్రేమ, అన్యోద్దేశము కలవానియెడ ననురాగము చిర కాల మెక్కడ నుండ నేరదు. నరేంద్రా! నీఘోరపాపమున కది విషమప్రాయశ్చిత్తము.'

ఆమెకై యెన్ని కష్టములు పడు మన్నను సిద్ధముగ నున్నా నని నీకుఁ దెలియును. అయినను, తమ నిర్దేశము దుష్కరము! ఈయౌషధము మిక్కిలి చేదు. ఇంకొక యౌషధము సెలవీయవలెను.'

'ఉత్కటవ్యాధి కుత్కటౌషధ మవసరము.'

'స్వామీ! తాము పరమధార్మిక శైవు లయ్యు నన్ను ముసల్మానుధర్మముపరిగ్రహింపుమని యాదేశించుచున్నారే!'

'పాపమునవలన మనుష్యుఁడు పశుజన్మము కూడ నెత్తుచున్నాఁడు. కేవలము మతనాశమునకు భయపడుచున్నావా?'

ఇరువురును గొంతతడవు నిశ్శబ్దముగా నుండిరి. నరేంద్రుఁడు చెక్కిట చేయి పెట్టుకొని, అగ్నికణములవంకఁ జూచుచు నేకాగ్రతతో నేమో యాలోచించుచుండెను. శైలేశ్వరుఁ డా గుహాలో మెల్లమెల్లగ విచరింపఁ జొచ్చెను.

కొంతతడవునకు శైలేశ్వరుఁడు గంభీరస్వరముతో 'నరేంద్రనాథా! నీవు మమ్ము విశ్వసించెదవా?' అనెను.

'ఇదిగో నాఖడ్గము, పరిగ్రహింపుఁడు. ఇంకేమి ప్రమాణము కావలెను?'

'ఒక సంగతి. స్త్రీకి ప్రేమయే యవలంబనము; ప్రేమయే జీవనము; పురుషున కట్లు గాదు. పురుషున కెన్నో యాశలు, ఎన్నోకోరికలు, ఎన్నోగొప్పయుద్దేశములు నుండును. నీవు పడుచువాఁడవు, పరాక్రమశాలివి, మానవంతుఁడవు. ఈలోకమున ఖడ్గహస్తుఁడవై, యశోమార్గము పరిష్కరింపలేవా?

స్త్రీలవలెఁ గేవలము రోదనముతో నీజీవనము గడప నెంచెదవా? మీ వంగదేశము వీరశూన్యము, యశశ్శూన్యము నయినదని విన్నాను. హో! నరేంద్రనాథా! వంగదేశమున యశస్స్తంభము సంస్థాపింపుము; స్వదేశగౌరవసాధన మొనర్పుము; సాహసపరాక్రమములఁ జూపి కీర్తి నిలుపుకొమ్ము. ఈ గొప్పయుద్దేశముతో నీజీవితము సమర్పింపుము. నీకుఁ దోడ్పడని దేవత లుండరు. వజ్రపాణియు, శూలపాణియు స్వయముగా నీకోరిక నెఱవేర్తురు.'

శైలేశ్వరుఁ డూరకుండెను. నరేంద్రుని నేత్రములు జ్వలింపఁ జొచ్చెను; ఏకాగ్రతతో నతఁ డా యపూర్వశైవుని వంకఁ జూచుచుండెను. వెనుక నొకనాఁ డీ శైవుఁడు యుద్ధమునం దెంత నేర్పరిగాఁ గానఁబడెనో మానవహృదయమును గ్రహించుటయందు నేఁ డంత నేర్పరిగాఁ గానఁబడెను. శైవుఁడు మరల నిట్లు పలికెను: 'నరేంద్రా! నీవు వి దేశమున నీఘోర రాత్రిమున నేకలింగ దేవుని మందిరమునఁ బూజ చేయ వచ్చినా వెందులకు? దేశక్షేమముకొఱకు వచ్చినావా? ఏదో వీరవ్రతము నవలంబించి వచ్చితివా? మహోద్దేశసాధనార్థము వచ్చినావా? ఛీ! నరేంద్రా! నీవంటి వీరపురుషుఁడు యువతీముఖసందర్శనమునకయి జీవితమహోద్దేశమును విస్మరించునా? ప్రేమచింతను దూరము చేయుము. అటు కాక, ప్రేమలేని జీవితము నిష్ఫలమని తలఁచితివేని వీరోచితమగు పరిణయమునఁ గట్టుపడుము. పురుషసింహా! సింహిని బరిగ్రహింపుము!'

'భగవన్, ఆజ్ఞాపింపుఁడు.'

'ఈప్రపంచమున వెదకుము. పూర్వకాలమున సావిత్రి వలె నీకు సేవ చేయవలెను; విపత్సమయమున చాముండా దేవివలె ఖడ్గహస్తముతో నీపార్శ్వమున నిలువవలెను; కావల కాలమున విమలప్రణయముచే నిహ్లాదము సంతృప్తము చేయవలెను యుద్ధసమయమున యశోగీతములు పాడి, నీ శరీరము పులకరింపఁజేయవలెను. ఇట్టి తరుణి లభించినచో నామెను బరిగ్రహింపుము.'

'ఇట్టి స్త్రీ లోకమున నున్నదా ?'

'స్వయముగాఁ జూడఁ గలిగితివి, నా యోగబలము నట్టిది కాదు. నరేంద్రా! అట్టి తరుణి లేక నిన్ను నిష్కారణ ముగా నీ గుహకు బిలువ లేదు. ఇంకొక మాట. నేను జెప్పు చున్న యామె హేమలతికంటెను సిన్నదిగాఁ బ్రేమించును. ఈమెను నీవు మునుపు చూచి యున్నావు.'

'జ్ఞప్తి లేదు.'

నేఁడు స్వప్నమునఁ జూచెదవు, నేను వెళ్ళుచున్నాను. ఈకలశమునందలి మద్యము నాస్వాదించి, నేఁడీ గుహలో శయనింపుము. ఆఱిపోవనున్న యీయగ్నిని జూడుము. నిప్పు బూదియగునప్పటికి నీ వా కల గాంతువు. నీకుఁ గానఁబడు తరుణి నీవలె ప్రణయము వాంఛించునది. నీవలె నభి మానము గలది. వీరపురుషా! నీకుఁ దగిన దా వీరాంగన.'

'మీ మాట లాశ్చర్యకరముగా నున్నవి.'

'ఇంకొకసంగతి, సావధానముగా నాకర్ణింపుము. కలఁ గాంచి ప్రభాతమున గుహ విడిచి పొమ్ము. నీకు మూఁడు దిన

ములు గడువిచ్చినాను. స్వప్నముఁగాఁ బడు స్త్రీని వివాహ మగునదియు, కానిదియు మూఁడురోజులలో నిర్ధారణ చేసికొవలెను. సమ్మతమైనపక్షమున మూఁడురోజుల తరువాత లలాటమున శ్వేతచందనరేఖ దాల్చి యమావాస్యా సాయంకాలమున నీగుహాదగ్గఱ నన్నుఁ గలసికొమ్ము. ఆకన్య యేవిధముగా లభించునో తెలిపెదను. వివాహము సమ్మతముకాని పక్షమున లలాటమున రక్తచందనరేఖ దాల్చి రమ్ము. నీ పాపమునకుఁ బ్రాయశ్చిత్తవిధానము దెలిపెదను. ఇందున కంగీకరింపుము. కానిచోఁ, గాళీదేవి నీకు స్వప్నము నను కూర్పదు.'

'సమ్మతించినాను. మూఁడుదినము లయిన తరువాత నవావాస్యా సాయంకాలమున, ఈగుహాకడఁ దమదర్శనము చేసెదను. తమరు సెలవిచ్చినచొప్పునఁ బ్రవర్తింతును.'

'నీవు వీరపురుషుఁడవు. నీమాటయే చాలును. ఇప్పటికి మూఁడుజాములకాల మయినది. నేను విశ్రమింపఁ చెదను.'

౨౪

నరేంద్రనాథుఁ డాచీకటిగుహాలో చాలసేపు ఇటు నటుఁ దిరుగఁ జొచ్చెను. చిన్ననాఁటి చెలిమి, యౌవనపుఁ బ్రేమను నాకస్మికముగా నతఁడు విసర్జింప సంసిద్ధుఁ డయ్యెను. ఎట్టి భీషణచింతలతో నాతనిహృదయము కల్లోల మయ్యెనో!

కొంతతడవున కగ్ని చల్లాఱిపోవనుండుటఁ జూచి నరేంద్రుఁడు శైవునియాదేశము స్మరించి కలశముననున్న మదిరను సంపూర్ణముగాఁ గ్రోలెను. అంత నాతనితల తిరుగఁ జొచ్చెను. అగ్ని కొకనైపున నరేంద్రుఁడు శయనించెను.

నరేంద్రనాథుఁ డగ్నిని విలోకింపసాగెను. ఒకసారి కట్టెలో నొకభాగము జాజ్వల్యమాన మయి, మరల నాఱిపోవును; ఒక్కొక్క విస్ఫులింగము పొడచూపి క్రమ్మఱ బొగ్గగుచుండును. చూడంజూడ మండుచున్న నిప్పులు నిర్వాణప్రాయము లయ్యెను. ఆ మందకాంతిలో శిలాగుహాకుడ్యములు మఱింత విచిత్రముగాఁ గానఁబడెను. గోడలమీఁది కాంతిచ్ఛాయల నర్తనమువలె నలౌకికవ్యక్తి నాట్యము కన్పట్టుచున్నట్లుండెను. కాళీదేవినయనయుగ్మము ధగధగలాడుచున్నట్లయ్యెను. కాళిచేతిఖడ్గము నరేంద్రునిపై పునః ప్రసారిత మగుచున్నట్లుండెను. నరేంద్రుఁడు లేవ యత్నించెను; లేవలేకపోయెను. అతఁడు మెలఁకువతో నుండెనా? స్వప్నావస్థలో నుండెనా?

మిగిలిన యగ్నికణములు చల్లాఱెను. నరేంద్రుఁ డవి చూచుట లేదు, కల గాంచుచుండెను. ఇంతవఱకును దూరపు నీటిధ్వనివలె వినఁబడుచున్నది. తటాలున నాఱి స్వర్గీయ సంగీతధ్వని యయ్యెను. చిమ్మచీకటిలోఁ గ్రమముగాఁ దేజఃపుంజము వ్యాపింపఁ దొడఁగెను. గోడ యున్న ప్రదేశమునుండి పెద్దశిలాఖండము తటాలునఁ దొలఁగిపోయినట్లు తోఁచెను. అందుండి యపూర్వసంగీతధ్వనియు, వెన్నెలవంటికాంతియు

ఒయలు వెడలుచుండెను. క్రమక్రమముగాఁ జంద్రుని కడ్డముగా నున్న మేఘము తొలఁగిపోవ, కాంతి వచ్చుచున్న వరిదే శము ముక్తమయ్యెను. ఇది స్వప్నమా? నిజమా? దేవలోక సౌందర్య విభూషిత యగు పదునారేండ్ల కన్నె వీణె దాల్చి యుపూర్వముగా గానము చేయుచుండెను. నరేంద్రుఁడు విస్మయముచే స్తంభీభూతుఁడై, అవింతస్వప్నమునే చూచు చుండెను.

ఆయనుపమాన సౌందర్యము, ఆయుజ్జ్వలనయనములు ఆకృష్ణకేశపాశము, ఆతనూలత మానవస్త్రీల కుండునా? దూరముగా వినఁబడు సంగీతమువలె స్మరణశక్తి క్రమక్రమ ముగా నరేంద్రుని మానసమునఁ బొడమనారంభించెను. కాశీ యుద్ధము, ఢిల్లీనగరము, అచ్చటి ముసల్మానుస్త్రీ జ్ఞప్తికి వచ్చెను. ఓ! ఈమె జులేఖా!

నరేంద్రుఁ డాలోచించుట కవకాశము లేకపోయెను. తోడనే సప్తస్వరసమన్వితము, అప్సరోంగనా కంఠవినిర్గతము నగు విచిత్రగీతము పర్వతకందరము నిండిపోయెను. నరేంద్రుని హృదయము కల్లోల మయ్యెను. శ్రుతి కలిపి, జులేఖా గానము చేయుచుండెను. ఆ గాన మెంత మధురము, ఎంత హృద యంగమము, ఎంత భావపరిపూర్ణము! నిశ్చలదృష్టితో నరేం ద్రుఁడు జులేఖాదెసఁ జూచుచుండెను. గానము సేయుచో జులేఖాకంఠము నడుమ నడుమ స్తంభితమగుచుండెను. నేత్ర ములనుండి బాష్పబిందువులు చెక్కిళ్ళమీఁదుగా జాఱుచుండెను.

గీ త ము

భార్యకు నెయ్యది పరమ ధర్మంబు?
సాధ్వి యెద్దానిని సాధింపఁ జాలు?
స్నేహంబు దానముచేఁ దుదదాఁకఁ
బతిప్రేమతృష్ణను శాపఁగాఁ గలను.
సంపద వేళను సతి లక్ష్మివోలెఁ
బ్రజ్వరిల్లఁగఁ జేసి ప్రణయదీపంబు
ఆత్మేశునకు మోద మభివృద్ధి చేయు.
జాగ్రదాశాగతి సంగర స్థలిని
కాంతుని హృదిఁ బరాక్రమపూర్ణముగను
వీరపతివ్రత వెలయింపఁ జాలు.
క్రమముగా దుఃఖాంధకారాన జీవి
తాశాప్రదీపము లారిపోవంగ,
స్వామి కష్టములలో సగముభాగంబు
దాలిచి భారంబు తగ్గించు సాధ్వి.
జీవితాభ్రమునుండి జీవనతార
రాలిపోవఁగఁ బతివ్రత సంతసమునఁ
గాంతునితో సహగమనమ్ము సేయు!

ఈ తాత్పర్యముగల మధురగీతము సమాప్తమయ్యెను; కాని, నరేంద్రుని కర్ణకుహరమునమాత్రము గీతము ధ్వనించు చుండెను. ఒకసారి మధురధీరముగాను, మఱియొకసారి వజ్ర ధ్వనితోను గీతము వినఁదింపసాగెను. జులేఖా మానవస్త్రీ యగునా? దేవకన్యయా? ఎవతె యయినను నరేంద్రుఁ డామె

ముఖమండలమును మాటిమాటికి వీక్షింపసాగెను. వెనుకటి కంటె నామె యిప్పు డెక్కువ సుందరముగాఁ గన్పట్టుచుం డెను. అయినను విచారముచే లలాటమునఁ జింతావర్ణము, బాహువులందు క్షీణత, నేత్రములయందు దుఃఖనివాసము గోచరించుచున్నట్లుండెను. నరేంద్రుఁడు మఱి చూచుట కన కాశము లేకుండ సంగీతధ్వని పర్వతకందరమును గంపింపఁ జేయఁజొచ్చెను. విషాదకరమైన యాగానముచే నరేంద్రుని హృదయము కరిగ్నమెఱి నాలోడితము, ద్రవీభూతము నయ్యెను.

గీతము

భర్తను బ్రేమకై భార్య యాచించు!
పట్టియున్నది నీదు పాదయుగ్మంబు
ననురాగలతవోలె, నామెను నీవు
స్నేహబిందువులచే జీవింపఁజేసి,
ధరణిపైఁ బడకుండఁ దప్పింపు నాథ!
స్వజనుల, మాతృదేశంబును వీడి
దూరభూములకు నీతోడ వచ్చినది.
సుఖయించు నామె నీసుఖములయందు,
దుఃఖించు నామె నీదుఃఖమ్ములందు,
పడసినఁ జాలు నీపాదాలనీడ!
బ్రతికిన యన్నాళ్ళు పరవాంఛ లేదు.
తుదివేళ, నాత్మేశు వదనము చూచి,
పాదములం బట్టి ప్రాణాలు విడుచు!
ఇంతకంటెను సాధ్వి కేకోర్కె యుండు!

గీతము సమాప్తినొందెను. నయనజలముచే ఆపాంథుని ముఖమును, నుదస్త్రములను తడిసిపోయెను. మేఘచ్ఛాయచే సూర్యకాంతి మెల్లమెల్లగ నాచ్ఛాదితమగునట్లు కాంతివచ్చుచున్నదన్నారి మాచ్ఛాదిత మయ్యెను. ఆ దేవతావిగ్రహ మంతర్ధాన మొందెను. గాఢాంధకారములో నీశానికోణము లీన మయ్యెను. వెనుక విన్న దూరజల ఘర్ఘరము తప్ప నరేంద్రునకిం కేమియును వినరాలేదు. ఆతఁడు గాఢనిద్రా విలీనుఁడయ్యెను. స్వప్నముగాంచినది ప్రభాతమున నతనికి జ్ఞప్తిలేదు. మెలఁకువ వచ్చి లేచునప్పటి కాతనికి మత్తులేదు. అంత నరేంద్రుఁడు గుహాలోనుండి బయటకు వచ్చెను. నవో దిత బాలాతపమున వృక్షలతాదులు, దూర్వాదళములు ధగ ధగ లాడుచుండెను. కొమ్మకొమ్మను పక్షులు కిలకిలలాడు చుండెను. తెల్లరాతితోఁగట్టిన యేకలింగస్వామి దేవాలయము నీరెండలో శోభాయమానముగా నుండెను. దేవాలయము జనా కీర్ణ మయ్యెను. నల్లంకల, పర్వతములపైఁ బర్వతములు సూర్యరశ్మిలో సుందరముగఁ గన్పట్టుచుండెను.

## ౨౧

ఆ మూఁడురోజులు నరేంద్రుఁడు చింతాజలములోఁ జిక్కి యెట్లు దుఃఖించుచుండెనో చింతాశతము వృశ్చిక శతము కంటెఁ గూడ బాధాకర మయ్యెను.

ఆ గుహలో శైలేశ్వరుఁడు చేసిన నియమము నరేంద్రుఁడు విస్మరింపలేదు. శ్రీశచంద్రునకు హేమలతకును వివాహమయినసంగతి బహుకాలముక్రిందటనే నరేంద్రుఁడెఱుఁగును. శైవునియానతి తలఁదాల్చవలసినదని నరేంద్రుఁడు నిశ్చయించుకొనెను.

గంగాతీరమున వీచుకోలుసమయమున నక్షత్రకాంతిలో శుష్కించి పాలిపోయిన ముఖము మరలఁ గానవచ్చెను. దీనురాలైన హేమలతవృత్తాంతము మెల్లన నరేంద్రునకు జ్ఞప్తి వచ్చెను. ఆతనిశరీర మంతయుఁ బొటమరించెను. నరేంద్రుఁడు గృహత్యాగము చేసినప్పుడే బాల్యకాలమునఁ దనతో నాడుకొనిన హేమలత యావజ్జీవము సెలవిచ్చెనని నరేంద్రునకుఁ దోఁచెను. చిన్నతనమున హేమలత నరేంద్రుని దప్పనింకెవరి నెఱుఁగదు. యౌవనప్రారంభముననుఁ, ఉదయాస్తమయముల్ల నతనిం జూచుచో నామె యుద్వేగశూన్యయు, శాంతచిత్తయు నగుచుండెడిది. చిన్ననాఁటిసంగతు లెన్నో యెడతెగని తరంగములవలె నరేంద్రునిహృదయమును గలచివేయఁ జొచ్చెను. ఆతఁడు దుఃఖము సహింపలేక, దేవాలయముప్రక్కనఁ గూరుచుండి నిశ్శబ్దముగాఁ గన్నీరు విడువఁ జొచ్చెను. ఆదినమాతఁ డేమియు నిర్ధారణము చేయలేకుండెను.

మూఁడురోజులు గడచెను. మూఁడవనాఁటిరాత్రి నిర్దిష్టసమయమునకు రెండుగడియలు ముందుగా నరేంద్రుఁడు గుహాముఖమున నిలుచుండెను. ఒకమాటటునిటు నడచు

చుండెను; మఱియొకసారి నల్లని యాకాశమువంక నిశ్చలముగా జూచుచుండెను; ఇంకొకమారు గుహాముఖమును జేరి నిలువఁబడుచుండెను. ఆతని చేతిలో విచ్చుకత్తి యుండెను; ఆకారము గంభీరముగ నుండెను.

కొంతసేపటికి శైలేశ్వరుఁడు వచ్చి, నరేంద్రు నాశీర్వదించెను. నరేంద్రుఁడు గోసాయికి ప్రణామము చేయ మఱచెను.

'స్థిరప్రతిజ్ఞఁ జేసికొన్నావా?' అని శైలేశ్వరుఁ డతని నడిగెను.'

'ఆఁ! అని నరేంద్రుఁడు గంభీరము, కొంచెము కఠినము నగుస్వరముతోఁ బలికెను. ఇరువురును గుహలోనికిఁ జనిరి.

పూర్వమువలెనే యాగుహ జాజ్వల్యమానముగ నుండెను. నరేంద్రుని లలాటము, గండస్థలము, వక్షస్స్థలము, బాహువులు నొక్కమాఱుగా రక్తచందనముతో లిప్తములై యుండెను.

'పాపిష్ఠా! పరకాంతమీఁది కాంక్ష విడువలేవా ?' అని శైలేశ్వరుఁ డనెను.

'పరస్త్రీకాంక్ష లేదు.'

'హేమలత నీజన్మములోఁ జూడఁ గోరవా?'

'చూడను.'

'యువనకన్యను వివాహమాడ నిష్టము లేదా!'

'ఈజన్మమున లేదు.'

శైలేశ్వరుఁ డించుక యూరకుండి, మరల ని ట్లనెను: 'ప్రతిజ్ఞఁ బాలించుటకు సంసిద్ధుఁడవు కమ్ము. ఖడ్గము విడిచి కాళీదేవి సమ్ముఖమున నీప్రాణము లర్పింప సిద్ధము కమ్ము!'

'నేను జేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నాను. మీసన్నిధికి వత్తు నని చెప్పియుంటిని, వచ్చినాను.'

'మూఢా! సింహగుహలోఁ బ్రవేశించి, యింకను బ్రాణముల కాశ పడుచున్నావా? ఇక్కడ నీ కెవరు దిక్కు?'

'నా ఖడ్గమే శరణము.'

గుహలో నొకచోటినుండి శైలేశ్వరుఁడు నిశ్శబ్దముగా ఖడ్గము బయటకుఁ దీసెను. ఉదయపురమున యుద్ధము జరిగి నట్లే నేఁడును యుద్ధము జరిగెను. నరేంద్రుఁ డప్పటికంటె నిప్పు డెక్కువభద్రముగా, ప్రయత్నపూర్వకముగా యుద్ధము చేయ సాగెను. కాని, అంతెయు నిష్ఫల మయ్యెను. సింహపరాక్రముఁ డగు శైవుఁడు త్వరగానే నరేంద్రు నోడించి యతని ఖడ్గము నావలఁ బడఁగొట్టెను.

'కేవలము పూజతోనే నా తల నరయ లేదు. రాజస్థానము వీరప్రసవిని. యుద్ధకాలమున గోసాయీలు పరాక్రమము చూపుటలో నగ్రగణ్యులు. చిన్నవాఁడా! నీతో యుద్ధము చేయుటవలన మాకుఁ గళంకము వచ్చినది!'

'నేను సిద్ధముగా నున్నాను. మీ యిష్టమువచ్చినట్లు చేయవచ్చును.'

'శైలేశ్వరుఁడు గడ్డితాడు బయటకుఁ దీసి దానితో నరేంద్రుని రెండుచేతులయందలి నాడు లుబ్బునట్లు గట్టిగాఁ

గట్టివైచెను. నరేంద్రుఁడు నోరు విప్పలేదు. శైలేశ్వరుఁడు పూర్వమునలెనే కలశము గొనివచ్చి నరేంద్రునినోటికడ నుంచి మద్యము త్రాగుమనెను. నరేంద్రుఁడట్లు చేసెను. గోసాయి గుహనుండి వెడలిపోయెను.

మత్తుచే నరేంద్రుఁడు శీఘ్రముగా నేలపై నొరగెను. అతనికన్నులు చీకటులు గ్రమ్మెను. గుహాప్రక్కన యిద్దఱు జనులు మెల్లమెల్లన నేదో మాటలాడుచున్నట్లు లాతనికిఁ దోఁచెను. ఆమాటలు లాలకించుచు మదిరాప్రభావమున నతఁడు నిద్రాభిభూతుఁడయ్యెను. తరువాత నేమి జరిగెనో యాతనికి జ్ఞప్తి లేదు.

ఆతనిది గాఢనిద్ర గాదు! నరేంద్రుఁడు రాత్రియంతయుఁ గలగాంచుచుండెను. నడుమనడుమ నాతనికి మెలఁకువ కలుగుచుండెను. మత్తుచే నాతఁ డేమియుఁ దిన్నఁగా గ్రహింపలేకుండెను.

చాలసేపటికిఁ బూర్వమునలెనే యాయంధకారమున దీపకాంతి కానవచ్చెను. మరల రాతిగోడ కదలిపోయెను. మేఘములు దాఁటిపోవ వెన్నెల కాయుచున్నట్లుండెను. కాని, ఆవెన్నెలలో నాయుజ్జ్వలమూర్తి జులేఖా. నేఁడు సంగీతము పాడుటలేదు, వీణె చేతఁబూని రాలేదు, ఖడ్గముతో వచ్చినది!

ఎంత భయంకరమూర్తి! ఆమె నేత్రములనుండి నిప్పుకణములు రాలుచుండెను, పండ్లు బిగఁబట్టి యుండెను, ముఖమంతయు రక్తవర్ణమై క్రోధముచేఁ బ్రజ్వరిల్లుచుండెను. ఆమె

హస్తమున శైవుని దీర్ఘఖడ్గము, భుజమున వాఁడిచురకత్తియు నుండెను. నరేంద్రుఁ డాశ్చర్యము నొందెను. ఆతని నొసటి నుండి చెమ్మట స్రవించుచుండెను. నరేంద్రుఁడు లేవ నుద్యమించెను; కాని స్వప్నమున విపద్గ్రస్తుఁడైన పురుషునివలె లేచుటకుఁ గాని; పోవుటకుఁ గాని శక్తి లేకుండెను.

మృణాళమునంటి హస్తమున ఖడ్గము బూని జులేఖా గుహలోఁ బ్రవేశించెను. ఆమె యొకమారు నిలిచెను, ఒక మారు నరేంద్రుని వంకఁ జూచెను. చేతినుండి ఖడ్గము జాఱి పడెను.

తరువాత నామె వాఁడిచురకత్తిని దీసి, నిశ్చలహస్తముతో నరేంద్రుని ఱొమ్ముపై మోపెను. మరల నేమి యోఁచెనో ఛురిక యామెచేతినుండి జాఱి క్రిందఁబడెను. మెల్ల మెల్లన జులేఖా వెడలిపోయెను.

నరేంద్రుఁడు కేక వేసి లేచి కూర్చుచుండెను. అతనికి బాగుగా మెలఁకువ వచ్చినది. అతనిశరీరమంతయు చెమటతోఁ దడిసిపోయెను; మత్తు తొలఁగిపోయెను. గుహ చీకటిగాను, నిశ్శబ్దముగా నుండెను. మెల్లమెల్లన నరేంద్రుఁడు గుహనుండి యీవలకు వచ్చెను. తూర్పు తెల్లవాఱుచుండెను. ఆకసమున రాగరేఖలు మనోహరముగా నుండెను. ఆఱిపోవ నున్న దీపములవలె నింకను నొకటిరెండు నక్షత్రములు మినుకు మినుకు మనుచుండెను. ప్రభాతశీతలవాతము పర్వతశ్రేణి మీఁదను, శివాలయముమీఁదను వీచుచు, అప్పుడే వికసించు

చున్న పుష్పపరిమళమును దాల్చి నిద్రనుండి మేల్కాంచిన లోకమున కామోదము కలిగించుచుండెను. పొదలనుండి పక్షులు మనోహరముగాఁ బాడుచుండెను.

## ౧౯

తరువాతఁ గొలఁది రోజులకు జోధపురాధిపతి రాజా జస్వంతసింగు మరల సైన్యముతో ఔరంగజేబుతో యుద్ధము చేయుటకయి, ఆగ్రాముఖముగాఁ జనెను. నరేంద్రుఁడు నా సైన్యములోఁ జేరి రాజస్థానము విడిచెను. నరేంద్రుఁడు ఉదేపూరుననున్న కొద్ది నెలలలో ఆగ్రాలో విప్లవముఘటిల్లెను. ఇప్పు డాగ్రాలో వెనుకటి పాదుషా లేఁడు, వెనుకటి ప్రభుత్వము లేదు.

భయంకరమైన యీ భ్రాతృయుద్ధప్రారంభమున వారణాసిలో సుల్తాన్ సుజాయును, ఉజ్జయినిలో జస్వంతసింగును పరాజయము నొందిరి. రెండవసంగతి విని పాదుషా పెద్ద కుమారుఁడు దారా యత్యంత క్రోధమున లక్షాధిక సైన్యమును వెంటబెట్టుకొని యుద్ధమునకు బయలుదేఱెను. చంబల్ నదీతీరమున నాతఁడు శిబిరమును స్థాపించి ఔరంగజేబు మురాదుల యాగమనమునకయి ప్రతీక్షించుచుండెను. శీఘ్రకాలములోనే వారును నది కావలియొడ్డున విడిసిరి. మురాదు పరాక్రమశాలి, రణనీతివేత్త. నది దాఁటి యుద్ధము చేయుటకయి యాతఁడు సలహా యిచ్చెను గాని కుతంత్రపటు

వగు 'ఔరంగ్‌జేబు' అట్లు చేయక దారాను మోసపుచ్చుటకు డేరా లచ్చటనే విడిచిపెట్టి కేవలము సేనలతో రహస్యముగా నదిని వేఱొకచోట దాఁటి, ఆగ్రాకు ౨౦ క్రోసుల దూరములో యమునాతీరమున నున్న శ్యామనగరగ్రామము దగ్గఱ శిబిరము స్థాపించెను. శతృవులు చంబల్‌నదిని దాఁటి ఆగ్రాసమీపమున విడిసి రని దారా యత్యంత విస్మయావిష్టుఁ డయ్యెను. కోడనే యతఁడు సేనను దీసికొని చని, శ్యామనగరముకడ యమునాతీరమున విడిసెను.

భారతవర్షసింహాసనము శ్యామనగరయుద్ధ ఫలితము. ఉభయపక్షములు యుద్ధమునకుఁ జొచ్చుటకు సంకోచించెను. నాలుగురోజు లిరుపక్షములు మిన్నకుండెను. అయిదవనాఁడు యుద్ధము ప్రారంభమయ్యెను. దారాకు నెడమవైపున రాజా రామసింగు, చత్త్వరశాలును పరాక్రమముచూపి నిహతులయిరి. కుడివైపున నున్న కాలీఉల్లా అను ముసల్మాన్ సేనాపతి ఔరంగ్‌జేబులంచము తిని ద్రోహియై యుద్ధము చేయలేదు. తుదకు ఔరంగ్‌జేబుకు జయము కలిగెను.

నేర్పరి యగు ఔరంగ్‌జేబు యుద్ధక్షేత్రమున కాలీఉల్లాను గౌరవించెను. మురాద్ 'భారతవర్ష సమ్రాట్టు' అని ప్రకటించి వానికి మనస్తుష్టి చేసెను.

ఔరంగ్‌జేబు ఛలమున, బలమున, కౌశలమున ఆగ్రాను శీఘ్రముగా వశముచేసికొని తండ్రిని జెయిసాలలోఁ బడవైచెను. షాహాజహాన్ చిన్నకూఁతురు 'రోషన్‌ఆరా' అనేక

విషయములలో ఔరంగజేబునకు వార్తలంపుచు మిక్కిలి తోడుపడుచుండెను. అతనికి విజయము కలిగిన తరువాత రోషన్ ఆరా ప్రభుత్వమునకు మేర లేకుండెను. షాజహాన్ పెద్దకూతురు జహాన్ ఆరా చెల్లెలికంటె నన్నివిధముల శ్రేష్ఠురాలు. ఔరంగజేబు జయమును బొందిన తరువాత నామె హతాశయై యప్పటినుండి పితృసేవలోఁ గాలక్షేపము చేయుచుండెను.

ఆగ్రాను వశము చేసికొని ఔరంగజేబు ఢిల్లీకి బయలుదేఱెను. మార్గమున నతఁడు మురాదును మధురకుఁ బిలిచెను. మురాదు మద్యపానము చేతను, విలాసినీగణము చేతను మత్తుఁడై యుండెను. మురాదును నడుమ నుంచి యా జగన్మోహినులు చుట్టును గూరుచుండిరి. అతఁడు సంపూర్ణముగా ముగ్ధుఁడై యొకసుందరి నాలింగనము చేసి యొడలెఱుంగక పడిపోయెను. ఔరంగజేబునకుఁ గావలసిన దిదియే. మురాదు నతఁడు రాత్రివేళనే కారాగారమునఁ బడవైచెను.

అటుతరువాత ఔరంగజేబు రాజచ్ఛత్రమును తలపైఁ దాల్చెను. దారా సింధునదివైపునకుఁ బలాయనము చేసెను. వంగదేశమునుండి సుల్తాన్ సుజా మరల సైన్యము వెంటఁ బెట్టుకొని యుద్ధయాత్ర చేసెను. పరాజయావమాన మింకను మఱవని జస్వంతసింగు మరల రాజస్థానమునుండి స్వసైన్యముగా బయలువెడలెను.

కొన్నిరోజులు ప్రయాణము చేసినతరువాత జస్వాంత సింగుసైన్యము ఆగ్రానగరము చేరెను. ఔరంగజేబు పరాక్రమమునకు మితి లేదు; వానితో బహిరంగయుద్ధముచేయుట జస్వాంతసింగునకు సాధ్యము కాదు. కాఁబట్టి, యతఁడు తరుణమునకు వేచియుండెను. ఔరంగజేబు పరమశత్రువు. మిత్రరూపమున ఆగ్రానగరము ప్రవేశించెను.

యమునానది శోభను, ఆగ్రానగర రామణీయకమును గాంచి యెవరు ముగ్ధులు కాకుందురు? శ్వేతశిలానిర్మితము, అపూర్వ శిల్పఖచితము, అద్వితీయము నగు తాజ్‌మహాల్ సాయంకాలమున నాకాశమందుఁ జిత్తరువునలెఁ గన్పట్టుచుండెను. దానికి నల్వంకలఁ జక్కని బాటలు, ఆరామములు, కేళాకూళులు, పార్శ్వమున నల్లని యమునానదియుఁ గలవు. ఆగ్రాదుర్గము పెద్దది. దానినడుమఁ దెల్లరాతితోఁ గట్టిన చక్కని మోతీమస్జిదు, దివాన్‌ఖానా, దివాన్‌ఆమ్, రంగ్‌మహాల్, షీష్‌మహాలు నున్నవి.

ప్రసిద్ధమైన మయూరసింహాసనమున నేఁడు ఔరంగజేబు పాదుషా యుపవేశించియున్నాఁడు. ప్రాసాద శ్వేతస్తంభపంక్తి మిక్కిలి శోభానంతము. ఎఱ్ఱనిచాందినీనుండి పుష్పదామములతో పాటు మణిమాణిక్యములు వ్రేలాడుచుండెను. ప్రాభాతికకాంతిస్పర్శచే నావులు ధగధగలాడుచుండెను. నల్వంకల మహారాజులు, రాజులు, ఉమ్మరావులు, మన్సబ్

దారులు, భారతవర్షమున నగ్రగణ్యులగువీరులు, ధనవంతులు, పూజ్యులు నగువారు నేఁడు రాజప్రాసాదమును స్వర్లోకమును గావించినారు!

ఆప్రాసాదము నెదుట విశాలశిబిరము సంస్థాపితమై యుండెను. దానికి నాలుగువైపుల వెండికంబములు ప్రకాశించుచుండెను. పైభాగము నెఱ్ఱని వస్త్రము, లోపల మచిలీపట్టణముచీఁటీలు, నిజమైనపుష్పములవలె భ్రమగలిగించు పూవులుచిత్రించినచీఁటీబట్టలు పార్శ్వమున నుండెను. నేలపైఁ దివాచీలు పఱచియుండెను. అందు నేసినపూలు నడచువారికి భ్రాంతి గల్పించుచుండెను.

దాని కావలినుండి దుర్గప్రాకారమువఱకు విజయధ్వజములు, పుష్పమాలికలును మనోహరముగా నుండెను. సైనికులు శ్రేణీబద్ధులై, విజయవాక్యములతో నెల్లర కుత్సాహము గల్గించుచుండిరి. లేఁత నీరెండలో భటుల బందూకులు తళతళలాడుచుండెను. దుర్గప్రాకారములపై అంగ్రేజీ, ఫరాసీ, ఒలాందా సైనికులు పెద్దపెద్ద సిరంగులను ప్రేల్చుచుండిరి. రత్నగర్భయగు భారతవర్షమునందలి రత్నములనుసంగ్రహించుటకు వారలు బహుదూరదేశముననుండి వచ్చియుండిరి. జీతములు పుచ్చుకొనుచు వారు చక్రవర్తివిజయమును నేఁడు ప్రకటించుచుండిరి. దుర్గము వెలుపలను, నగరవీధులందును, ఘట్టములయందును, గృహములయందును, ద్వారములందును, యమునా తీరమునందు జనులు గుంపులు గుంపులుగాఁ గూడి యుండిరి. వారు మంచివస్త్రములను దాల్చి యెల్లెడ విహరించుచుండిరి.

ప్రాచీనాచారముచొప్పున ఔరంగజేబు బంగారముతోఁ దులఁదూఁగెను; తరువాత ప్రధానులగు నుమ్మరాహులుగూడఁ దులఁదూఁగిరి. రాజులు, మన్సబ్దారులు మొదలగువా రొక్కరొక్కరుగా సువర్ణమును, ముత్తెములను, వజ్రములను కానుకగా నొసఁగి పాదుషాను సంతృప్తి చేసిరి.

అటుతరువాత యౌవనోన్మత్తలు, ప్రౌఢలు, లోకమోహినులు నగు వారాంగన లపూర్వ నృత్య సంగీతాదులచే సభాసదులహృదయములను ముగ్ధములు చేసిరి. పెద్దపెద్ద ఉమ్మరాహులయిండ్లలో వివాహములగు[redacted]మున నాట్యాంగనలు సంగీత నృత్యాదికములకుఁ బోవుచుందురు. షాహజహాన్ చక్రవర్తి వారిని తనసన్నిధి నుంచికొని సన్మానించుచు, బేగముల మేడలకుఁ గూడఁ దీసికొనిపోవుచుండువాఁడు. కాని, ఇంద్రియసుఖపరాఙ్ముఖుఁ డగు ఔరంగజేబు వారాంగనలను దనదగ్గఱకుఁగూడ రానిచ్చువాఁడు కాఁడు. అయినను, ఆ పండుగురోజున భోగస్త్రీలుగూడ నాదరము నొందిరి.

తరువాత దుర్గమునకుఁ దూర్పుదిక్కున, అనఁగా యమునాతీరమున మల్లయుద్ధము, ఖడ్గము మొదలగు నానావిధయుద్ధములు జరుగసాగెను. అంతఃపురము పై భాగమునుండి బేగములు చూచుటకువీలుగా నాప్రదేశమునఁ బోరాటములు జరుగును. చివరకు రెండు మత్తగజములపోరు ప్రారంభ మయ్యెను. మధ్యప్రదేశమున రమారమి రెండు మూరల యెత్తుగల మట్టిగోడ యుండెను. దానికి రెండువైపులనుండి రెండు

మదపుటేనుఁగుల మావటివాండ్రు నడపుచుండ జోరుగను ఢీకొనెను. యమునానది కిరుప్రక్కల నున్న జనులు సవిస్మయముగాఁ జాలసేపీ భయంకర యుద్ధము నవలోకించిరి. తొండముల దెబ్బలతోను, దంతాఘాతములతోను రెండుమాతంగముల శరీరములు జర్జరితము లయ్యెను. ఒక్కొక్క యేనుఁగున కిర్వురు పాలకు లుండిరి. ఒకదానిపై మావటీఁడు క్రిందఁ బడి యేనుఁగుకాళ్ళత్రొక్కుడిచే మరణించెను. రెండవదానిపైవాఁడు కూడ నదేవిధముగాఁ బడి హస్తము విఱుగఁగొట్టుకొనెను. మిగిలిన దీను లిర్వురు జీవితాశ విడిచి, యేనుఁగులచే యుద్ధము చేయించుచుండిరి. భార్యాపుత్రులకడఁ గడసారి సెలవు దీసికొని, ధనలోభముచే వారు వచ్చియుండిరి. తరువాతఁ గొంత సేపటికొక మాతంగము రెండవదాని నోడించి, మట్టిగోడ దుమికి దాని వెంటఁబడెను. వానిని విడిపించుటకయి జనులు తోటాలు మొదలగు బాణసంచు కాల్చి విసరిరి. కాని, క్రోధోన్మత్త మాతంగము దానిచే శాంతి నొందక రెండవ దాని వెంటఁ బరుగెత్తుచుండెను. తుదకుఁ బరాజితమైన గజము యమునలో దుమికి, ఈఁది యావలియొడ్డు చేరెను. త్రోవలో నెదురుపడినవారు మృతినొందిరి.

ఈ వేడుకను జూచి నరేంద్రుఁడు మెల్లమెల్లన యమునా పులినమునకుఁ జనెను. ముఖప్రక్షాళనాదికము గావించి యతఁడు కమనీయవృక్షమూలమున శయనించెను. అది మనోహర ప్రదేశము. విశాలతమాలవృక్షములు సూర్యకిరణములను

నివారించుచుండెను. చెట్లకొమ్మలపై పక్షులు దినతాపముచే బడలి, మృదుస్వరముచేఁ గూజితములు సేయుచుండెను. చేరువ చెట్లప్రక్కనఁ బాతిఁతగోరీ యుండెను. అది యచ్చటచ్చట బ్రద్దలై పోయినది. రావి మొదలగు చెట్లు, తీఁగెలు దానిపై మొలచి యున్నవి. దాని కొకప్రక్కనఁ బారశీ భాషలో నీయర్థ మిచ్చు నక్షరములు చెక్కియున్నవి:

'బంధూ! నా పేరు తెలియవలసిన యక్కఱ యేమి? లోకములో నేను దురదృష్టవంతురాలను! నీవు దీనుఁడ వయినపక్షమున నాకోసము బాష్పకణము విడువుము.' చల్లని గాలి యాప్రదేశమును మఱింత శీతలముగఁ జేయుచుండెను. నరేంద్రునకుఁ ద్వరలో నిద్ర పట్టెను.

అతఁ డెంతకాలము నిదురించెనో తెలియదు. నిద్రలో నరేంద్రుఁడు వింతకల గాంచెను. గోరీనుండి ప్రాణి బ్రతికివచ్చినట్లుండెను. ఆమె యవనరమణి. ఆమెముఖము పాలిపోయినది. ఆమెకన్నులు లోపలకుఁ బీకుకొనిపోయినవి. శరీరము క్షీణము, సమస్తావయవములు దుఃఖము సూచించుచుండెను. గోరీమీఁది గీతము నామె పఠించుచున్నట్లుండెను. విచారవ్యంజకగీతారవముచే నరేంద్రునిముకుళితనేత్రములనుండియశ్రుబిందువులు రాలెను. ఆమె వెంటనే యింకొకగీత మారంభించెను. నరేంద్రున కా గీతము, కంఠధ్వని నూతనములు గావు. దీనురాలు జులేఖా గోరీపైఁ గూరుచుండి విషాదగీతము పాడుచుండెను.

నరేంద్రునకు మెలఁకువ వచ్చెను. నలుదిక్కులు నాతఁడు కలయఁ జూచెను. ఎవ్వరు కనఁబడ లేదు. సూర్యుఁ

దస్తమించెను. సంధ్యాలలాటమున నక్షత్రము కళకళలాడు చుండెను. సంధ్యామారుతము మెల్లమెల్లన వీచుచు మృదు గానము చేయుచుండెను. యమునాజలము సంజవేళ మిగుల నీలవర్ణముతోఁ బ్రవహించుచుండెను.

నరేంద్రుఁ డాశ్చర్యపడెను. జులేఖాగీతిక నతఁడు నాల్గు సారులు స్వప్నావస్థలో వినియున్నాఁడు. అతని హృదయ మామె వైపు మొగ్గినదా? అప్పు డాతఁడు హృదయపరిశోధన చేసి కొనెను. అతనియంతరంగము సోమరులతామయము! జులేఖా మానుషి కాదా? దేవకన్యయా! అయినచో నామె మానవ ప్రేమ వాంఛింప నేల? ఆలోచనలో మునిఁగి నరేంద్రుఁడు గోడ కడకుఁ బోయెను. అచ్చట నిజముగా జులేఖా నిలిచియుండెను. క్షీణశరీరమును, పాండురవదనమునుజూడ నామె సమాధినుండి యీవలకు వచ్చినట్లు తోఁచెను. ముఖము పాలిపోయినను కన్నులనుండి వెనుకటికాంతి వెలువడుచుండెను. ఆమె నిస కోపముతోఁ బెదవి కొఱికి యతనిదెస దృష్టి నిగిడ్చెను. ఆమె వక్షోభాగమునుండి బాకుకొన కానవచ్చుచుండెను. ఆమె విషాదగీతిక పాడుచుండెనా? పాడినట్లు తోఁచదు.

'రమ్ము' అన్నట్లు సంజ్ఞ చేసి, జులేఖా ముందు నడవ సాగెను. చాలదూరము గడచినపిమ్మట వారు దుర్గములోఁ బ్రవేశించి, అంతఃపురమునఁ జీకటియింటఁ జొచ్చిరి. అంత వఱకును కర్తవ్య మెఱుఁగక నడచుచున్న నరేంద్రుఁ డక్కడ సంశయగ్రస్తుఁడై "మీ రెవరో నాకుఁ దెలియదు. అంతఃపుర ప్రవేశమునకు నా కనుమతి లేదు" అనెను.

"అంతఃపురములోనికిఁ బోవుటకు నాకధికారము లేని పక్షమున మిమ్ముఁ దీసికొని రాను" అని జులేఖా బదులు పలికెను.

"మీ రెవరో తెలియదు, తెలియనిచోటికి రాను."

"ప్రాణభయమా? మిమ్ము సంహరింపఁ దలఁచినచోఁ దార్తారదేశీయను నే నీబాకు నుపయోగింపలేనా? దీనిని దీసికొనుఁడు. రిక్తహస్తములతో నున్న వనితవెంట వచ్చుటకు వీర పురుషుల కేయాటంక ముండదని తలఁచెదను!" అని కఠిన స్వరమునఁ బలికి జులేఖా నవ్వెను.

కోపముచే నరేంద్రునిముఖ మెఱ్ఱవాఱెను. నిశ్శబ్దముగా నతఁడు జులేఖావెంటఁ జనఁ జొచ్చెను. కొంచెము దూరము పోయినతరువాత నొకచోట నామె యతనికిఁ గొన్ని వస్త్రములు చూపి, కట్టుకొనుఁడనెను. వస్త్రముల నతఁడు కదలించి చూడ నవి యాఁడుదానివి! అచ్చెరువొంది యతఁడు జులేఖావంకఁ జూచెను. ఆమె గంభీరస్వరముతో నిట్లనెను: 'ఆలస్యము చేయవద్దు. మనము వచ్చిన ద్వారము బిగిసినది. నాలుగువైపులను కొజ్జాలు విచ్చుకత్తులతో నిలువఁబడి యున్నారు. ఇది యొక బేగము మేడ. మీరు పురుషులని తెలిసిన వెంటనే ప్రాణములు పోవును.'

నరేంద్రుఁ డాశ్చర్యాన్వితుఁ డయ్యెను. జులేఖా చెప్పిన దంతయు సత్యమే. గత్యంతరము లేక నరేంద్రుఁడు రవిక తొడిగి, పరికిణీ కట్టుకొనెను. జులేఖా నవ్వుచు నతని

తలపై టోపా కట్టెను. ఈయద్భుత వేషముతో నరేంద్రుఁడు జులేఖా వెంటఁ జనెను.

నరేంద్రుఁ డామెవెనుక నడచుచుండెను. ఎన్నియిండ్లు, ఎన్నివాకిళ్ళు దాఁటిపోయినవో తెలియదు. ప్రతిద్వారము కడను విచ్చుకత్తులతో కొజ్జావాండ్రు ఫారా యిచ్చుచుండిరి. ఎవరో పరిచారిక లిటునిటుఁ దిరుగుచుండిరి. జులేఖాను జూచి యందఱు త్రోవ యిచ్చుచుండిరి.

అంతఃపురములోనికిఁ బోవుచున్న కొలఁది నరేంద్రున కాశ్చర్యము హెచ్చఁజొచ్చెను. ఐశ్వర్యము, శిల్పము, విలాస ప్రియత్వమును గాంచి యాతఁడు విస్మితుఁ డయ్యెను. తెల్ల రాతితోఁ గట్టిన గృహములను, కుట్టిమములను, స్తంభములను లెక్కించుటకు వీలు లేకుండెను. ఆహా! రాతిపై నెంత శిల్ప మున్నది! గోడలందు, స్తంభములందు, ప్రకోష్ఠములందు నానావిధ వర్ణములు గల శిలలను లతాపత్రపుష్పరూపములు దాల్చుచున్నట్లు తాపుటచే నిజముగా లతలు గోడలప్రక్క పుష్పించియున్నట్లు కానఁబడుచుండెను. ప్రసూనపరిమళముచేఁ బ్రాసాదము గుమగుమలాడుచుండెను. శ్వేతపీతనీలవర్ణ దీపములు సౌధము వెలుపలను లోపలను బ్రకాశించుచుండెను. అసామాన్యలావణ్యదేహ లగు కొందఱు బేగము లిటునిటుఁ దిరుగుచుండిరి. కొందఱు పువ్వులుకోసి శిరసునం దుంచుకొనుచుండిరి. కొందఱు మధురగానము సేయుచుండిరి. ఉత్సవదిన మగుటచేఁ బ్రాసాదము హర్షముతోను, నృత్యగీతాదులతోను బరిపూర్ణమై యుండెను.

క్రమముగా నరేంద్రుడు 'ఔరంగజేబు' ఉన్నచోటికిఁ జేరెను. అప్పుడు పాదుషా 'పచ్చీసు' ఆడుచుండెను. పచ్చీసు గదులు తెల్లరాతితోఁ గట్టినయిండ్లు; ఒకొక్క బేగము ఒకొక్క పావు! పావులు వివిధవర్ణములుగా నుండుట యవసరము. కాఁబట్టి, యాస్త్రీలు వివిధవర్ణముల దుస్తులు ధరించి యుండిరి.

అక్కడనుండి నరేంద్రుడు జులేఖాతో నొక మందిరముఁ బ్రవేశించెను. ఆరమణీయ గృహమున నలుగురు బేగములు సంగీతము పాడుచు వాద్యములు వాయించుచుండిరి. ఆ యింటికిఁ గొంచెముదూరమున యమునానదివైపునఁ జలునరాతితోఁ గట్టిన వసారాలో వెన్నెల పడుచుండెను. ఆప్రదేశము శాంత రమణీయము. నీలాంబరమున నొకటిరెండు నక్షత్రములు గానవచ్చుచుండెను. శరత్కాల చంద్రుడు సుధావర్షము గురిపించుచు నభోమండలమునకు సౌందర్యమును, లోకమున కానందమును సమకూర్చుచుండెను. సమీపమున నల్లని యమునానది కలకల నినాదముతోఁ బ్రవహించుచుండెను. చంద్రకిరణోజ్జ్వలమైన యమునానదీగర్భముపైఁ జిన్న పడవలు తేలియాడుచుండెను. దక్షిణదిశను తాజ్‌మహాల్ రమణీయముగాఁ గానవచ్చుచుండెను. వసారాలోఁ బరిచారిక తప్ప మరెవ్వరును లేరు. ఆపె వీణ వాయించుచు గానము చేసి, అలసటఁ జెంది, గోడపైఁ దలవాల్చి బహుశః సుఖస్వప్నము గాంచుచుండును. యమునావాత మాపె కేశరాశితోఁ గ్రీడించుచు, నడుమనడుమ వీణెను మోగించు

చుండెను. యమునా కల్లోలము నాకర్ణించుచు శీతలవాయు సుఖము ననుభవించుచుండ నరేంద్రునిహృదయమున భావోదయ మయ్యెను. ఆ నిశీథమున నరేంద్రునకు వంగభూమి యందలి హేమలత కానఁబడెను. ఆమె సుందరవదనము సుధాంశునికన్నను నెక్కువ సుధామయము. నరేంద్రుని హృదయము ముహూర్తమాత్రము హేమలతాపరిపూర్ణ మయ్యెను. అతఁ డాకాశమునంకఁ జూచి నిట్టూర్పు విడిచి యింకొక వైపునకు నడచెను.

అతఁడు వెళ్ళుచున్నదిక్కునఁ గోలాహలము విన వచ్చెను. అంతఃపురమునఁ గలకలము నాకర్ణించి నరేంద్రుఁ డాశ్చర్యము నొంది, కుతూహలముతో నాదిక్కునకే నడవ సాగెను. సమీపించినకొలఁది నరేంద్రునకు నారీకంఠవినిర్గతము లగు మధురవాక్యములును, హాస్యధ్వనులు వినఁబడఁ జొచ్చెను. మఱెంత యాశ్చర్యముతో నతఁ డావైపున కేగి జనాకీర్ణస్థానము జేరెను. ఎదుటఁ బెద్ద ప్రాంగణము; అందుఁ బూల మొక్కలు, పూఁదీఁగెలు కానఁబడెను. నాలుగువైపుల మేడల చాలునుండి పుష్పమాలికలు వ్రేలాడుచుండెను. వృక్షలతాదు లందుఁ బ్రసూనములు వికసించి యుండెను. అక్కడక్కడఁ గుసుమములు రాశీభూతములై యుండెను. చక్కని కేళాకూళులు కరఁగిన వెండి తీఁగెలను నాకాశమున కెత్తుకొనిపోయి, మరల మౌక్తికరూపమున నల్వంకల వెదచల్లుచున్నట్లుండెను. లతాకుంజములందు, వృక్షాంతరాళములందు, నెదుట, ప్రక్కన,

పైన, క్రిందను నానావర్ణసుగంధదీపావళి ప్రకాశించుచుండెను. అమరావతి లజ్జ నొంది నేఁ డీ బేగంమహాలునలె నపూర్వ రూపము ధరించిన ట్లుండెను. ప్రాంగణమున దుకాణములవీధి యున్నది. అందుఁ గ్రయవిక్రయములు మిక్కుటముగా జరుగు చుండెను. అక్కడ నందఱును సుందరులే. అమ్మువారు భారత వర్షమునందలి ప్రధానమహారాజుల, రాజుల, ఉమ్మరావుల భార్యలు. కొనువారు పాదుషా బేగములు. అసూర్యంపశ్యలగు యువతులు క్రయవిక్రయములు సలుపుచుండిరి. వారల సౌంద ర్యమునకు, రసికతకు, వాక్ప్రగల్భతకును నరేంద్రుఁ డాశ్చర్య మొందెను.

ప్రతి సంవత్సరము నౌరోజుదినములలోఁ బాదుషా బేగంమహాలులో నిట్టి యంగళ్ళు పెట్టుదురు. భారతవర్షమందలి మహిళామణు లీ దుకాణములలో వస్తువులను విక్రయింప వచ్చుచుందురు. ఉమ్మరావులు, రాజులును దమ స్త్రీలను బేగములతోఁ బరిచయము కలుగుట కిచ్చుటకు వారిని బంపు దురు. పాదుషా యొకఁడు తప్పఁ బురుషు లెవ్వరు నచటకు రారు. పూర్వాచారప్రకార మీ పండుగరోజులలో దుకాణ ములు పెట్టనిచ్చి ఔరంగజేబు, ఇద్దరు బేగములతో నొక దుకాణమునుండి యింకొక దుకాణమునకుఁ దిరుగుచుండెను. భ్రాతృయుద్ధమున ఔరంగజేబునకు సాయముచేసిన రోషన్- ఆరాకు నిచ్చట నెంతో గౌరవము, నెంతో యధికారమును గలవు. దారాపక్షము నవలంబించిన జహన్-ఆరాకు నేఁటి యుత్సవమున స్థానము లేదు.

విస్మయోత్ఫుల్ల లోచనములతో నరేంద్రుఁడు మహోత్సవమును జూడఁ జొచ్చెను. పాదుషా యొకానొక మొగల్ సుందరికడఁ గొన్ని యలంకారములను, జరీబట్టలను బేరమాడ సాగెను. బేరమున నొకరి కొకరు తీసిపోవువారు కారు.

"నీసరకులు మంచివి కావు. నీ విక్కడ మోసము చేయవచ్చినావా?" అని చక్రవర్తి పలికెను.

"ఎటువంటి బేరగాఁడవు! ఈలాటి సరకులు నీ వెన్నఁడు చూచినట్లు లేదు. పాపము, నీకు వీని సంగతి యెట్లు తెలియును! ఇక్కడ కాదు. ఇంకొక చోటికి నడు. నీకుఁ దగిన వస్తువు లక్కడ దొరకును!" అని యాచతురురాలు పలికెను.

చాలసేపు బజారు చూచి జులేఖాయాదేశానుసారముగా షీష్‌మహల్ ప్రవేశించి నరేంద్రుఁడు వేలువింతలు చూచెను. బేగముల జలక్రీడలకోసము పాదుషా యీమహలు నిర్మించినాఁడు. చలువరాయి పఱచిన కట్టెనుమిుమీఁదుగా నిర్మలోదకము ప్రవహించుచుండెను. అందుఁ జెక్కినరూపములుచూచుచో నీటిక్రింద నెన్నో మత్స్యములుక్రీడించుచున్నట్లుండెను. కేళాకూళులలోనుండి జలము వేగముగా లేచుచు ముత్యాలరాశివలెఁ జుట్టుప్రక్కల రాలుచుండెను. లోకప్పునుండి వ్రేలాడుచున్న వివిధవర్ణదీపములకాంతిలో కుళాయినీరు మిలమిలలాడుచుండెను. నాలుగువైపుల నెన్నో దర్పణములు రత్నఖచితములై గోడలకు బిగించియున్నవి. విలాసలోలుపలగు బేగము లీమందిరమున జలకేళి సలుపుటకై నానా

దేశములనుండి బహుపదార్థములు తెప్పించి పాదుషా యీ యపూర్వభవనమును నిర్మించెను.

వివిధపరిదేశములనుండి హిందూముసల్మాను రమణులు నేఁడంతఃపురమున సమావేశమైనారు. వారిలోఁ జాలమంది షీష్‌మహల్ శోభను విలోకించుచుండిరి. ఇంతలో జులేఖా నరేంద్రునిచేయి పట్టుకొని వారి నడుమగా నొకవైపునకుఁ గొనిపోయి యచ్చటియద్దమున నతని కొక ప్రతిబింబమును జూపెను. నరేంద్రుఁ డులికిపడి, మాౖన్పడి యాఛాయను జూచుచుండెను. కాంతిచే నాకృష్టమైన పతంగమువలె నాతఁ డా ప్రతిబింబమువంకనే నిష్పందదృష్టితో వీక్షించుచుండెను. కొంచెముసేపటి కాతనిశరీరము వణఁకఁజొచ్చెను, హృదయము దడదడఁ గొట్టుకొనెను. ఇంతలో నాప్రతిబింబ మదృశ్య మయ్యెను. అద్దమునఁ గానవచ్చిన రమణి షీష్‌మహాలునుండి వెడలిపోయెను. ఉన్మత్తప్రాయుఁడైన నరేంద్రుఁడు, ఆమె వెంటనే చనెను. ఆపె రాజపుత్ర స్త్రీవేషము ధరించియుండెను. ఆమెను బాగుగాఁ జూచుటకై నరేంద్రుఁడు దగ్గఱకుఁ బోయినను నామెయనావృతహస్తముతప్ప నేమియుఁ గానరాలేదు. మేలిముసుఁగులో నుండుటచే ముఖమండలము కానఁబడలేదు.

అద్దములో నగపడిన స్త్రీనామమును, నివాసమును నరేంద్రుఁడు స్త్రీవేషముతో నేయడుగఁదలఁచెను. కాని యతని నోట మాట రాలేదు. ఆమె హస్తమును బట్టుకొనఁ గోరినను జేయి రాలేదు. అతనిగుండెలు దడదడఁ గొట్టుకొనసాగెను.

ఆమె రాజపుత్రస్త్రీలతో నాబజారునుండి బయలువెడలెను. నరేంద్రుఁ డామెవెంటనే చనెను. ఎన్నోయిళ్ళు, వాకిళ్ళు, తోఁటలు, మేడలు దాఁటి పోయెను. ఒకచోటఁ జాల మేనా లున్నవి. రాజపుత్రకామినులు తమతమ మేనాలలో నెక్కిరి. ఆమెయు మేనాలో నెక్కుట నరేంద్రుఁడు చూచెను. ఇదివఱ కామె యమునానదిని, ఆగ్రాలోని యంతఃపురమును జూచినట్లు లేదు. శిబిర నెక్కునప్పు డామె నదివంకను, ప్రాసాదము వంకను స్థిరదృష్టితోఁ జూచెను. యమునామారుతమున నామె మేలిముసుఁగు కదలెను. తీవ్రదృష్టితో నరేంద్రుఁ డామెదెసఁ జూచెను. ఆతనిహృదయము స్ఫీత మయ్యెను. ఆమె యవ కుంఠనము తొలఁగిపోలేదు. నరేంద్రుని కామెముఖము కానఁ బడలేదు. రాజపుత్రివేషధారిణి మేనా యెక్కి త్వరలో వెడలిపోయెను.

ఆమె హేమలతా? అదే తీరు, అదే నడక, అవే బాహువులు! సుధామయ మగు నామెముఖ మద్దములోఁ బ్రతి ఫలించినది. కాని, హేమలత ఆగ్రాలో బేగంమహాలులోని కెట్లు వచ్చినది? రాజపుత్రాంగనావేష మెందులకు?

## ౨౨

వీరనగర జమీందారుని పెద్దకోటప్రక్క సుందర మైన యుపవన ముండెను. ఆ వనముగుండ నదీతీరమునకు వెళ్ళవచ్చును. అందు బాల్యమున హేమలతా నరేంద్రు లాట

లాడిరి. ఇప్పు డాస్థితి యంతయు మాఱియున్నది. నరేంద్రుఁడు శాంతిహీనహృదయముతో దేశములవెంటఁ దిరుగుచున్నాఁడు. మామ మృతినొందుటచే శ్రీశచంద్రుఁ డిప్పుడు జమీందారు. హేమలత యిప్పుడు బాలిక కాదు; క్రొత్త జమీందారు గృహిణి.

సాయంకాలమున నాయుపవనముగుండ నిద్దఱు స్త్రీలు ఘట్టమునకుఁ బోవుచుండిరి. అం దొకతె హేమలత, రెండవ యామె శైవలిని. హేమలత కిపుడు పదునైదేం డ్లుండ వచ్చును. ఆ తన్వంగి దేహము కోమలము, నుజ్జ్వలము నై యుండెను. ఆమె నయనములు జ్యోతిర్మయములు. కను బొమలు నిగనిగలాడుచుండెను. గండస్థల మారక్తము. ముఖ మండల ముజ్జ్వలము, లావణ్యోపేతము నయినను యౌవన ప్రారంభమున నుండు ప్రఫుల్లత యామెయవయవములందుఁ గానవచ్చుటలేదు. యౌవనోన్మత్తత ముఖమండలమునఁ గాన్పించుటలేదు. మీఁదుమిక్కిలి నామెవదనము చింతా ముద్రితమై యుండెను. శైవలిని కిరువదియైదు వత్సరములు. యువతియయినను నీమెయవయవములయందు యౌవనము కానవచ్చుటలేదు. అనిర్వచనీయమైన పవిత్రకాంతి దృగ్గోచర మగుచుండెను. శైవలిని హేమలతను జెల్లెలివలెఁ బ్రేమించు చుండెను. స్నేహవాక్యములతోఁ గథలుచెప్పుచు ఘట్టము నకుఁ బోవుచుండెను. శైవలిని జీవితము మేఘశూన్యమగు సాయంకాలమువలె గంభీరము, శాంతము. బాల్యకాలమునఁ

హేమలత నరేంద్రునిజూచి సంతోషించుచుండెను. యౌవన ప్రారంభమున నరేంద్రుఁడు తనహృదయము నాక్రమించెనని యామెకుఁ దెలియదు. నరేంద్రునితో శాశ్వతవియోగము సంభవించి తా నింకొకనిభార్యయై నరేంద్రునిమూర్తిని హృదయమునుండి విసర్జింపవలసివచ్చినపుడు హేమలత ప్రేమతత్త్వమును గ్రహింపఁగలిగెను. మర్మభేదియగుదుఃఖ మామె హృదయమును వేధింపసాగెను. ఆమె నవోఢ. ఈవిషయ మెవరితోఁ జెప్పును? ఎవరికిఁ దనదుఃఖము దెలుపును? అయి దనయేఁటనే శైవలిని వితంతు వాయెను. ఆమె యత్తవారి యింటనేయుండి యప్పుడప్పుడు తమ్మునిని జూచి పోవుచుండెను. శైవలినిది కుశాగ్రబుద్ధి. రెండుమూఁడు పర్యాయములు వీర నగరము వచ్చి పిమ్మట నామె హేమలతమనోభావమును గొంచెము కొంచెముగా గ్రహింపఁ గలిగెను. ప్రయత్నము చేసి చూడకపోయినపక్షమునఁ దమ్మునిసంసారము చెడిపోవునని తలఁచి యామె వీరనగరమున నివసింపఁ జొచ్చెను.

శైవలినీసన్నేహప్రవర్తనముచేతను, ప్రబోధవాక్యముల చేతను హేమలతదుఃఖభారము కొంచెము తగ్గినది. శైవలినికి మానవచరిత్ర మెక్కువగాఁ దెలియును. హేమలత నామె యొకసారియుఁ దిరస్కరింప లేదు. చెల్లెలివలె మంచి మాటలతో నూఱడించుచుండును. సారగర్భితములు, స్నేహపూర్ణములు నగు శైవలినికథలు విన్నచో నెవరిదుఃఖము దూరముగాఁ దొలఁగిపోవదు? కథలుచెప్పుటలో శైవలినికి నేర్పు గలదు. ఆమె హేమలతకుఁ బురాణకథలు చెప్పుచుండెడిది.

శైవలినిసహవాసముచేతఁ గ్రమముగా హేమలతకు శాంతికలిగెను. ప్రథమప్రణయరూపమైన కంటకమును హేమలత తనహృదయమునుండి లాఁగివైచెను. కాని, క్లేశముచే లావణ్యము తగ్గిపోయెను. దేహము శుష్కించెను. హేమలత కిప్పుడు దుఃఖము లేదు. కాని స్వభావము శాంతము, గంభీరము నయినది.

ఘట్టమునకుఁ బోవుచు వారు నరేంద్రుని గుఱించి మాటలాడుచుండిరి. హేమలత నరేంద్రుని జిన్నప్పటినుండియు నన్నవలె నెంచుచుండెను. సోదరునకుఁ గష్టము వచ్చినప్పుడు, వార్త తెలియనప్పుడుఁ జెల్లెలికి విచారము గలుగును. హేమలత నరేంద్రునిగూర్చి చింతించుచుండును. కాని, పూర్వమువలె నామెహృదయము చెదరిపోవుట లేదు. సాయంకాలమునందా యుపవనమున నొంటరిగా విచరించుచుండ హేమలతకుఁ జిన్ననాఁటిసంగతులు జ్ఞప్తికి వచ్చెను. భాగీరథీ కలకల నినాదము విన్నప్పుడు, నీలాంబరమునఁ బూర్ణచంద్రుని జూచినప్పుడు నామెకుఁ జిన్ననాఁటి చెలికాఁడు జ్ఞప్తికి వచ్చెను. అప్పుడామెకంట బాష్పకణము కానవచ్చెను. అది భాతృస్నేహమునకు నిదర్శన మని యెంచవలెను. పరభావము తిరోహిత మగుట కయి హేమలత యెంతో యత్నము చేసినది. ఎంతో సహించినది. చాల దుఃఖించినది. అన్యభావము తిరోహిత మయినది.

౨౯

ఘట్టమునుండి మరలివచ్చి వారు గృహకార్యములు ముగించి గదిలోఁ గూరుచుండిరి.

'వదినా! కథలు విని చాల కాల మయినది. నేఁ డవ సరము వచ్చినది. కథ చెప్పవా?' యని హేమలత పలికెను.

'చెప్పుదును. అభ్యంతరము లేదు. ఏకథ చెప్ప మందువు?' అని శైవలిని సస్నేహముగాఁ బలికెను.

'హరిశ్చంద్రమహారాజుకథ విని యెన్నాళ్లో యయి నది; ఆకథ చెప్పు.'

శైవలిని హరిశ్చంద్రునికథ చెప్ప నారంభించెను. మహా భారతకథ నిజముగా నమృతతుల్యము. అందలి యుపాఖ్యాన ములు నెంత లలితములు! నెంత హృదయంగమములు! రాజు రాజ్యము పోయెను. ధనము నశించెను. గౌరవము పోయెను. భార్యాపుత్రులను వెంటఁబెట్టుకొని యతఁడు విపినములందు విచరింపఁ జొచ్చెను. పట్టపుదేవి (చంద్రమతి) శైబ్యమాత్రము మిగిలినది. సుఖసమయమున రమణి చంచలచిత్త; మానిని; ఎంతో యభిమానము చూపును; మిథ్యాకోపము నటించును. కాని జీవనాకాశము మేఘాచ్ఛాదిత మయినప్పుడు, ప్రపంచ సుఖము లన్నియు నాటకాంతమున నాట్యశాలలోని దీపముల వలె నొక్కొక్కటిగా నాఱిపోవునప్పుడు, ఆశ మరీచికారూప మున నానాదిశల కీడ్చి యీడ్చి తుదకు మరుభూమికిఁ గొని పోయి యదృశ్యమయినప్పుడు, బంధువులు త్యజించినప్పుడు,

లక్ష్మి విముఖత నొందినప్పుడు స్త్రీవలె నెవరు శుశ్రూష చేయుదురు? స్త్రీప్రేమ యగాధము, నప్రమేయము! దరిద్రావస్థయందు, కష్టములందు హరిశ్చంద్రునకు శైబ్య సేవచేయుచుండెను. ఆకష్టకథను విని హేమలత కన్నుల నీరు గ్రమ్మెను.

అటుతరువాత నింకను కష్టములు. రాజు శైబ్యను, కుమారుని విక్రయించెను. తన్ను చండాలున కమ్ముకొనెను. మందభాగ్య యగు శైబ్య భర్తృవియోగముతోను, శరీర క్లేశముతోను బుత్రుని బోషించుచుండెను. పాప, మాపుత్రుండకాల మరణము నొందెను! హేమలత దుఃఖము నాపుకొనలేక వదినతొడమ్మపైఁ దల వాల్చి పెద్దపెట్టున రోదనము చేసెను.

కథ సమాప్త మగుచుండెను. హరిశ్చంద్రుఁడు భార్యాపుత్రులను మరలఁ బొందెను. రాజ్యము, సమస్తసంపదలు మరల నతనికి లభించెను. హేమలతహృదయము శాంతి నొందెను. ఇంచుమించుగా గడియసేపిరువురు నిశ్శబ్దముగా నుండిరి. తరువాత హేమలత మెల్లమెల్లన లేచి కిటికీ తెఱచెను. చంద్రకాంతిచే భూమి యుద్దీప్తమై యుండెను. నిశావాతమున వృక్షములు మెల్లమెల్లన తల లాడించుచుండెను. దూరమున గంగా కలకల నినాదము వినవచ్చుచుండెను.

శైవలిని నెమ్మదిగా హేమలతదగ్గఱకు వచ్చి సోదరివలె సస్నేహముగాఁ జేయి పట్టుకొనెను. హేమలత యిట్లు తలపోయుచుండెను: 'ఈచెట్లయాకులలోఁ గనఁబడు మిణుఁగురుఁబురుగులకు సుఖదుఃఖములు కలవు, ఆశ కలదు, ఇచ్ఛ

కలదు. హరిశ్చంద్రమహారాజును గష్టములనుండి యుద్ధరించిన భగవంతుఁ డీ రాత్రివేళ నీపురుగుల కాహారము నిచ్చుచున్నాఁడు. కోర్కెలు తీర్చుచున్నాఁడు. విశాలమైన యీ లోకమందలి సకల జీవజంతువులను నాయనే రక్షించుచున్నాఁడు. భక్తితో నాయనను బూజించెదను.'

తరువాత హేమలత బాలికోచితమైన సరళతతో 'వదినా! దయాసముద్రుఁడు భగవంతుఁడు నిన్నుఁ జిన్నతనములోనే యనాథను జేసినాఁడేమి!' అనెను!

'అందఱకు నన్ని సుఖములు వ్రాసిపెట్టియుండునా? ఆయన నన్ననాథను జేసినాఁడు. కాని, దుఃఖపరవశను జేయలేదు. దేవతుల్యుఁ డగు సోదరుని, నీవంటి సుశీల యగు మఱఁదలిని దయచేసినాఁడు. బంగారువంటి యీ సంసారమున నాకుఁ దావిచ్చినాఁడు. నాకు కోరికలు లేవు. కాని, యొక్కసారి తీర్థయాత్ర చేసి దేవపూజ చేయవలెనను కోరిక మాత్ర మున్నది.

'మనము కాశీ, బృందావనము వెళ్ళుట స్థిరముకాలేదా?'

'అయినది. శ్రీశుఁడు నాబలవంతముమీఁద సమ్మతించినాఁడు. త్వరలోనే ప్రయాణము సాగునని తోఁచుచున్నది.'

'వదినా! నీతోఁ దీర్థయాత్ర నాకు మిక్కిలి సంతోషకరము. కొన్ని దేశములు చూడవచ్చును. కొన్ని తీర్థములు సేవించవచ్చును. నరేంద్రుఁడు పశ్చిమమున నున్నాఁడని తెలియవచ్చినది. వీలున్న నతనినిగూడఁ జూడవచ్చును.'

'చూడవచ్చును.'

ఇంతలో శ్రీశచంద్రుఁడు లోపలికి వచ్చెను. శైవలిని యొక ప్రక్కగా బయటకుఁ బోయెను. ఆమెముఖము చింతా రేఖాంకితమై యుండెను.

శైవలినిచింత యేమి? ఆమె యిట్లు భావించుచుండెను. 'హేమా! నన్ను నీవు అనాధయనియు, దురదృష్టవంతురాలనియుఁ దలఁచితివి. కాని, స్త్రీలలో నెవ్వరును సహింపని కష్టము నీవు సహించితివి. ఆదెబ్బకు నీగుండె తల్లడిల్లినది. నీజీవిత మింకిపోయినది. ఈ వయస్సున దుర్బలముగా నున్న నీశరీరమును, నెండిపోయిన పెదవులను జూచిన గుండె యదరుచున్నది. నీవిచారము మావాని కెంతమాత్రము తెలియదు. నీవు చిన్నదానవు. నీ విచారము తొలఁగిపోయిన దని తలఁచుచున్నావు. కాని, నరేంద్రుని చూచినపక్షమున నేమగునో తెలియదు. భగవంతుఁడు, అనాధనాథుఁడు. అసహాయులకు సహాయుఁ డగును గాక!'

30

శైవలిని మరల గృహములోని కరుదెంచి, సోదరుని పీటపైఁ గూరుచుండఁజేసి వడ్డించి తాను ప్రక్కగా నిలిచి వీవనతో విసరుచుండెను. హేమలత యాయింటినుండి బయటకువచ్చి, గుమ్మముప్రక్క నిలిచి భర్త భుజించుట చూచుచుండెను.

అప్పా తమ్ములకు చాలసేపు సంభాషణ జరిగెను. శ్రీశచంద్రుని భోజన మాయెను. చాల రాత్రి యగుటచే నతఁడు శయనింప నుద్యమించెను. శైవలిని వేఱొకగదిలోనికిఁ బోయెను.

అంతట హేమలత నెమ్మదిగా భర్త దగ్గఱకు వచ్చి వినయముతోఁ దాంబూల మిచ్చెను. నేఁడు శ్రీశునిహృదయ మాహ్లాదితమై యున్నది. అతఁడు సంతోషము మఱుఁగుపఱచి 'తాంబూలము వేసికోను' అని పలికెను.

'ఎందుచేత?'

'నీ నోటివెంట మాటలు రావెందుచేత? ఎంతకాల మీ శుష్కముఖమునుజూతును? ఎప్పుడు నీశరీరము కొంచెము స్వస్థ మగును? ఎప్పుడు నీముఖము వికాసముగా నుండఁ గాంతును?'

'నాశరీర మిప్పుడు స్వస్థముగానే యున్నది.'

'అవును, ఈశ్వరానుగ్రహముచే శరీరము కొంచెము స్వస్థముగా నున్నది. కాని, మనస్సులో నుల్లాసమో?'

'ఉల్లాస మేమిటి?'

'మనస్సునకు వికాసము లేదా? నీవు సుఖముగా నుండఁగా నెప్పుడు చూతును?!'

'నాకు మనఃక్లేశము లేదు. కాని, వదిన చెప్పిన విచార కరమైన కథ వినుటచేతఁ గన్నీటిబొట్టు రాలినది.'

శ్రీశుఁ డీ మాటలకు సంతుష్టినొందక 'చిఱునగవుతో నున్న నీముఖ మెప్పుడు చూతును!' అనెను.

'హేమలత ప్రత్యుత్తర మీయలేక నేలవంకఁ జూచుచుఁ జప్పన నొక సంగతి జ్ఞప్తికివచ్చుటచేఁ జిఱునవ్వునవ్వి 'మీ ప్రతిజ్ఞ నెఱవేర్చినప్పుడు' అని పలికెను.

'ఏమి ప్రతిజ్ఞ?'

'తీర్థయాత్ర.''

శ్రీశచంద్రుఁడు కొంచెము సిగ్గుపడెను. శైవలిని హేమలతల బలవంతముచే నతఁడు తీర్థయాత్రకెన్నోసారు లంగీకరించెను. కాని, యింతవఱకెట్టి యత్నము చేయలేదు. నేఁడు హేమలతమాటకు కొంచె మూరకుండి 'యథార్థముగా తీర్థయాత్ర చేయుటవలన నీశరీరము, మనస్సు స్వస్థతఁ జెందు పక్షమునఁ దప్పక పోవుదము. రేపటినుండియే నేను యాత్రకు వలయు యత్నము చేసెదను' అని యతఁడు పలికెను.

హేమలత సంతృప్తిఁ జెందెను. ఆమెముఖ మించుక ప్రఫుల్లమగుటఁ గాంచి శ్రీశుఁ డానందించి, ఆక్షీణతనూలతను హృదయమునఁ జేర్చుకొని సస్నేహముగా ముద్దాడెను.

పశ్చిమమునకుఁ దరువాత కొద్దిరోజులకే శ్రీశచంద్రుఁడు తీర్థసేవకై సపరివారముగా బయలుదేఱెను. గంగాతీరమున నుండు తీర్థముల నెల్ల సేవించి మధురాబృందావనమునకుఁ బోవు నూహతో వారు ఆగ్రా చేరిరి. అచ్చట శ్రీశచంద్రుఁడు ప్రముఖులగు హిందూరాజులతో సంభాషించెను. అందులో నొకప్రభువు బలవంతముచే నతఁడు తన కుటుంబము నీ రాజు కుటుంబముతో నొరోజు పండుగనాఁడు ప్రాసాదమునకుఁ

బంపెను. విధిలేక హేమలత రాజపుత్రాంగనా వేషముధరించి రాజపుత్రస్త్రీలతో ఆగ్రాయందలి బేగమ్‌మహాలునకు వెళ్లెను.

## ౩౧

నరేంద్రుఁడు ఆగ్రాదుర్గమున నొక యుద్ధములో హేమలతాముఖచ్ఛవిని విలోకించి యించుమించుగా మతిఁ గోల్పోయెను. చాలతడవు శాంతనభముదెసను, శాంతప్రవాహము వంకను జూచుచు మెల్లగా నతఁడు తనబసకుఁ బోయెను.

నరేంద్రుఁ డింటిలోఁ బ్రవేశించెను. దీపము వెలుఁగుచుండెను. జను లెవ్వరు లేరు. నరేంద్రుఁడు తలుపు మూసి స్త్రీవేషము తీసివేయుచుండఁగాఁ జటుక్కున నాతని జేబులో నుండి కాగితము నేలపైఁ బడెను. అతఁడు దానిని పైకిఁ దీసి చూడఁగా నది ఉర్దూభాషలో లిఖించినది. దీపముకడఁ గూర్చుండి యాకాగితము చదువ నారంభించెను. ఎక్కువదూరము చదువకమునుపే యది జులేఖా వ్రాసిన యుత్తరమని యతఁడు తెలిసికొనెను. అంతట నరేంద్రుఁ డెంతో యాశ్చర్యపడి యింకను జదువసాగెను. ఉత్తర మిట్లుండెను:

నరేంద్రా! నేను వెఱ్ఱిదానను, నిర్భాగ్యురాలను! అందుచేతనే యీజాబు వ్రాసితిని. నా కన్నుల కేమియుఁ గానఁబడుట లేదు; తల తిరుగుచున్నది. అయినను, మరణమునకుఁ బూర్వ మొకసారి మనసులోని మాటలు మీకుఁ జెప్పి

పోయెదను. మీ రీయుత్తరమును జదువునప్పటి కీ దీనురా లీ లోకమున నుండదు!

'నేను షాహజహాన్ పాదుషాగారి పెద్దకూఁతురు జహా నారా బేగముగారి పరిచారికను. కాశీయుద్ధమునాఁడు కార్యవశ మున నేను, 'మస్రూర్' అను కొజ్జావాఁడును జయసింగుమహా రాజుగారి శిబిరమునం దుంటిమి. గాయము తగిలి, అచేతనా వస్థయందున్న మిమ్మప్పు డచ్చటకుఁ గొనివచ్చిరి. దర్శించి యానాఁటినుండి హృదయమున కాలసర్పమును ధరించితిని.

'ప్రతి దినము, ప్రతి సప్తాహము నే నీహాలాహలము పానము చేయుచుంటిని; నిరంతరము మీ రోగశయ్యమీఁద వంగి యుండుదానను; నిద్రావిహీనస్నై, నిద్రించుచున్న మీ శరీరమును జూచుచుండుదానను; ఉన్నత లలాటమును, రక్త వర్ణము లగు పెదవులను విలోకించుచుందును; కొంచె మెచ్చు తగ్గుగా నేను బిచ్చిదాన నయితిని; రోగవశమున నెప్పుడయిన మీరు నన్నుఁ జూచి తిరస్కరించినప్పుడు లోలోన నిశ్శబ్దముగా దుఃఖింతును; జబ్బులో నెన్నఁడయిన మీరు సస్నేహముగా నాహస్తముపట్టుకొన్నప్పుడు నాశరీరము పులకరింప వెఱ్ఱిదాన నయిపోవుదును; ఇంటిలో నెవ్వరును లేనప్పుడు నే నావేశ ముతో మిమ్ము ముద్దుపెట్టుకొనుచుందును; క్షమింపుఁడు, నేను బిచ్చిదానను!

'క్రమముగా కాశీనుండి పడవలో మిమ్ము దఢ్లీనగరము నకుఁ గొనివచ్చిరి. ఉపాయముగా మిమ్ము నేను రాజభవ

నములోనికిఁ దీసికొనిపోయి యాగదిలో నుంచితిని. కేవలము మిమ్ముఁ జూచుచుండుటకే యాయింట నుంచితిని. మీముఖమును వీక్షించి వీక్షించి, రాత్రి గడపుచుండుదానను. మనసు నిలుపుకొనలేక యచేతనముగా నున్న మీ శరీరము నప్పుడప్పుడు నా హృదయమునఁ దాల్చుచుండుదానను!

'దురాత్ముఁడు మన్సూర్ మీసంగతి బేగముసాహెబాకుఁ దెలియఁజేసెను. అంతఃపురములోనికి మగవానిని గొనివచ్చితి నని విని యామె మన కరున్నిసను ప్రాణదండన విధించెను. మరల బేగముసాహెబా కాతఁడు మీ పరాక్రమమును, జక్కఁదనమును దెలిపెను. బేగము వెనుకటియానతి రద్దుచేసి నన్నుఁ జెఱసాలయం దుంచి, మీ కారోగ్యము కలిగినతరువాత మనను స్వయముగా విచారణచేయునట్లు నియమించెను.

'నేను జెఱలో రేయుంబవళు లొంటరిగా నుంటిని. మిమ్ముఁ జూడకుండుటచే నా కసహ్యావేదన కలుగుచుండెను. సహింపలేక తుదకు ద్వారరక్షకులను, మన్సూరును మంచి చేసికొని రహస్యముగా మిమ్ముఁ గాంచి పోవుచుండుదానను. మీకు స్వస్థత కలిగి యప్పుడప్పుడు మీరు నావైపు చూచుట జ్ఞప్తియం దున్నదా? నే నెక్కువసేపు నిలుచుటకు వీలులేకుండెను, మాటలాడుటకును వీలు లేకుండెను, కఠినుఁడు మన్సూరు శీఘ్రముగా నన్ను బంధనశాలకుఁ బంపెడివాఁడు. అచ్చటికేగి మీదివ్యమూర్తినిగూర్చి చింతించుచుందును.

'క్రమక్రమముగా విచారణరోజు వచ్చెను. ఆరోజు మీకు జ్ఞాపక మున్నదా? సింహాసనముమీఁదఁ గూరుచున్న జహానారాకు నాలుగువైపుల సహచరీసమూహము నిలిచి యుండెను; అది మీకు జ్ఞప్తియందున్నదా? బేగంసాహెబా యారోజునసే మిమ్ముఁ జూచెను. ఆమె విధించిన కఠినశిక్ష జ్ఞాపక మున్నదా? ఓషాహజాదీ! నాపాపమున కిది తగినశిక్ష యేనా? నీవుగూడ నాఁడుదానవు, నీహృదయము పాషాణమా? ఎప్పుడు సంచలింపలేదా? నేను ఖైదీని; నాకు స్వాతంత్ర్యము లేదు. అందుచే నాపాపమునకు శిక్ష విధించితివి! నీవో, సింహాసనముమీఁద గూరుచుండు రాజపుత్రికవు; నాకంటె నీవు ఘోరపాపాత్మురాలవు! అందుకు శిక్ష లేదా?

ఉపాయముచే నే నారాత్రి దుర్గమునుండి పలాయితనైతిని. అటుతరువాత సైనికవేషమున మీరు ఢిల్లీనగరము విడిచిపెట్టినారు. ఈదీనురాలు దివానా తార్తారబాలుని పేరు పెట్టుకొని, మీ వెంట వచ్చినది. నరేంద్రా! మీ ప్రణయభాజనము నగుదువను నాశ లేదు. దివారాత్రిములు మీసన్నిధి నుందు ననియును, దప్పిగొన్న చాతకమువలె మీముఖమును నిరీక్షించుచుందు ననియు, పగలు మీయమృతవాక్కుల నాలకింతుననియు, రాత్రి రెండుజాములవఱకు నప్పుడప్పుడు ప్రభాతమువఱకును నిద్రావస్థలోనున్న మిమ్ముఁ జూచుచుఁ బిపాస తొలఁగించుకొందు ననియు నేను ఢిల్లీనగరమునుండి సిప్రా తీరమునకు, సిప్రానుండి రాజస్థానమునకు పయనము చేసితిని.

ఈసుఖాశతో నీదీనురాలు పోవుటకు వెనుదీయు ప్రదేశము ప్రపంచమునఁ గాని, నరకమునఁ గాని యుండునా?

౩౨

నరేంద్రా! మిమ్ముఁ బ్రేమించితిని. మీ ప్రణయభాజనమైనహిందూయువతిని జూచితిని. మీరు ప్రేమకయి యున్మత్తత నొందలేదు. నేను తార్తార దేశసంజాతను. అచ్చటివారి కందఱకు నుగ్రభావము. నేనుగూడఁ జిన్నతనమునుండి యుగ్రస్వభావురాలను. నాకుఁ గోపము వచ్చినప్పుడు బాలకులు సైత మాట విడిచి, బాలికలకు దూరముగాఁ దొలఁగిపోవుదురు. యుద్ధమున నాతండ్రి మరణించెను. నేను బందీనై దక్షిణ చక్రవర్తికి విక్రీత నయితిని. స్వాతంత్ర్యము పోయెను. కాని, ఉగ్రస్వభావము పోలేదు. భారతవర్షమున సూర్యతాపముచే నారక్తముష్ణతర మయ్యెను. అంతఃపురమున తార్తారకన్యల కేమి పనియో మీకుఁ దెలియును. మేము బేగములమహాలులు రక్షింతుము. కత్తిని, చుఱకత్తి పట్టుటలో నేర్పు లేనివారము కాము. బేగముల యానతిచొప్పున నెన్నెన్ని భయంకర కార్యములు చేసితినో లోకము సాధారణముగా నెఱుఁగునా! నే నీవ్యాపారములందు మునిఁగి తేలుచు నెవ్వరికిని సాధ్యము కాని పనులు గూడ సాధించుచుంటిని. ఈ నా నేర్పునకే సాహెబా నాయుగ్రస్వభావమును సహించుచుండెను.

'ఢిల్లీ విడిచి నేను మీ వెంటవచ్చినపుడును నాస్వభావ మెంతమాత్రము మాఱలేదు; ఉన్మత్తనై మీతో వచ్చితిని.

'ఉదయపుర తటాకమున పడవలో సాయంకాలమున వెన్నెలలో విహరించుట జ్ఞప్తియం దున్నదా? మీ రెల్లప్పుడు విచారగ్రస్తులై యున్నట్లు కానఁబడుచుండిరి. కాని, మీ రేమి భావించుచుంటిరో నేను నిశ్చయింపలేకుంటిని. ఆనాఁడు పడవలో మీరు నాతొడపైఁ దలమోపి పండుకొని చంద్రుని వంకఁ జూచుచుండుట స్మృతియం దున్నదా? నే నాసమయమునఁ జంద్రకిరణోజ్జ్వల మైన మీముఖమును జూచుచు, జుట్టు సవరించుచు, మీ వ్రేలు పట్టుకొని క్రీడించుచుంటిని. ఆకస్మికముగ మీరు నిట్టూర్పు పుచ్చి 'హేమా! ఈజన్మములో నిన్నిఁకఁ జూచుట తటస్థించునా?' అంటిరి. బాంగ్లా భాష బాగుగా నెఱుఁగను. కాని, యీవిషయము గ్రహించితి. నామనస్సులో ననుమాన ముద్భవించెను.

'స్త్రీల మనస్సున ననుమాన ముదయించు నేని శీఘ్రముగా నివృత్తము కానేరదు. మీ హేమనుగూర్చి తెలిసికొనుటకయి దివారాత్రము లుత్సుకతతో నుంటిని. మీ కాగితములను దొంగతనముగాఁ జదువుచుంటిని. మాటపైమాట మీఁద వీరనగరవృత్తాంతము లన్నిటిని మీకడనుండి బయటకు లాగితిని. అంతట హేమను మీహృదయమునుండి తొలఁగించి యాస్థానము నేలుటకై నాహృదయము జ్వలింపఁ జొచ్చెను.

హిందూధర్మమున మీనిష్ఠను గ్రహించి యేకలింగ దేవాలయమున గోసాయీలకడ కభీష్టసిద్ధికై పోయినాను. మొదట నేను దర్శించిన యతీంద్రుడు పరమధార్మికుఁడు. నా ప్రస్తావన నంతయు విని నన్ను వెడలఁగొట్టెను. ఈవిధముగా ముగ్వురు నలుగురిచే నవమానితనై తుదకు శైలేశ్వరుని యొద్ద కేగితిని. ఆయన పెద్దలంచమునకు సమ్మతించెను. తోడనే నేను మూడువందల ముద్రల వెలగల వజ్రవలయము నాయనచేత నిడి వేయిముద్రల విలువ గల ముక్తాహారమును గదలించుచు ని ట్లంటిని: 'ఛలముననో, బలముననో, కౌశలముననో మీరు హేమలతతలంపును నరేంద్రుఁడు విడుచునట్లును, ముసల్మానుధర్మము నవలంబించునట్లును, నన్ను బరిగ్రహించునట్లును నొనర్చితిరేని యీముత్తెపుదండను నా చేతులతో మీమెడను నుంచెదను.'

'ఇంతధన మెక్కడ లభించె నని మీరు ప్రశ్నింతురు. జహానారాబేగము సాహెబాగారి సేనయందుండువారికి ధనాభావము లేదు. దేశములోని పెద్దవారు పాదుషాకు నేవిన్నపము చేయవలె నన్నను బేగముసాహెబాగారిని జూడకుండ సమకూడునది కాదు. ఉన్నతోద్యోగములు కోరి కొందఱు, ప్రజలను పీడించిన వాని క్షమాపణకై కొందఱు, పరుల జాగీరు సంగ్రహించి సనదులు పొందుటకై కొందఱు, యుద్ధమున నోడినయోధుని క్షమాపణకుఁ గొందఱు, పాదుషాకు తమపై గలిగిన యకారణక్రోధనివారణకుఁ గొందఱు ధనము,

ముత్యములు, వజ్రములు బేగముసాహెబాగారి సన్నిధికిఁ బంపి తమతమ విన్నపముల నెఱిఁగించుచుందురు. పరిచారిక లకుఁగూడ లంచము ముట్టకపోదు.'

'అటుపిమ్మట నైలేశ్వరుఁ డవలంబించిన యుపాయ ములను మీరెఱుఁగుదురు. ఆయుపాయములు విఫలము లయ్యెను. నాయాశ లడుగంటెను. రెండుసారులు నిజవేష ముతో గుహలో మీయెదుటకు వచ్చితిని. మీరు మద్యపా నోన్మత్తులై యుంటిరి. నన్నుఁ జూచితిరో లేదో తెలియదు. మొదటినాఁడు మీప్రాణము తీయ నుద్యుక్తురాల నయితిని. చేతినుండి కత్తి జాఱిపడెను. తారాహస్తమునుండి కత్తి జాఱుట యెన్నఁ డెఱుఁగను. నాక్షీణతయు నెఱుఁగను.'

'పిమ్మట మీతో మరల ఆగ్రాకు వచ్చితిని. విచా రింపఁగా, వంగదేశమునుండి ధనాఢ్యుఁ డగు జమీందా రొకఁడు వచ్చె నని తెలిసినది. నీ హేమను జూచినాను. యాతన సహింపలేకపోతిని.. మధురలో గోలకనాథుని మందిర మునకు జాముర్రాత్రి యయినపిమ్మటఁ బోమ్ము. పరస్త్రీని మరలఁ జూడుము. నీవు నన్ను నిర్భాగ్యురాలను జేసితివి. నిన్ను నేను నిర్భాగ్యుని జేసెదను. అందుకే యీవృత్తాంతము పంపి నాను. అందుకే ఆగ్రాదుర్గమునకుఁ బోయి హేమలతను జూచి నాను!

'నాకు మరణముసమీపించినది. అయినను ప్రతీకారము చేయుట తారాధర్మము. నేను స్వధర్మమును మఱచిపో లేదు; నారక్తము శీతలించలేదు.

'ఊఁ! నాతల తిరుగుచున్నది! ఈతృష్ణార్తకు స్నేహ వారి దానముచేయుచో ముసల్మాన్‌స్త్రీ కృతఘ్నురాలు కానేరదు. జీవిత మున్నంతవఱకుఁ గాని, ఆసంగతివలన నేమి లాభము? నరేంద్రా! నాకీజన్మమునకు సెలవిమ్ము! మరణానంతర మొకపర్యాయము దర్శన మగునేని; ఓకఠినుఁడా! ఈ హృదయమును ఛేదించి, అంతర్భాగమును నీకుఁ జూపెదను. నరేంద్రా! అప్పుడు నీవు నన్నుఁ బ్రేమింతువు; ప్రేమింపనిచో, ఈ చురకత్తితో నీ పాషాణహృదయమును ఛేదించెదను!—ఉన్మాదిని జులేఖా.'

ప్రతికాపఠనము ముగిసెను. నరేంద్రుని నేత్రములనుండి బాష్పకణములు రాలెను. నిశ్శబ్దముగా నేమో చింతించుచు నతఁడు వెలుపలికిఁ జనెను. ఇంచుమించుగాఁ దెల్లవాఱవచ్చుచుండెను. నగరము శాంతముగా నుండెను. నరేంద్రుఁడు కాలినడకను జాలదూరము పోవఁగా నెదుట యమునానది కానఁబడెను.

నిట్టూర్పు విడిచి యతఁడు మరలిపోవ నెంచుచుండఁగా యమునాతీరమునఁ గొందఱుజనులుగుమిగూడి యొక శవమును బాఁతిపెట్టుచుండిరి. నరేంద్రుఁడు ప్రశ్నచేయఁగా వారిలో నొకఁడిట్లు పలికెను:'మరణమునొందినస్త్రీ పూర్వము బేగము మహాలులో దాసి కాఫరుసైనికునితో వ్యభిచరించి లేచి పోయెను. ఆతఁడీమె నిప్పుడు వధించినట్లు తోఁచుచున్నది. దాసి ఱొమ్మున, ఈవాఁడిచురకత్తి చూచినాను. దౌర్భాగ్యురాలి పేరు జులేఖా.'

శాంతముగాఁ బ్రవహించు యమునాకూలమున సాయం సమయమున మధురానగరము సుందరముగాఁ గానఁబడు చుండెను. సూర్యుఁ డస్తమించి చాలసేపాయెను. ఆకసమున నొక్కటొక్కటిగా నక్షత్రము లుదయించుచుండెను.

సాంధ్యవాయువు మెల్లమెల్లన యమునా విశాలవక్షము మీఁదుగా వీచుచుండెను. జగము శీతలము, శాంతము నై యుండెను. పాషాణములతోఁ గట్టిన సోపానములు నీటిలోనికి దిగి యుండెను. అవి వృక్షముల, లతాగృహముల సందులనుండి నేత్రగోచర మగుచుండెను.

క్రమక్రమముగాఁ బ్రొద్దుపోవుచుండెను. హేమంతకాల చంద్రికలో నదీ నగర వృక్ష మందిరాదు లతిమనోహరముగా నుండెను. నీలాంబరమున సుధాంశుఁడు మందముగాఁ దేలిపోవు చున్న ట్లుండెను. నదీగర్భమున నొకటి రెండు పడవలు తేలి యాడుచుండెను. నది కిరువంకల సాంద్రనీలవృక్షశ్రేణి కలదు. చంద్రుని సుధావర్షముచే లోక మంతయుఁ దృప్తినొంది సుఖ ముగా నిద్రించుచున్నలాగున బోధపడుచుండెను.

ఇంతలో సాయంసమయపూజ యారంభ మయ్యెను. అనేక దేవాలయములనుండి శంఖధ్వనులు, ఘంటారవములును వినఁబడసాగెను. వాయుప్రసారముచే బహుదూరమువఱకు వినఁబడు నాధ్వని యెంతో మనోహరముగ నుండెను. ఆఘంటా

రవము మెల్లన నదీగర్భమునఁ బట్టణమున నల్వంకలను విస్తరిల్లి మందమందముగా ననంతనీలాకాశము నధిరోహింపఁ దొడఁగెను. అర్చకుల మానసము లొకింతసేపు ప్రాపంచిక చింత విస్మరించి, ఆపవిత్రఘంటారవముతో గగనముపైఁ బరుగులెత్తఁ జొచ్చెను.

నదీతీరమున శిలాసోపానములమీఁద నున్న దేవాలయమున హారతి యిచ్చుచుండిరి. బ్రాహ్మణు లనేకులు సర్చకులు నుచ్చైస్స్వరమున స్తవములు చేయుచుండిరి. యాత్రికులు నిలువఁబడి యుండిరి. యాత్రకు వచ్చినవారిలో స్త్రీలు హెచ్చు. బహుదూరమునుండి నానా దేశములనుండి వచ్చి యీపవిత్రస్థానమున గుమి గూడి నేఁడు దేవుని సందర్శించి జీవితము ధన్య మయినట్లు భావించిరి.

హారతి యయ్యెను. యాత్ర చేయవచ్చినవారు తమతమ బసల కరిగిరి. ఇరువురు స్త్రీలు మాత్రి మామందిర పార్శ్వమునఁగల వృక్షతలమున నిలిచి సంభాషించుచుండిరి.

'వదినా! నేఁడు జాముపొద్దుపోయినతరువాత నీ దేవాలయమున నరేంద్రుఁడుకనఁబడునసిముసల్మాన్ స్త్రీ చెప్పినది. అట్లుకాలే దేమి?' అని హేమలత మందహాసముతో ననెను.

శైవలిని బుద్ధిమంతురాలు. హేమలత యామాటలు నవ్వుచుఁ బలికినను నామెహృదయము నేఁడు నిజముగా నుద్విగ్నమైయున్న దనియు, నరేంద్రుఁడు వచ్చునను నాశతో నామెగుండె దడదడఁ గొట్టుకొనుచున్న దనియు, శరీరము వణఁకుచున్న దనియు శైవలిని గ్రహింపఁగలిగెను.

'ఈరోజున నేమి మూడ నున్నదో తెలియదు. హేమలత బాలికయే యనవచ్చును. నరేంద్రునిఁ జూచినచో మరల వెనుకటి సంగతులు జ్ఞప్తికి వచ్చును. ఆ దుర్భర వేదన బాలిక సహింపఁగలదా?' అని తలఁచి శైవలిని యిట్లనెను: 'ఆ పిచ్చిదానిమాటలు నమ్మెదువా? నరేంద్రుఁ డెక్కడ! ఏదేశముననున్నాఁడో! అతనిసమావేశము మధురలో నెట్లు తటస్థించు నని యాశపడుచున్నావు?'

'కాని జులేఖామాటలు సరిగా నున్నవి.'

'ఈప్రకారముగా నే వారలు వట్టియాశలు కలిగింతురు. రెండు నిజపుమాటలు చెప్పిన నొక యసత్యవాక్య వచ్చును. మన దాసి రాలే దేమి? నేను త్రోవ సరిగా గుర్తింపలేను; కావున్న మన మిద్దఱ మింటికిఁ బోయియుందుము.'

'చూడు వదినా! ఇది మన వీరనగరము, ఇది మన గంగానది యనిపించుచున్నది. చిన్నతనమున వెన్నెలలో గంగయొడ్డున నీతోను మఱి-మఱి-మఱి యందఱతోను నాటలాడిన సంగతి జ్ఞప్తికి వచ్చుచున్నది.'

శైవలిని ముఖము గాంభీర్యమువహించెను. దాసివచ్చుటకుఁ దడవగుచుండె నని యామె మిగుల వ్యాకులముగా నుండెను. హేమలత యాసంగతి లక్ష్యపెట్టక మరల నిట్లు చెప్పసాగెను: 'వదినా! అదిగో, పడవ బాణవేగమున నెట్లు వచ్చుచున్నదో చూడు! పల్లెవాండ్రు దృఢముగా తెడ్డు వేయుచున్నారు. పడవ యెగిరి వచ్చుచున్న ట్లున్నది.'

శైవలిని యాన్నైపు చూచెను. ఆమె భయము ద్విగుణీకృత మయ్యెను. ఆమె భయపడినట్లే జరిగెను. ఘట్టమునకు రెండుగజముల దూరమునఁ బడవ నిలువఁగా నైనిఁ డందులోనుండి తీరమున దుమికెను. అతఁడు నరేంద్రుఁడు.

హేమలత వృక్షచ్ఛాయలోనుండెను. నరేంద్రుఁ డామెను జూడక మందిరములోని కరిగెను. హేమలత మాత్రము నరేంద్రుని జూచినది. తోడనే శరీరమందలి రక్తము ముఖమున కెక్కఁగా, నేత్ర శ్రవణ లలాట కంఠము లొక్కపెట్టున నెఱ్ఱవాఱెను. పరక్షణములో వదనమండలము పాండురమయ్యెను. దేహము కంపమునొందఁజొచ్చెను. ఫాలమునుండి స్వేదబిందువులు రాలెను.

శైవలిని భయపడి హేమలతను బట్టుకొనెను. హేమ కొంత శాంతినొందిన పిమ్మట శైవలిని గంభీరముగా నిట్లనెను:

'హేమా! నిన్ను నేను చెల్లెలికంటె నెక్కువగాఁ బ్రేమించినాను. నేఁడు నీవు నరేంద్రునకుఁ గానఁబడక నా మాట విని యింటికినడు. నీవు నన్ను సోదరికంటె నెక్కువగాఁ బ్రేమింతువు. నా యీమాటవిని యింటికి నడు. నీవు చిన్నదానవు; నీమనస్సు నీకే తెలియదు. నరేంద్రునితో నీవు సంభాషించినయెడల నేమి చిక్కు సంభవించునో దేవున కెఱుక!'

అవనతవదనయైన హేమలత చాలతడవు నేలవంకఁ జూడసాగెను. కందోయినుండి రెండుబాష్పములు స్వచ్ఛసికతాతలమున రాలి యదృశ్యమయ్యెను. అంత నామె మొగ

మెత్తెను. అప్పుడుద్వేగచిహ్నము లేమాత్రము లేవు. ఆమె ముఖము నిర్మలము, శాంతము, స్థిరము నై యుండెను. నేత్రమునమాత్ర మశ్రుకణము కూడుకొన్నది.

హేమలత శైవలిని జూచి యిట్లనెను: 'వదినా! నీవు నా ప్రాణప్రియవు; నన్ను విశ్వసింపకుండవద్దు. అనుదినము నీవు నా కెన్నిధర్మములు బోధించినావో, నేను వానిని మఱవ లేదు. వదినా! నేను విశ్వాసఘాతుకురాలను గాను. నేడు దేవతారాధన జేసి యీపుణ్యభూమిపై నిలిచి యీపవిత్ర దేవాలయమున విశ్వాసము విడువను. నాకుఁ బ్రధాన దేవత యైన భర్త నన్నుఁ బ్రేమించుచుండఁగా నాజీవితపు ధననిధి యగు వారికి విశ్వాసఘాతుకురాలను గానేరను. వదినా! నా యెడ ననుమానము వలదు. నన్ను దుర్మార్గురాలినిగా నెంచ వద్దు. నీవు నన్నుఁ దప్పఁదలఁచినచో నీలోకమున నీదీనురాలి నెవరు ప్రేమింతురు!'

హేమలత కన్నులనుండి నీరు జలజల జాఱి ముఖము దడిపెను.

అపుడు శైవలినిమనసు శాంత మయ్యెను. ఆమె హేమకన్నులు సస్నేహముగాఁ దుడిచి యిట్లనెను: 'హేమా! నన్ను క్షమింపుము. నీవు ధర్మపరాయణవు. పతివ్రతవు. అట్టి నిన్నుఁ గొంతసేపు సందేహించినందులకు క్షమింపుము.'

'వదినా! నీవు క్షమాపణ కోరవద్దు. నీదయ, నీప్రేమ, నీఋణ మీజన్మలో నేను తీర్చుకోలేను; జన్మజన్మాంతరము

లకుఁగూడ నీకు మఱుఁదలినై పుట్టవలె నను కోరిక తప్ప నాకు మఱి వాంఛ లేదు.'

కొంచెమునే పిడ్డలు మిన్నకుండిరి. ఇరువురనేత్రముల నుండి బాష్పములు స్రవించుచుండెను. అంతట శైవలిని హేమతో 'ప్రొద్దు పోవుచున్నది; నడు, నరేంద్రుని జూచి వత్తువు గాని' అని పలికెను.

శైవలిని వృక్షతలమున వేచియుండెను. హేమలత దేవాలయములోఁ బ్రవేశించెను. అప్పు డామె కుద్వేగము లేదు. నెమ్మదిగా నరేంద్రుని సమీపమున కరిగి, నమ్రభావముతో నేలవంకఁ జూచుచు నిలిచెను.

తనప్రాణసమాన యగు హేమలత యింతకాలమునకు లభించుటచే నరేంద్రుని హృదయ ముద్వేగపూర్ణ మయ్యెను. నోరు మెదల్ప లేక యతఁడు హేమలతహస్తమును బట్టుకొని పిపాసార్తునివలె నమృతమయ మగు నాముఖమండలమును జూడ సాగెను. ఆతనిశరీరము వణఁకుచుండెను. కనులనుండి యశ్రువులు జలజల రాలుచుండెను. హేమలత సహనము గోల్పోయి తల వంచెను. ఆమె నేత్రములు బాష్పధారలు కురియుచుండెను.

కొంతతడవునకు హేమలత స్థిరదృష్టితో 'నరేంద్రా!' అనెను.

నరేంద్రుఁడు చూచెను. ఆమెముఖమున నుద్వేగ చిహ్నములుగాని, లజ్జచిహ్నములుగాని లేక వదనము నిర్మల ముగ నుండెను. హేమలత 'నరేంద్రా!' యనెను.

౩౪

అప్పటికి దేవాలయములోని దీపములు దీసివేసిరి. జనులెల్లరు వెడలిపోయిరి. స్తంభములమీఁదను, ఆవరణము నను వెన్నెల పడుచుండెను. స్తంభములనీడలు నేలపై వాలి యుండెను. పార్శ్వమున యమునానది వెన్నెలలో శాంత ముగాఁ బ్రవహించుచుండెను. శీతలవాతము నదీజలము మీఁదుగా మందిరమున వ్యాపించి, యావలికి వీచుచుండెను. ఆరాత్రివేళఁ బవిత్రదేవాలయమున స్తంభపునీడను హేమ లతా నరేంద్రులు నిలిచియుండిరి.

హేమ దృఢముగా నిట్లనెను: 'నరేంద్రా! బహుకాల మునకు సమావేశ మయినది. ఇఁకఁ జిరకాలమునకుఁ గాని మరల సమావేశము కాదని నాయూహ. మన మనస్సులలోని సంగతి మాటలాడుదము. నరేంద్రా! చిన్నతనమున మన మిద్దరము గంగాతీరమున నాడుచు నెన్ని కలవరించువారము! ఇప్పుడు నీవు నైనికవ్రతమునవలంబించినావు; నేను పరస్త్రీని. నరేంద్రా! చిన్ననాఁటి స్వప్నములు నొక్కసారిగా మఱచి పొమ్ము!'

హేమలత కొంచె మూరకుండి మరల నిట్లు పలికెను: 'విధాత యింకొకరీతిగా లిఖించియున్నచో మనజీవితములు వేఱుగా నుండి, బాల్యస్వప్నములు సఫలములై యుండును. కాని, నరేంద్రా! మనము భ్రమచే విధాతను నిందింపరాదు. నీవు శౌర్యమును, గీర్తిని దయచేసినవానిని ధ్యానింపుము;

తప్పక నీ కతఁడు సుఖము లొసఁగును. నా కీలోకమున జన్మ మిచ్చి దేవతుల్యుఁ డగుభర్తను బ్రసాదించి శైవలినివంటి యాఁడుబిడ్డ నను గ్రహించి సంపదల నొసఁగిన దయాసముద్రు నకు నమస్కారము!'

కంఠమునఁ జీరచెంగు వేసికొని చేతులు జోడించి, విశ్వమున కాదిపూరుషు నుద్దేశించి యామె నమస్కారమొన ర్చెను. ఆ యమముఖము తేజోవంతము పవిత్ర శాంత రస పూర్ణము నై యుండెను.

నరేంద్రుఁడాశ్చర్యముతో హేమలతను విలోకించెను. ఆతనినోట మాట రాలేదు. హేమలత క్రమ్మఱ నిట్లు చెప్ప సాగెను: 'నరేంద్రా! నీ వనేక యుద్ధములు చేసినా వనియు, బహుదేశములు సంచరించినా వనియుఁ, గీర్తి సంపాదించితి వనియు వింటిని. నీవు ధర్మాత్ముఁడవు. భగవంతుఁడు నీకు సౌఖ్యము లిచ్చు గాక! నీవు యుద్ధవృత్తి మాన నెంతు వేని, కష్టములకుఁ గాని లేమికిఁ గాని లో నయితి వేని తిరుగ వీరనగ రమునకు రమ్ము. నీవు వచ్చిన యెడల నందఱు సంతోషింతురు. నాభర్తహృదయము నెఱుఁగుదును. ఆయన నిన్నుఁ దమ్మునివలెఁ బ్రేమించును. సస్నేహముగా నీవార్తలు చెప్పు చుండును. నీవు వత్తు వేని యాయన మిక్కిలి సంతోషించును!'

నరేంద్రుఁడు నీరసముగా నుండెను. హేమలత పలుకు లాతని చెవులలో నపూర్వగానము చేయుచున్నట్లు తోఁచెను. ఆతని హృదయము, నేత్రములు నిండుగా నుండెను.

హేమలత మరల నీవిధముగాఁ బలికెను: 'మఱి నీవు వచ్చినపక్షమున శైవలిని యెంతో సంతోషించును. బ్రతికి యున్నంతకాలము చెల్లెలివలె నీకు శుశ్రూష చేయుచుండును. భాయీ! నరేంద్రా! నిన్నుఁ జూచినప్పుడే నా కానందము!'

ఈస్నేహ వాక్యముల నాకర్ణింప నరేంద్రుని నేత్రములు మరల బాష్పపూర్ణము లయ్యెను. కొంతసే పుభయులు నిశ్శబ్దముగా నుండిరి.

తుదకు హేమలత కొంచెము గంభీరస్వరముతో నిట్లనెను: 'నరేంద్రా! ఇంకొకసంగతి, మనసులోఁ బెట్టుకొనవద్దు. నాపయి దోష మెంచవద్దు. నరేంద్రా! మనవీడుకోలు సమయమునఁ బ్రేమచిహ్నముగా నీవు నా కొకవస్తువు నిచ్చియుంటివి. దానిని ధరించుటకు నా కిఁక నధికారము లేదు. నరేంద్రా! నీవు దానిని బ్రతిగ్రహింపుము.'

హేమలత తన హస్తముమీఁద వస్త్రమును దొలఁగించెను; నరేంద్రుఁడు పెట్టిన మాధవీకంకణ మింకను జేతిపై నుండెను. తీఁగె యెండిపోయి ముక్కలయ్యెను; కాని, హేమలత యాఖండములను దారములతోఁ గట్టెను. నేఁ డామె దానిని జేతికిఁ బెట్టుకొని వచ్చినది.

ఇరువురకును వెనుకటిసంగతులు జ్ఞప్తికి రాఁజొచ్చెను. ఇరువురహృదయములు విషాదచ్ఛాయాచ్ఛన్నము లయ్యెను. కొంతసేపు వారు నిశ్శబ్దముగా నుండిరి. హేమలత చక్కని చేతులను మాధవీకంకణమును నరేంద్రుఁడు చూడసాగెను.

చూడంజూడ, నాతని నేత్రము లశ్రుపూర్ణములయ్యెను. ఇంక నతని కేమియుఁ గానఁబడ లేదు. తుదకు, దరవిగళితబాష్ప ధారలు హేమలతహస్తములను దడిపెను.చివరకు నరేంద్రుఁడు నిట్టూర్పు విడిచి 'హేమా! నీవు నన్నిఁక మఱచిపోవుదువా?' అనెను.

"బ్రతికి యుండఁగా నిన్ను మఱచిపోను. ఎల్లకాలము నన్నువలె నిన్ను, నీసంగతులను దలపోయుచుందును. ఇదిగో, యీకంకణము ప్రేమసూచకముగా నిచ్చినావు. నరేంద్రా! ఆప్రేమకు నాకు హక్కు లేదు. నీవు బాధపడవద్దు. కొన్ని యేండ్లు నే నీకంకణమును బూజించినాను. హృదయమునఁ దాల్చినాను. దీనిని విసర్జించుట యెంతకష్టమో నీ వెఱుఁగవు. అయినను దీని నూడఁదీయుము.నరేంద్రా! నేను విశ్వాసము లేని భార్యను కాను."

నరేంద్రుఁడు మౌనముతో నామెహస్తమునుండి మాధవీకంకణము విప్పెను.

'నరేంద్రా! నేను పోవుచున్నాను. నీవు ధర్మపరాయణుఁడవు. చిన్నతనమునుండియు ధర్మమునందు నీ కున్న ఆస్థ విడువ వద్దు. భగవంతుఁడు నీకు సుఖ మిచ్చును. విధి ప్రకారము మనము ప్రవర్తింతము.పుష్ప మొకటిరెండురోజులు పరిమళము వెదచల్లి యెండిపోవును. పక్షి కాంతిలో నుల్లాసము చెంది గానము చేయును. వానిపని యంతే. నరేంద్రా! నీవు యోధవు: శత్రువులను జయింపుము, దేశమునకు మేలుచేయు

ము, ఆశ్రయించిన దుర్బలులను గరుణింపుము. భగవంతుఁడు నాకు దేవతుల్యుఁ డగుభర్తను బ్రసాదించెను. పతిసేవయం దెన్నఁడు లోపము చేయకుండునట్లును,నిశ్చలభక్తిగలిగి నేను బతివ్రతగా నుండునట్లును దేవుఁడు నాకు దోడ్పడుఁ గాక! అన్నా! నరేంద్రా! చిన్నతనమున నీవు నాకు ధర్మములు బోధించితివి; ఈపవిత్రదేవాలయమునఁ దిరుగ నాధర్మము లుపదేశింపుము. అన్నా! ధర్మమార్గము నెన్నఁడు విడువనని నీవు, నిరంతరము పతివ్రతనై యుందునని నేను బ్రతిజ్ఞలు చేయుదము రమ్మ!' ఈవాక్యములు ముగించి హేమలత విగ్రహము నెదుటఁ బ్రణామము చేసెను. నరేంద్రుఁడు నిశ్శబ్దముగాఁ బ్రణమిల్లెను.

లేచి, హేమలత నరేంద్రుని చేయి సయత్నముగాఁ బట్టుకొని 'అన్నా! సెల విమ్ము! నిరంతరము నిన్ను నే నన్నవలెఁ బ్రేమింతును; నీవు నన్ను జెల్లెలివలె భావింపుము' అని చెప్పి బాష్పకణము తుడిచికొని మెల్లమెల్లన దేవాలయము నుండి బయలువెడలెను.

కంటికిఁ గానఁబడుచున్నంతవఱకు నరేంద్రుఁ డామె వంకఁ జూచుచుండెను. తరువాతనో? తరువాత, నరేంద్రుని శోకము నాలోకించుచోఁ లోకములోఁ బరమనిర్భాగ్యుఁడు సైతము విషణ్ణుఁ డగును. ఆదీనునిహృదయము జ్ఞానశూన్యమయ్యెను.ప్రణయవృత్తాంతము నాఁటితో సమాప్తినొందెను.

మాధవీకంకణము నక్కునఁ జేర్చి నరేంద్రుఁడు యమునా తీరమునఁ గూరుచుండెను. 'దీనిని విప్పుము, దీనిపై నా కధికారము లేదు. నరేంద్రా! నేను విశ్వాసము లేని భార్యను గాను' అనెడి యామెపలుకులు మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆప్రేమచిహ్నము నుంచికొనుటకు నరేంద్రున కధికారము గలదా! రేయి యంతయు దాని నాతఁడు హృదయముపై నుంచికొని ప్రాతఃకాలమున శూన్యహృదయముతో దానిని వదలిపెట్టెను. యమునానదీజలమునఁ దేలియాడుచు శుష్కకంకణ మదృశ్యమైపోయెను.

## ౩౯

వంగ దేశమునుండి షాహా సుజా యుద్ధారము రెండవ పర్యాయము బయలుదేఱెను. శీతకాలమున ప్రయాగదగ్గఱ సుజాకు ఔరంగజేబుకు యుద్ధము జరిగెను. రెండురోజులు పోరాడి పరాజితుఁడై సుజా పాఱిపోయెను. ఈయుద్ధమున జస్వంతసింగు ఔరంగజేబునకు విరుద్ధముగానుండ యత్నించెను. కాని, తీక్ష్ణబుద్ధియగు న్మామహాయోధకు నష్టము కలిగింపలేక రాజస్థానమునకు తురలిపోయెను.

సుజా ప్రయాగనుండి పాట్నాకు, పాట్నానుండి ముంగేరుకు, ముంగేరునుండి రాజమహాలుకు, అచ్చనుండి గంగానది దాఁటి తండాకు పలాయనము చేసెను. ఔరంగ్‌జేబు కుమారుఁడు మొహమ్మదు, సేనాపతి అమీర్‌జుమ్లా యును సుజాను వెంబడించిరి. తండాలో మొహమ్మదు సుజాపుత్రికను

బెండ్లియాడి, యాతనిపక్షమునఁ జేరెను. అట్లయినను, అమీర్‌జుమ్లా యిరువుర నోడించెను. పిమ్మట మొహమ్మదు తనతండ్రిధూర్తపత్రికను నమ్మి భార్యను సుజాను ద్యజించి వెడలిపోయెను. పాపము! ఆరోకాన్ దేశమునకుఁ బాఱిపోయెను. అక్కడిరాజుతో విరోధము సంభవించుటచే సుజా ససైన్యముగా నిహతుఁ డయ్యెను. ఆయనదుహితను రాజు వివాహము చేసికొనెను. రూపవతియగు ప్యారీబానూ విచారముచే నాత్మహత్య చేసికొనె నని జనశ్రుతి కలదు. ఎవఁడు వంగదేశము నిరువదిసంవత్సరములు పాలించి పాలనమున కరుణను, యుద్ధమున సాహసమును, హిందువులయెడల నౌదార్యమును జూపి ఖ్యాతి గాంచెనో; ఎవ్వని రాజమహాలు నగరమందలి ప్రాసాదము మర్త్యలోకమున నమరావతివలె నుండి దివారాత్రము లానందలహరీనిమగ్నమై యుండెడిదో; అట్టి సుజా మరణకాలమునఁ దల దాఁచుకొనుటకుఁ జోటులేక విదేశమున శత్రువు చేత సకుటుంబముగా నిహతుఁ డయ్యెను.

దారా శ్యామనగరము (ఫతే ఆబాద్) యుద్ధమునఁ బరాజయమునొందినపిమ్మట సింధుదేశమునకుఁ బలాయనము చేసెను. ఔరంగ్‌జేబుసైన్యము దారా నక్కడనుండి దిల్లీనగరమునకుఁ గొనిపోయెను. నృశంసుఁడు ఔరంగ్‌జేబు తన యన్నగారి నిచ్చవచ్చిన ట్లవమానించి వధించెను. చెఱసాల యందున్న మురాద్ కూడఁ ద్వరలోఁ బ్రభువునానతిచే నిహతుఁ డయ్యెను. భ్రాతృరక్తస్నాతుఁడై ఔరంగజేబు భారతవర్షసింహాసనము నధిరోహించెను.

మధురలో హేమలతను జూచిన నాఁటినుండి నరేంద్రు నకు మతిపోయిన ట్లయ్యెను. వంగ దేశమునకుఁబోయినపిమ్మట హేమలత నరేంద్రునిగూర్చినవార్త లరయుచుండెను. ఉదార హృదయుఁడగు శ్రీశచంద్రుఁడు దేశదేశముల యందు నరేంద్రుని వెదకించుచు, నాతఁడు మరలి వచ్చినచో జమీలో సగముపాలు నిత్తునని చాటించెను. కాని, నరేంద్రుఁ డానాఁటి నుండి యెవ్వరికిని గనఁబడ లేదు.

హేమలత వీరనగరమునఁ దనభర్తతో నివసించు చుండెను. మధురానగర దేవాలయమునఁ దాను జేసిన ప్రతిజ్ఞ నామె విస్మరింప లేదు. ధర్మపరాయణ యగు హేమలతకుఁ బతిసేవయందే కాలము గడచుచు, వేఱుతలంపులు కలుగుట మానెను. పతిభక్తి తప్ప నామెకు వేఱొక ధర్మము తెలియ కుండెను. క్రమముగా నామెకు హేమంతకుమారి, సరయూ బాల యను పుత్రిక లిరువురును, ప్రతాపుఁడను కుమారుఁడును జన్మించిరి. ఇరువదియేండ్లక్రిందట శ్రీశుఁడు, నరేంద్రుఁడు, హేమలతయు సాయంకాలమునం దాటలాడుచున్నట్లే తన కుమారుఁడు కుమారితలు గంగయొడ్డున నాడుచుండ హేమ లత బాష్పవికసిత నేత్రములతో విలోకించును. పిల్లలు గంతులు వేయుచు, పరుగులిడుచు నానందధ్వనితోఁ గుంజ వనము ప్రతిధ్వను లీనునట్టు లాడుచుందురు. సంసారమున నొకతరము దాఁటి రెండవ తరము వచ్చినది. శిశువులముఖ

ములు చింతాశూన్యములై, నేత్రములు తేజోవంతములై యున్నవి.

వివాహమయిన తరువాత రమారమి పదిసంవత్సరము లకు హేమలత తన సంతానమును వెంటఁబెట్టుకొని, యొక సన్యాసిని సందర్శింప నతనియాశ్రమమునకుఁ జనెను. వీరనగర మునకుఁ గొన్ని క్రోసుల దూరమునఁ బ్రసిద్ధమైన శాల్మలీ వృక్షము గలదు. వృక్షముస్కంధమున కించుమించుగా మూఁడువైపుల నూడలుగోడలవలెఁ బెరిఁగినవి. చూచువారికవి యన్నియుఁ బెద్దగృహమువలెఁ గానఁబడును. ఆవింతయింటిలో సన్యాసి కొన్ని సంవత్సరములనుండి నివసించుచుండెను. పల్లెల లోని యిల్లాండ్రును బాలికలును సానురాగముగా నాజడదా రికిఁ బ్రత్యహము పాలు, పండ్లు, దుంపలు సమర్పించుచుందురు. వానితో నాయన జీవించుచుండెను. ఇంచుమించుగాఁ బగ లంతయు నతఁడు ధ్యానమునం దుండును; సాయంకాలమున గ్రామములో నింటింటికిఁ బోయి శోకవిహ్వలుల నూఱడిం చుచు, రోగులకు శుశ్రూష చేయుచు, దీనులకుఁ దోడ్పడుచు మానవుల కష్టములను దొలఁగించుట తనకు నియమముగాఁ బెట్టుకొనెను. అర్ధరాత్రమువఱకు నీ పనులు చేయుచు,పిమ్మటఁ దన తనుగృహమున కరిగి, యన్నిఋతువులలోను నొకేవిధ ముగా నతఁడు గడ్డిపై నిద్రించును. ఆకోటరమున నున్న జడ దారిని దర్శించుటకు వివిధగ్రామములనుండి యనేకులు వచ్చు చుందురు.

హేమలత వృక్షమునకుఁ గొద్దిదూరమునఁ బడవ దిగి, కాలినడకను మెల్లమెల్లగా వృక్షముకడకు జని, మునికి నమస్కరించెను. పిమ్మటఁ దన పిల్లల నెత్తుకొని, నిలిచియుండి తాపసునివంకఁ జూడసాగెను. అటనుండి దృష్టి మరల్పలేక యామె నిష్పందముగా విలోకించుచుండెను.

తపసియు హేమలతను నిశ్చలదృష్టితో వీక్షించెను. అనురాగపూరిత నేత్రములతో హేమలత నమస్కరించుటఁ జూచెను. సతృష్ణముగా నామె సంతానమును విలోకించెను. చూడఁజూడ. నాతనిహృదయము గ్రక్కదలినట్లు, కంట బాష్పకణముగ్రమ్మినట్లు నున్నది. తుదకు సన్యాసి ధీరముగా హేమలతదగ్గఱకు వచ్చి శిశువుల మస్తకములపై హస్తముంచి యాశీర్వదించి నిశ్చలదృష్టితో నామె నవలోకించుచు 'దైవసముఁ డైన భర్తయెడ నీకు నిశ్చలభక్తి యుండును గాక! పరమపతివ్రతవై వెలయుదువు గాక!' యని పలికెను.

సన్యాసి నెమ్మదిగా వెడలిపోయెను. అటుతరువాత నాతరుతలమున నాతఁ డెవ్వరికిని గానఁబడ లేదు. ఆగ్రామము నుండి యాతఁ డెచ్చటికిఁ బోయెనో యెవ్వరికిని దెలియలేదు.

సమాప్తము.



మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి.